
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
19-25, డిసెంబర్, '86
రు. 2-75
అభినేత్రి భానుప్రియ సమాధానాలు!
సింగపూర్‌లో భారతీయ మహిళల 'అన్నలక్ష్మి'




సురేష్ ప్రొడక్షన్స్

# గురుబ్రహ్మ

RAMGOPAL

నిర్మాత డి.రామానాయుడు

దర్శకత్వం బి.సుబ్బారావు

## ముఖ చిత్రం

నటి పూర్ణిమ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది

-కుంచం శ్రీనివాస్ ద్రాక్షారామం

## కథలు

నటి పూర్ణిమ ముఖచిత్రంతో వెలువడిన సంచికలో వేదుల వెంకట రమణమూర్తి గారి వందనోటు కథ చిన్నదైనా వాస్తవానికి దగ్గరగా వుంది శ్రీనివాసరావు లాంటి మతిమరపు మనుషులవలన యితరులు ఏ విధంగా శిక్ష అనుభవిస్తారో రచయిత చక్కగా వివరించారు

గొర్పిల్ల రమణారావు లక్ష్మీబాయి ఖర్గపూర్

★ ★ ★

21 27 నవంబరు 1986 సంచికలో ప్రచురితమైన శ్రీ పులిగడ్డ విశ్వనాదరావుగారి నిరుపేదకంటే హీనుడు కథ నేటి సమాజంలో ఒక వర్గంవారు అనుభవిస్తున్న కష్టనష్టాలకు ప్రతిబింబమే నిరుపేదకంటే హీనుడైన చలం లాంటి చిన్నారులకు రోటరీ లయన్సు వంటి క్లబ్బులు ఆదుకోగలవని ఆశించవచ్చా?

ఆకుమళ్ల దుర్వాసబాబు తిరుపతి

★ ★ ★

పూర్ణిమ ముఖచిత్రంతో వెలువడిన సంచికలో ఆరు కథలూ ఆణిముత్యాల్లా వున్నాయి హారన్ కథ మరీ మరీ బాగుంది దానికంటే మరింత బాగున్నది తొందరలో మరచిపోలేనిది పులిగడ్డ విశ్వనాదరావు గారు వ్రాసిన 'నిరుపేదకంటి హీనుడు

నేటి సమాజంలో చలం లాంటి నిరుపేదకంటె హీనులు ఎందరో వున్నారు వీరంతా కులానికి పెద్దలు, కూటికి పేదలు ఈ జాతివారికి ప్రభుత్వం ఏ విధంగానూ సాయపడదు ఈ హీనులకు కాస్తంతైనా సహాయం అందించాలనే దృష్టితో మా పాఠశాలలో అయిదారేళ్ళుగా బుక్ బ్యాంక్ నిర్వహిస్తున్నాము ఏ కులానికి చెందినా పుస్తకాలు కొనలేని నిర్భాగ్యు లెందరో మా బుక్ బ్యాంకు ద్వారా సెకండ్‌హేండ్




పుస్తకాలు తీసుకుని ఉపయోగించుకుంటున్నారు ఈ కథ చదివాక మా స్కూల్లోని బుక్ బ్యాంక్ నాకెంతో గొప్పగా అనిపించింది

-వక్కలంక రామారావు మానేపల్లి

## సీరియల్స్

నటి పూర్ణిమ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది కొత్త సీరియల్ రసరాగ వాహిని ప్రారంభంలోనే చాలా బాగున్నది

డాక్టర్ చోడా బత్తుల సత్యనారాయణ కుప్పనపూడి

★ ★ ★

పూర్ణిమ ముఖచిత్రంగల పత్రికలో రసరాగ వాహిని సీరియల్ ప్రారంభంలోనే ఆకట్టుకుంది రచయిత్రికి కృతజ్ఞతలు

-పి చంద్రశేఖర్ దూపాడు

★ ★ ★

నటి పూర్ణిమ ముఖచిత్రంతో వెలువడిన 21-27 నవంబర్ సంచిక అందానికి అనుగుణంగా ఉంది కొత్త శీర్షిక దూరదర్శనం కొత్త సీరియల్ రసరాగ వాహిని ఈ సంచికలో ప్రారంభం కావడం ఒక విశేషం

-బళ్ళారి మహమ్మద్ సలీమ్ గుత్తి

(74 వ పేజీ చూడండి)






# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938 1972)

19_25 డిసెంబర్, 1986.

శ్రీ అక్షయనామ సం మార్గశిర బ తదియ

సంపుటము 79 : సంచిక 16

ముఖ్య సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు

మతుకుమల్లి మాధవరావు

విడి ప్రతి వెల రు 2 75

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం విజయవాడ-520 003


విషయానుక్రమణిక

ముఖచిత్రం

నటి భానుప్రియ

(ఫోటో ఎం కె రామమూర్తి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర రచనలు పంపదలచుకున్నవారు
సంపాదకుడు,
ఆంధ్రసచిత్ర వారపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-520 003.
అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి — హామీపత్రం జతచెయ్యాలి

★ గేయాలు తిప్పి పంపబడవు వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం

★ కథలుగాని, యితర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు — వారి స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని— తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే- రచయితలు — రచన పేరు — అది పంపినతేదీ, వాటి గురించి పరిశీలించడం కష్టం

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్లలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ ''ప్రతు''లను — కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు

సం॥

# నిర్హేతుకమైన భయోత్పాతం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

కోళాయి తిప్పగానే వేడినీళ్లో చన్నీళ్లో వచ్చినట్టు ఆధునికీకరణ వస్తుందని మనమనుకుంటాము కానీ ఆధునికీకరణకు మనం చెల్లించాల్సిన మూల్యం చాలా ఎక్కువగా ఉంటుంది అంతేకాక ఒక్కోసారి రక్తం చిందించవలసిన అవసరం కూడా ఉంటుంది యూరప్ ఇవాళ ఉన్నట్టుగా రూపొందడానికి వందేళ్ళకన్నా ఎక్కువే పట్టింది రష్యాలో బోల్షివిక్కులు అధికారంలోకి వచ్చాక సరిహద్దు అవతలి తమ పొరుగువాళ్ళు శతాబ్దంలో సాధించిన దానిని వారు పదేళ్ళలో పూర్తి చేసే ప్రయత్నం చేశారు ఆ కృషి పూర్తయిపోయాక చూసుకుంటే స్టాలిన్ చేతుల మీద మున్నీ మధ్యనే మరణించిన ఆయన సహచరులైన మొలటోవ్ వంటి వాళ్ళ చేతుల మీద నెత్తుటి మరకలే మిగిలిపోయాయి స్టాలిన్ అతని విప్లవ సహచరులు కలిసి రెండు కోట్లమంది రష్యన్లను చంపివేశారు నేను సహజ మరణాలకు గురయిన స్త్రీ పురుషుల సంగతి చెప్పడంలేదు వీళ్ళందరూ అతి దారుణమైన మారణహోమంలో చంపబడిన స్త్రీ పురుషులు హిట్లర్ సాగించిన మారణకాండను మినహాయిస్తే దీనంత దారుణమైన ఉదంతం మరొకటిలేదు వాళ్ళలో దాదాపు అందరూ రైతులే ఇటీవల లోక్‌దళ్‌లో చేరి హఠాత్తుగా రైతుల మిత్రులయినప్పటికీ, మాస్కో భక్తుల శిబిరంలో ఇంకా ఓ కాలు మోపే ఉన్న హెచ్ ఎన్ బహుగుణ వంటివారు ప్రొఫెసర్ రాబర్ట్ కాంక్వెస్ట్ రాసిన "ది హార్వెస్ట్ ఆఫ్ సారో సోవియట్ కలెక్టివైజేషన్ అండ్ టెర్రర్ ఫామిన్" అనే పుస్తకం చదవడం మంచిది. ఒక దశాబ్ద కాలంలో స్టాలిన్ తదితరులు తమ పాలితులలో రెండు కోట్ల మందిని ఎంత క్రూరంగా హత్య చేశారో ఈ పుస్తకంలో ఒళ్ళు గగుర్పొడిచేలా వివరించారు.

స్టాలిన్ పాలన ప్రధానంగా తీవ్రవాద పాలన అది కల్తీ లేనిది, సందేహం లేనటువంటిది. అటువంటి భయోత్పాతం మీద ఆధారపడినటువంటిది ఈ హింసకు ఎటువంటి హేతుబద్ధమైన కారణం లేదన్న భయంకరమైన వాస్తవం కూడ, సోవియట్ రష్యా వ్యవహారాల నిపుణుడూ అయిన కాంక్వెస్ట్ పుస్తకం ద్వారా వెల్లడవుతున్నది వాస్తవానికి ఇవాళ మనకు పంజాబ్‌లో కనిపిస్తున్నట్టు ఎప్పుడూ ఎక్కడా తీవ్రవాదానికి హేతుబద్ధత ఉండదు కాని జోసెఫ్ స్టాలిన్ వంటి నియంత లక్షలాది మంది సోవియట్ రైతుల్ని ఎందుకు వధించాడు? కాంక్వెస్ట్ రెండు కారణాలు లేదా అంశాలు చెప్తాడు అవి రైతాంగంలో పార్టీ చేసిన పోరాటం, ఉక్రేనియన్ జాతీయ భావాలతో పార్టీ జరిపిన పోరాటం.

స్టాలిన్ పాలనకు ఖచ్చితంగా కులక్‌లనబడే వాళ్ళ వలనగానీ (ధనవంతులుగా కమ్యూనిస్టుల చేత బాధించబడినప్పటికీ నిజానికి అంత ధనికులు కాని రైతులే కులక్‌లు) ఉక్రేనియన్ జాతీయవాదులతో గానీ ఏ ప్రమాదమూలేదు. 1928 వరకూ కులక్‌లు అధికారంలో ఉన్నవారితో శాంతియుతంగానే గడుపుకొచ్చారు వాళ్ళలో చాలామంది అంతకు ముందు ఎర్రసైన్యంలో సైనికులుగా పనిచేసి కమ్యూనిజానికి కట్టుబడి ఉన్నవారు ఎవరో కొందరు మొండి ఘటాలు తప్ప ఉక్రేనియన్ జాతీయవాదులు కూడా సోవియట్ యూనియన్‌లో విలీనం కావడానికి పూర్తిగా సిద్ధపడ్డారు మరి స్టాలిన్ అమలుచేసిన హత్యాకాండ ఎందుకు జరిగింది? బోల్షివిక్కులకు సంప్రదాయకంగా రైతాంగం పట్ల ఏ రకమైనదైనా జాతీయ భావాలపట్ల ఉన్న అపనమ్మకమే ఈ హత్యాకాండకు కారణమని కాంక్వెస్ట్ అంటాడు సువిశాలమైన యు ఎస్ ఎస్ ఆర్ లో వివిధ జాతులు సహజీవనం చేస్తున్నాయనే కబుర్లన్నీ బూటకపు కబుర్లే. అది గొర్రెలు తోడేలుతో సహజీవనం చేయటం లాంటిది కులక్‌ల ఆర్థిక ఆధిపత్యాన్ని ఉక్రేనియన్ల జాతీయ అభిమానాన్ని విశిష్టతను సహించని నిరంకుశ ప్రభుత్వాన్ని నిర్మించాలని స్టాలిన్‌కుగల కోరికే దాని ప్రధాన కారణం నాటీల ఫాసిస్టుల కోరిక వంటిదే ఇది కూడా ఏది ఏమైనాసరే కులక్‌లనూ ఉక్రేనియన్లనూ సర్వనాశనం చేయాలన్నదే ఆ కోరిక ఇప్పుడు గోర్బచేవ్ ప్రభుత్వం కూడా వేళ్ళమీద లెక్క పెట్ట దగినంత మందే వున్న అసమ్మతివాదులను అలాగే నాశనం చేస్తున్నది

ప్రపంచానికి గోర్బచేవ్ అతని మిత్రులూ ప్రదర్శించదలచుకున్న కమ్యూనిజం రూపానికీ సోవియట్ పౌరులు చూస్తున్న దాని నిజమైన రూపానికీ చాలా తేడా ఉన్నది ఉక్రేనియన్లు తదితరులు చూసిన రూపం మరింత పాశవికమయినది సామూహికీకరణ వెన్నంటి సాగి వచ్చిన క్షామంలో ఉక్రెయిన్‌లో ఆకలిచావులు విపరీతంగా సంభవించాయి. అక్కడ కులక్‌లపై వ్యతిరేక ప్రచారంతో బాటు, స్థానిక జాతీయవాదపు అవశేషాలన్నిటి మీదా యుద్ధం ప్రకటించబడింది ఈ సామూహికీకరణ వెబ్స్, బెర్నార్డ్‌షా వంటి సోషలిస్టులందరినీ ఆకర్షించడమే గాక భారత దేశానికి కూడ ఉపయోగకరమని నెహ్రూ కూడ ఒకప్పుడు భావించారు

బోల్షివిక్కుల దృష్టిలో విప్లవ కరవాలానికి దయాదాక్షిణ్యాలు లేవు పస్తులతో ఉన్న తమ కుటుంబాలకు ఆహారం పట్టుకొస్తున్న ఉక్రేనియన్ రైతుల్ని వచ్చిరాగానే కాల్చి చంపారు గ్రామాలన్నీ రైతుల కుళ్ళిన శవాలతో నిండిపోయాయి రైతులు ఉక్రేనియన్లూ కావడమే వాళ్ళు చేసిన నేరం

అసలు నేను కాంక్వెస్ట్ పుస్తకాన్ని ఎందుకు ప్రస్తావించాల్సి వచ్చింది? మొదటిది గోర్బచేవ్ ఇక్కడికి వచ్చినప్పుడు ఆయనకు ఈ పుస్తకం ప్రతినొకదానిని ఎవరైనా బహూకరిస్తే బాగుండేది ఎందుకంటే, విప్లవం పేరుమీద జరిగిన ఈ దారుణ సంఘటనలు, నేరాలు గుర్తుండే వయసుకాదు గోర్బచేవ్‌ది. ఇక రెండోది, మనలో చాలామంది రక్తపాతంతో కూడిన విప్లవ మార్గాలు ఎప్పుడూ నిరంకుశత్వానికి దారితీస్తాయని గుర్తించకుండా వాటిని ఎంచుకోవడానికి సిద్ధంగా ఉన్నారు మనలో చాలమంది చర్చలతో సామరస్యంగా సాధించలేని విషయాలను భయంతోనూ, బలప్రయోగంతోనూ చాలా సులువుగా సాధించవచ్చని అనుకుంటున్నారు సరిగ్గా ఈ లక్షణాలే నిరంకుశప్రభుత్వం ఏర్పడడానికి కారణమవుతాయి ప్రభుత్వం ఇప్పటికే హస్తగతం చేసుకుంటున్న అధికారాలను చూస్తే మనం ఆ మార్గంలో సగం దూరం వచ్చినట్లే అనిపిస్తున్నది

మీరెక్కిన కారునో బస్సునో నల్ల చొక్కాలు ధరించిన కమాండోలు తుపాకి చూపి హఠాత్తుగా ఆపేసి బడాసాబ్‌లు క్షేమంగా వెళ్ళిపోయే వరకూ మీ వాహనాన్ని దగ్గర్లోని ఏ సందు లోనో ఆపి ఉంచమని ఆజ్ఞాపించకుండా ఢిల్లీ రహదార్ల మీద మీరు ఎక్కడికీ వెళ్ళలేరు నేను ఇటీవల ఓ రోజు చండీఘర్ వెళ్ళాను గత పది సంవత్సరాలుగా ఏడాదికోసారి నేను తప్పనిసరిగా వెళ్తా ఆ నగరం నిజానికి ఒకప్పుడు చాలా ఆహ్లాదకరమైన నగరం కాని ఇప్పుడది ఒక నగరంలా కాక నిర్బంధ శిబిరంలా ఉన్నది అక్కడ మంత్రులు ఉన్నతాధికారులూ మినహాయిస్తే మిగతావారంతా ఆయుధధారులైన భద్రతాదళ సిబ్బంది దయాదాక్షిణ్యాల మీద బతుకుతున్నారు ఇది ఇలా ఉండడానికి తగిన కారణాలు ఉంటే ఉండవచ్చుగాక కాని చండీఘర్‌లోనో నానాటికీ మరింతగా సైనిక శిబిరంలా తయారవుతున్న ఢిల్లీలోనో మాత్రమేగాక దేశంలోని ప్రతి నగరంలోనూ ఇలాంటి పరిస్థితి ఏర్పడితేఏమవుతుంది? యుద్ధానికి ముందు బెర్లిన్ కూడ ఇలాగే ఉండేదనీ, హిట్లర్ ఆయన గూండాలు వెళ్ళేప్పుడు వీధులు ఖాళీ చేయించేవారని విన్నాను యూదులతో హిట్లర్ ఎలా ప్రవర్తించాడో ఉక్రేనియన్లతో స్టాలిన్ అలాగే ప్రవర్తించాడు వాళ్ళు చేసినవి సమర్థించడానికి గోబెల్స్, మొలటోవ్ వంటి వ్యక్తులూ ఉండేవారు ఇక్కడ మనకు కూడా అలా సమర్థించేవారున్నారు వాళ్ళు గతంలో శ్రీమతి గాంధీ మాట్లాడిన ప్రతి మాటా పట్టుకుని వేళ్లాడేవారు ప్రస్తుతం ఆమె కుమారుని మాటని శిరోధార్యంగా భావిస్తున్నారు చివరికి అలాంటి మనుషులే ప్రజాస్వామ్యాన్ని ఉరితీసే తలారులుగా తయారవుతారు. □




నిర్మాత **పి.శశిభూషణ్** స్క్రీన్‌ప్లే-దర్శకత్వం **కోడి రామకృష్ణ** పరుచూరి బ్రదర్స్ • గోపాలరెడ్డి • మహదేవన్ నవయుగ విడుదల

---




## అతి రుచికరమైనది

# క్రేన్

## వక్కపొడి

## దీనికిసాటి మరొకటిలేదు















సీరియల్



# ఆరోహణ

## శైలకుమార్

(గత సంచిక తరువాయి)

రెండు రోజులు గడిచి పోయాయి ఆ రెండు రోజుల్లోనూ నీలిమ దగ్గరకి వెళ్ళాలని ఆమెకు తన రచనలు చూపించాలని ప్రతిక్షణం అనిపించింది చక్రవర్తికి మనసును బలవంతంమీద నిగ్రహించుకున్నాడు మూడవ రోజు సాయంత్రం ఇక ఆగలేక పత్రికల్లో వచ్చిన అతని రచనల కటింగ్స్ పట్టుకుని నీలిమ దగ్గరకు బయలు దేరాడు

వరండాలో కూర్చుని పుస్తకం చదువుకుంటున్న నీలిమ చక్రవర్తి రావటంతో లేచి అతన్ని ఆహ్వానించింది

మీ చదువు పాడు చేసినట్లున్నాను

అదేంలేదు కూర్చోండి

ఇద్దరూ కూర్చున్నారు

ఏం పుస్తకమండీ అది?

మేఘమాల దేవులపల్లి శాస్త్రి సినిమా పాటల సంకలనం

నాకెంతో ఇష్టం ఆ పుస్తకం

ఎవరికి ఇష్టం వుండదు చెప్పండి నవ్వుతూ అంది నీలిమ

నిజమే. శోక భీకర తిమిర లోకైక పతిని అంటూ బాదను కూడ ఎంత గర్వంగా చెప్పాడాయన అన్నాడు చక్రవర్తి తన్మయంగా

అతన్నే చూస్తూ వుండి పోయింది నీలిమ

'మీ రచనలా అడిగింది అతని చేతిలోని కాగితాలు చూసి

ఔను మీరు చదివి నిర్మొహమాటంగా విమర్శించాలి చెప్పాడు అవి ఆమెకు అందిస్తూ

జరిగిన కథ-2 హీరో హీరోయిన్లపై పాట చిత్రీకరణ జరుగుతుండగా ఆ పాట రచయిత చక్రవర్తి అక్కడికొస్తాడు. ఎన్నో చోట్ల సన్మానాన్ని నిరాకరించిన చక్రవర్తి తిరుపతితో తనకున్న అనుబంధం మూలంగా అక్కడ సన్మానానికి అంగీకరిస్తాడు సన్మాన సమయానికి ఎక్కడో దూర ప్రాంతంలో షూటింగులో ఉన్న హీరోయిన్ మానస అక్కడికి చేరుతుంది నీలిమను చూడగలననే ఆశతోనే తిరుపతి వచ్చిన చక్రవర్తి ఆశ ఫలిస్తుంది నీలిమ చక్రవర్తి ఒకరి సంగతులనొకరు కనుక్కుంటారు చక్రవర్తికి పదేళ్ల క్రింది స్మృతులు మదిలో మెదులుతాయి ఆఫీసులో హేళనలకు గురవుతుండే కవి చక్రవర్తి ఊరట కోసం కపిలతీర్థం వెళ్ళి అక్కడ ఒక శ్రావ్యమైన గొంతులో తన పాట వింటాడు చివరికి ఆ స్త్రీ– నీలిమ– తో పరిచయం చేసుకుంటాడు చక్రవర్తికి స్నేహితుడు ప్రభాకర్ బాసటగా నిలుస్తాడు

విమర్శించేంత శక్తి నాకు వుందమ్మా!

ఉందని నా నమ్మకం

ఏమిటి ఆధారం మీ నమ్మకానికి చిలిపిగా అడిగింది

ఇప్పుడిప్పుడే వెలుగు చూస్తున్న నా కవిత్వాన్ని గుర్తు పట్టిన మీ మేధస్సు

నన్ను మరీ పొగుడుతున్నారు' అంది చక్రవర్తి రచనలు పరిశీలిస్తూ

సిగరెట్టు వెలిగించుకున్నాడు చక్రవర్తి

చాలా వచ్చాయే! సంకలనం వేయక పోయారా? అంది తనే నీలిమ

'వెయ్యాలనే ప్రయత్నం కాని ఆర్థిక పరిస్థితి అందుబాటులో లేదు

చక్రవర్తి మొహంలోకి చూసి తల దించుకుంది నీలిమ

అన్నీ చదివి ఇస్తాను ఓ వారంలో అంది

మీరు చదవాలనే కదా తీసుకొచ్చాను తొందరేం లేదు తీరిగ్గా చదవండి అన్నాడు నవ్వుతూ

'థాంక్స్

ఆ మాట నేననాలి

ఎందుకూ కుతూహలంగా అంది

ఓపిగ్గా నా రచనలు చదువుతున్నందుకు నవ్వుతూనే అన్నాడు చక్రవర్తి

నవ్వలేకుండా వుండలేక పోయింది నీలిమ

కవిత్వం అన్నా కథలన్నా నాకు చాలా ఇష్టం రోజులో ఎక్కువ భాగం చదువుతూనే గడుపుతాను చదవటం వల్ల లభించే ఆనందం తృప్తి చదివే వాళ్ళకే తెలుస్తుంది తన్మయంగా చెప్పింది నీలిమ

ఔనండీ పుస్తకం కంటే మంచి స్నేహితుడు లేడంటారు

నిజమే కొన్ని పుస్తకాలు చదువుతుంటే ఆత్మీయమైన వ్యక్తితో అన్ని విషయాలు చెప్పుకున్నట్లు వుంటుంది అంది నీలిమ దూరంగా ఆకాశంలో కనిపించే మేఘాలను చూస్తూ

మీ ఇంట్లో మంచి లైబ్రరీ వుందనుకుంటాను

లైబ్రరీ అనలేను కాని నా అభిరుచి మేరకు కొన్ని పుస్తకాలు సేకరించాను

నేనొకసారి చూడచ్చా?" అడిగాడు చక్రవర్తి

తప్పకుండా' అని పైకి లేచింది నీలిమ తనూ లేచాడు చక్రవర్తి

రండి ప్రక్క గదిలో నేవున్నాయి." అని వరండాకు ఆనుకుని ప్రక్కగా వున్న గదిలోకి దారి తీసింది నీలిమ

రూములో కనిపించిన పుస్తకాలను చూసి చాలా ఆశ్చర్యపోయాడు చక్రవర్తి దాదాపు వెయ్యికి పైగా వున్నాయి పుస్తకాలు అందంగా అట్టలు వేసి గాజు తలుపుల అల్మారాలలో చక్కగా అమర్చబడి వున్నాయి

చూస్తూ వుండండి వస్తాను అని ఇంట్లోకి వెళ్ళింది నీలిమ

గదంతా కలయ చూశాడు చక్రవర్తి. చాలా శుభ్రంగా ఎక్కడ ఏ వస్తువు వుండాలో అక్కడ అమర్చబడి వున్నాయి అన్నీ. కిటికీ ప్రక్కనే ఒక టేబులు, కుర్చీ వున్నాయి. టేబులు మీద ఒక మూలగా బుద్ధుడి విగ్రహం వుంది. దానికి ప్రక్కగా కొన్ని తెల్ల కాగితాలు, అట్ట వున్నాయి.

తిరిగి పుస్తకాల వైపు దృష్టి సారించాడు చక్రవర్తి. ఏఏ అల్మరాల్లో ఏఏ పుస్తకాలు వున్నాయో తెలిసేందుకు వీలుగా వాటి మీద కాగితాలు అంటించబడి వున్నాయి, నవలలు, నాటకాలు, కవితలు అంటూ. ఆయా రచయితకు చెందిన అన్ని పుస్తకాలూ ఒకే చోట వుంచబడ్డాయి. చలం, శరత్, బుచ్చిబాబు, గోపీచంద్, కుటుంబరావు, విశ్వనాథ, బాపిరాజు, గోర్కీ, మొపాసా, మామ్, హెర్మన్ హెస్, శ్రీశ్రీ, దేవులపల్లి, ఆరుద్ర, దాశరథి, తిలక్, గాలిబ్, ఉమర్ ఖయ్యాం, గురజాడ, మయకోవ్‌స్కీ, షెల్లీ, కీట్సు మొదలైన ఎందరో ఆంధ్రాంగ్ల కవుల, రచయితల పుస్తకాలు, ప్రబంధాలు దర్శనమిచ్చాయి చక్రవర్తికి.

కొన్ని నిముషాల పాటు మతి పోయింది చక్రవర్తికి. తాను ఎన్నో పుస్తకాలు చదివానన్న గర్వం అతని మనసు నుండి తుడిచి పెట్టుకు పోయింది. ఇన్ని పుస్తకాలు చదివి, సాహిత్యంతో ఎంతో పరిచయంవున్న నీలిమను తాను తక్కువ అంచనా వేశానేమో అనుకున్నాడు.

ఆమె ద్వారా తాను ఎన్నో విషయాలు తెలుసుకోవాలి. ఎంతో నేర్చుకోవాలి. ఇంత సాహిత్యాభిమానం వున్న వ్యక్తి పరిచయం కావటం అదృష్టం అనుకున్నాడు. ఆ వ్యక్తి స్త్రీ కావటంతో అతని హృదయంలో ఆత్మీయత,



# ఆరోహణ

అనురాగం, ప్రేమ ఎన్నో భావాలు చోటు చేసుకున్నాయి.

"కాఫీ తీసుకోండి."

తన్మయత్వం నుండి ఉలిక్కిపడి చూశాడు చక్రవర్తి. కాఫీ కప్పుతో నిలబడి వుంది నీలిమ. అందుకున్నాడు.

"చాలా మంచి పుస్తకాలు వున్నాయండి మీ దగ్గర" అభినందన ఉట్టిపడే స్వరంతో అన్నాడు.

"బహుశా మీరన్నీ చదివే వుంటారు" అంది నీలిమ.

"లేదండి చదవనివి చాలా వున్నాయి మీ దగ్గర అవకాశం వుంటే అన్నీ చదవాలని వుంది. ప్చ్!" అన్నాడు. అతని కంఠంలో ఎంతో నిరాశ. అది గమనించింది నీలిమ.

"తప్పకుండా చదువు కుందురుగాని. మీలాంటి వాళ్ళు చదవటం వల్లే వాటికి సార్థకత ఏర్పడుతుంది." అంది నీలిమ అభిమానంగా.

ఖాళీ అయిన కాఫీ కప్పుల్ని తీసి ఓ మూలగా పెట్టింది. "కూర్చోండి. నిలబడే వున్నారేం!"

కూర్చున్నాడు చక్రవర్తి. మరో కుర్చీ లాక్కుని ఆమె కూడా కూర్చుంది.

"ఏదో దేవాలయంలో కూర్చున్నట్టుగా వుంది ఇక్కడ."

అతని మాటల్లోని నిజాయితీ, మనసులోని తపన అర్థమయ్యాయి నీలిమకు. అతనో ఆత్మీయుడనే భావం మెల్ల మెల్లగా చోటు చేసుకోసాగింది ఆమె హృదయంలో.

"మీరేం చేస్తుంటారో చెప్పనే లేదు."

"సాహిత్యమే జీవితంగా బ్రతకాలనుకున్న ఓ చిన్న గుమాస్తాని." అతని మాటల్లోని నిరాశ, బాధ గ్రహించింది ఆమె.

"మహా రచయిత గోర్కీ ఓ రొట్టెల ఫ్యాక్టరీలో పని చేశాడండీ. మీకు గౌరవాన్ని తీసుకొచ్చేది మీరు చేసే వృత్తి కాదు మీరు సృష్టించే సాహిత్యం" అనునయిస్తున్నట్టు అంది.

ఆమెపై గౌరవం మరింత పెరిగింది చక్రవర్తికి.

"మీ ముందు నేను చాలా చిన్నవాడిగా అనిపిస్తున్నాను."

"మీరలా అంటే నేను చాలా బాధపడాల్సి వస్తుంది. దయచేసి ఇంకెప్పుడూ అనకండి."

ఆమె కళ్ళల్లో కనిపించిన బాధకు కరిగిపోయాడు. చక్రవర్తి సూటిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆ కళ్ళను ప్రేమగా ముద్దు పెట్టుకోవాలనిపించింది.

"కవిత్వం వ్రాసేవాళ్ళంటే నాకు చాలా ఇష్టం. ఎందుకంటే ఎన్నోసార్లు రాయాలని ప్రయత్నించీ రాయలేక పోయాను."

"మీరు నిజంగా వ్రాయటం ప్రారంభిస్తే చాలా మంది కవులు అస్త్ర సన్యాసం చేస్తారు."

"భలేవారే. అందరూ వ్రాయలేరండి. మనసులోని భావానికి అక్షర రూపం ఇవ్వటానికి ఎంత తపన పడాలో, ఎంత వేదన పడాలో మీకు తెలీదా?"

"ఔనండి. హృదయ కంపనని కాగితం మీదికి తీసుకు రావటం ప్రసవ వేదనే, కాదనను. కాని మీరు అనుకుంటే చాలా సులభంగా సాధించ గలరు."

"మంచి పాఠకురాలుగా మిగిలిపోతే చాలు నేను." కుర్చీలో వెనక్కి వాలుతూ అంది.

గదంతా చీకటి ఆవరించటంతో లేచి లైటు వేసింది నీలిమ. టైము చూసుకున్నాడు చక్రవర్తి.

"నేనొచ్చి చాలా సేపయింది. మాటల్లో టైం మరచిపోయాను" వెళ్ళాలని ఏమాత్రం లేకపోయినా వెళ్ళక తప్పదన్నట్టు లేచాడు చక్రవర్తి.

"మళ్ళీ కలుస్తారుగా!" అడిగింది నీలిమ లేస్తూ.

"తప్పకుండా"

"ఈసారి మీ రచనలు ఇస్తాను."

"తొందరేం లేదు. నిదానంగా చదవండి."

వరండావరకు వచ్చి సాగనంపింది నీలిమ.

రూముకు వచ్చి సిగరెట్టు వెలిగించుకుని కూర్చున్నాడు చక్రవర్తి. అతని మనసంతా నీలిమ ఆక్రమించింది. చెప్పలేని ఆనందం, చెప్పుకోలేని అనురాగం అతన్ని ఊపేస్తున్నాయి. మాటిమాటికి నీలిమ రూపం కళ్ళ ముందర కదులుతోంది. ఆమె మాటలే వినిపిస్తున్నాయి. ఆమె ఆకర్షణకు లొంగిపోతున్నానా, ఆరాధిస్తున్నానా, ప్రేమిస్తున్నానా? తనను తానే ప్రశ్నించుకున్నాడు.

తన జీవితపు ఒంటరితనాన్ని పోగొట్టి, కవిగా తన వెన్ను తట్టి, ఇన్నాళ్ళనుంచి కోరుకుంటున్న ఆత్మీయతను పంచి, జీవంగా జీవితంగా నిలుస్తుందా ఆమె. ఆర్థిక అసమానతల అడ్డుగోడలను ఛేదించి నన్ను నన్నుగా గుర్తిస్తుందా?!

కాలిపోయిన సిగరెట్టు వేళ్ళని తాకటంతో చుర్రుమని చైతన్యంలోకి వచ్చాడు చక్రవర్తి.

టైము చూశాడు రెండయింది. నీలిమ గురించి ఆలోచన మానేసి నిద్రపోవాలని చాలా ప్రయత్నించాడు. సాధ్యం కావటంలేదు అతనికి. మరో సిగరెట్ వెలిగించుకున్నాడు మనస్సుమీద ఒక స్త్రీ ఎంత ప్రభావం చూపగలదో అర్థమైంది అతనికి.

'ప్రేమంటే రెండు హృదయాలు కలసి ఒకే బాటలో ప్రయాణించటం' ఎక్కడో చదివిన వాక్యాలు గుర్తొచ్చాయి. నవ్వుకున్నాడు.

ఆకలి దాహం లేనిస్థితి ఎలా వుంటుందో, ఊహలు ఎంత ఆనందం ఇస్తాయో, మనసుపై ఆత్మీయులకు ఎంత అధికారం వుంటుందో, మాటలు మానసికంగా ఎంత ధైర్యాన్ని ఇస్తాయో, సాహిత్యం స్త్రీకి ఎందుకంత ప్రాముఖ్యత ఇచ్చిందో అర్థమైంది చక్రవర్తికి ఆ రాత్రి.

ఆ ఊహల్లో, ఆలోచనల్లో ఎప్పుడు నిద్రపోయాడో అతనికే తెలీదు

* * * *

తలుపు చప్పుడుకు మెలుకువ వచ్చింది చక్రవర్తికి. బద్ధకంగా కళ్ళు నులుముకుంటూ లేచాడు. కళ్ళు తెరిచేసరికి ఒక్కసారి వెలుగు కళ్ళల్లోకి ప్రవేశించి కళ్ళు తిరిగినట్లనిపించింది.

తలుపు మళ్ళీ చప్పుడైంది. విసుగ్గా లేచి తలుపు తీశాడు.

"తొమ్మిదిదాకా నిద్రేమిటి చక్రవర్తీ, తలుపుకొట్టి కొట్టి విసుగొచ్చింది" అంటూ గదిలోకి వచ్చాడు ప్రభాకర్.

"ఆదివారం కదా ఎప్పుడు లేస్తే ఏం. పైగా రాత్రంతా నిద్రలేదు."

"ఏమైనా రాశావా రాత్రి"

"లేదు. ఎందుకో నిద్రరాలా" అన్నాడు ఆవులిస్తూ చక్రవర్తి.

"సరే త్వరగా తయారవు మార్నింగ్ షో కెళ్దాం."

"దేనికి"

"మాయాబజార్"

పాత సినిమాలు తప్ప కొత్త సినిమాలు చూడటానికి చక్రవర్తి అంతగా ఇష్టపడడని ప్రభాకర్ కు తెలుసు. పాత సినిమాలు వచ్చినప్పుడల్లా వచ్చి



# భారతి

సాహిత్యాభిమానులకి ★

చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్ధన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడుతుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ <u>చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!</u>




---

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________________

చిరునామా : ______________________________

______________________________

చందాదారుని సంతకం

## ఆరోహణ

చక్రవర్తిని తీసుకెళుతుంటాడు.

అరగంటలో స్నానాదికాలన్నీ ముగించి తయారయ్యాడు చక్రవర్తి. రూముకు తాళంవేసి ఇద్దరూ బయటపడ్డారు.

"ఎప్పుడూ ఆ పైజామా లేనా నాలుగు ప్యాంట్లు కుట్టించుకో కూడదూ."

"ఇవి చాలా సుఖంగా వుంటాయి ప్రభాకర్"

"సుఖం సంగతి దేవుడెరుగు. చూసేవాళ్ళు బోదకాలు వుందనుకుంటారేమో."

మనస్ఫూర్తిగా నవ్వాడు చక్రవర్తి.

ఇంతలో థియేటరు వచ్చింది. టికెట్లు కొని వెళ్ళి కూర్చున్నారు. మరో పది నిముషాల్లో సినిమా మొదలైంది. ఇద్దరూ సినిమాలో లీనమయ్యారు.

సినిమా పూర్తయ్యేసరికి ఒకగొప్ప అనుభూతినుంచి తేరుకున్నారు ఇద్దరూ.

టైము చూశాడు ప్రభాకర్ ఒకటిన్నర అయింది. ఇద్దరూ నడుస్తున్నారు.

"మూడున్నర గంటల సినిమా అయినా ఏమాత్రం బోరుకొట్టలేదు కదూ" అన్నాడు ప్రభాకర్.

"అంత శ్రద్ధగా తీశారు వాళ్ళు సినిమాని. ప్రతి చిన్న విషయాన్ని పట్టించుకున్నారు"

"టెక్నికల్‌గా కూడ బావుంది" అన్నాడు ప్రభాకర్.

"అసలు ఆ రోజుల్లో స్క్రిప్టు ఫైనలైజ్ చెయ్యటానికి కొన్ని నెలలు పట్టేదట. రాక్షసుల పేర్లు కూడా చూడు ఎంత ఆలోచించి పెట్టారో. నాగేశ్వర్రావు రథానికి అడ్డంగా వచ్చి గోడ కట్టిన వాడి పేరు కుడ్యాసురుడు" వివరించాడు చక్రవర్తి.

కోనేటి కట్ట ప్రక్క రోడ్డుమీద నడుస్తున్నారు ఇద్దరూ. నడుస్తున్న వాడల్లా చటుక్కున ఆగిపోయాడు చక్రవర్తి. తనూ ఆగాడు ప్రభాకరు.

"ఏమిటి"

చేత్తో రోడ్డుమీదకు చూపించాడు చక్రవర్తి.

రోడ్డుకు ఒక ప్రక్కగా రంగు రంగుల చాక్‌పీసులతో శిలువవేసిన జీసస్ బొమ్మగీయబడివుంది. నిజంగా జీసస్‌ను అప్పుడే శిలువవేశారా అన్నంత జీవకళ ఉట్టిపడుతోంది ఆ బొమ్మలో. మేకులు దిగబడి రక్తం కారుతున్న చేతులు, బాధతో వాలిపోయిన తల, కళ్ళల్లో అందరినీ క్షమించేంత కరుణ. బొమ్మక్రింద 'హెల్ప్‌మి' అన్న అక్షరాలు కనిపించాయి

చాలాసేపు ఆ బొమ్మను చూస్తూ వుండిపోయాడు చక్రవర్తి. అంత సహజంగా వేసిన ఆ చిత్రకారుడి పట్ల ఎంతో గౌరవం కలిగింది. అంతటి శక్తి వున్న చిత్రకారుడు అలా రోడ్లమీద అడుక్కునే స్థాయిలోనే మిగిలిపోయినందుకు బాధ, వ్యవస్థపై కోపం ఒకేసారి కలిగాయి చక్రవర్తిలో. ప్రభాకర్ కూడ ఆ చిత్రాన్ని ఎంతో మెచ్చుకున్నాడు.

బొమ్మమీద పడివున్న చిల్లర నాణేలకేసి దృష్టిసారించాడు. అన్నీ కలిపినా రూపాయకు మించి వుండవు.

చిత్రం వేసింది ఎవరా అనుకుంటూ చుట్టూ చూశాడు చక్రవర్తి. బొమ్మకు ఒకప్రక్కగా కోనేటి కట్టగోడను ఆనుకుని కూర్చుని వున్నాడో వ్యక్తి బీడీకాలుస్తూ. అతని ప్రక్కనే ఒక మాసిపోయిన సంచీ. చాక్‌పీసుల డబ్బా వుండడంతో అతనే చిత్రకారుడు అనుకున్నాడు.

'ఇతనికి డబ్బు, మంచి శిక్షణవుంటే ఎంత గొప్ప చిత్రకారుడయ్యేవాడో' అనుకున్నాడు.

ఆ ఊహ రావటంతో మరింత పరిశీలనగా చూశాడతన్ని చక్రవర్తి. బాగా మాసి చిరిగిపోయి వున్నబట్టలు, ఎన్నాళ్ళనుంచో తిండిలేనట్లు బక్కచిక్కిన శరీరం. లోతుకుపోయిన కళ్ళు, తైల సంస్కారంలేక దుమ్ముతో నిండివున్న తల. బిచ్చగాడిలానే వున్నాడు చూడటానికి. అతని పట్ల జాలితో నిండిపోయింది చక్రవర్తి మనస్సు.

"ఈ చిత్రం వేసింది నువ్వేనా" అడిగాడు చక్రవర్తి అతని దగ్గరకు వెళ్ళి.

## గడుసులోకం —బాబు









"ఔనండీ" అన్నాడతను బీడీ పారేసి భయంగా లేచి నిలబడి.

"పేరేమిటి"

"రవి" అన్నాడు వినయంగా చేతులు కట్టుకుని

"ఏ ఊరు" అడిగాడు ప్రభాకర్.

"ఏలూరు దగ్గర ఓ పల్లెటూరండి"

"ఈ ఒక్క బొమ్మేనా ఇంకా ఏమైనా వెయ్యగలవా"

"ఏది వెయ్యమన్నా వేస్తాను సార్" ఏదో ఆశతో సమాధానం ఇచ్చాడు రవి.

"భోజనం చేశావా" అడిగాడు చక్రవర్తి.

"రెండు రోజులయిందండి" చక్రవర్తి మొహంలోకి చూసి తలదించుకుని దీనంగా అన్నాడు.

అతని చూపుల్లో కనిపించిన దైన్యానికి, అతని సమాధానానికి హృదయం పిండినట్లయింది చక్రవర్తికి.

"మా వెంట రా భోంచేద్దువుగాని" పిలిచాడు చక్రవర్తి. చాక్‌పీసులను సంచిలో సర్ది, సంచీ చేతికి తీసుకుని ఆనందంగా వాళ్ళ వెంట కదిలాడు రవి.

చాలా విలువైన దానిలాగా అతడు సంచిని చేతిలోకి తీసుకోవటం చూసి నవ్వు వచ్చింది. బాధ కలిగింది చక్రవర్తికి.

ముగ్గురూ తీర్థకట్ట వీధిలోకి వచ్చారు. తాను వెళతానని శలవు తీసుకుని వెళ్ళిపోయాడు ప్రభాకర్.

చక్రవర్తి వెంట బిక్షగాడిలా వున్న రవి మెస్సులోకి రావటం అందరూ వింతగా చూశారు.

తన ముందర వున్న అన్నాన్ని ఆబగా తిన్నాడు రవి. మళ్ళీ దొరుకుతుందో లేదో అన్నట్లు. అతడు అంత ఆత్రంగా అంత ఆనందంగా తినటం చూసి తను తినలేకపోయాడు చక్రవర్తి.

రూముకు పిలుచుకుని వచ్చాడు రవిని.

గది బయటే సందేహంగా నిలబడ్డాడు రవి.

"లోపలికి రా" పిలిచాడు చక్రవర్తి. వచ్చాడు రవి బిడియంగా.

"కూర్చో"

సంచీని రూములో ఓ మూలగాపెట్టి కూర్చున్నాడు రవి.

తనో సిగరెట్ వెలిగించుకుని రవికో సిగరెట్టు ఇచ్చాడు చక్రవర్తి. అందుకోటానికి సందేహించాడు రవి.

"ఫరవాలేదు" నవ్వుతూ చెప్పాడు చక్రవర్తి.

సిగరెట్ వెలిగించి తలవంచుకుని కాల్చుకోసాడు రవి. పరుపు పరచి గోడ కానుకుని కూర్చున్నాడు చక్రవర్తి.

"ఏం చదువుకున్నావు రవీ"

"ఏడో తరగతి పాసయ్యాను సార్"

"ఈ చిత్రకళ ఎక్కడ నేర్చుకున్నావు"

"ఎక్కడా నేర్చుకోలేదు సార్. చిన్నప్పటినుంచి బొమ్మలు వెయ్యాలన్న కోరిక వుండేది. వేస్తూ వచ్చాను. అంతే"

"మంచినేర్పుందయ్యా నీ చేతుల్లో"

"అన్నంపెట్టి ఆదరించారు మీకెలా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియటంలేదు సార్" దీనంగా అన్నాడు రవి. అతని కళ్ళనిండా నీళ్ళు. అతని కంఠంలోని నిజాయితీ కదిలించింది చక్రవర్తిని.

"ఆమాటలన్నీ ఎందుకుగాని ముందు నువ్వా బట్టలు ఉతుక్కుని, స్నానంచేసి కాసేపు నిద్రపో. సాయంత్రం మాట్లాడుకుందాం"

రవి సమాధానం చెప్పలేదు. తలవంచుకున్నాడు. అతనికి మరో జతలేదన్న విషయం గమనించాడు చక్రవర్తి, లేచి తను వాడని ఓ పంచి తీసి ఇచ్చాడు.

బట్టలు ఉతుక్కుని స్నానంచేసి వచ్చాడు రవి. అతని మనసంతా చక్రవర్తి పట్ల గౌరవంతో, కృతజ్ఞతతో నిండిపోయింది.

"ఆమూల చాపవుంది తీసుకో" చూపించాడు చక్రవర్తి. చాపవేసుకుని పడుకున్నాడు రవి. కడుపునిండా భోజనం, హాయిగా స్నానం చెయ్యటంవల్ల వెంటనే నిద్రపట్టేసింది రవికి. మెల్లగా చక్రవర్తి కూడ నిద్రలోకి జారుకున్నాడు.

వాళ్ళు నిద్రలేచేసరికి సాయంత్రం ఆరయింది.

నీలిమ దగ్గరికి వెళ్లాలన్న కోరిక గుండెలో కొండంత అయింది చక్రవర్తికి. ఆమె తనకోసం ఎదురు చూస్తూ వుందేమో. తన కవితలు - కథలు చదువుతోందేమో, తన గురించి ఆలోచిస్తూ వుందేమో అనుకున్నాడు. నీలిమ పేరు తలచుకోగానే మనసుతో పాటు శరీరమూ పులకించింది. ఏదో తియ్యటి బాధ నరనరాన్నీ కోసేస్తోంది. తనను తాను అదుపు చేసుకోలేని ఆకర్షణ ఆమె.

ఆమెను చూసి అప్పుడే ఒకరోజు దాటింది. అప్రయత్నంగా నిట్టూర్చాడు చక్రవర్తి. మాటిమాటికి తాను వెళ్లటంవల్ల ఆమె ఏదైనా అసౌకర్యానికి గురి అవుతుందేమో. ఎవరైనా ఏమైనా అనుకుంటారేమో? అతి చనువు ప్రదర్శిస్తున్నానని ఆమే భావిస్తుందేమో? అతనిలో అతనికే ఘర్షణ.

(ఇంకా వుంది)

పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## సృష్టి - స్థితి - లయం

"అమ్మా' చుట్టూ చూసింది కల్పన "అమ్మా నేనిప్పుడే భగవంతుని దయ వలన భవిష్యత్తును చూసి వచ్చానమ్మా. ఈ మాటలతో అర్థం అయింది కల్పనకు అది తన కడుపులోని బిడ్డేనని

ఆమె ఆ రోజు ఉదయమే లేడీ డాక్టరు దగ్గరకు వెళ్లి "అమ్నియో సెంటిసిస్" చేయించుకొని వచ్చింది డాక్టరు ఆడపిల్ల అని చెప్పింది భర్తేమో అబార్షన్ చేయండి డాక్టర్" అని చెప్పాడు అత్తగారేమో "హాస్పిటల్‌లో ఎడ్మిట్ అవకపోయావా" అంది.

ఆమె కది తొలి మాతృత్వ అవకాశం. తనకు ఏ బిడ్డయినా సరే స్వంతం చేసుకోవాలని ఉంది కానీ భర్త ఆజ్ఞాపిస్తున్నాడు వద్దని. తనేమో మానసికంగా హింసననుభవిస్తోంది

"అమ్మా, చెప్పనా నేను చూసింది?" అడిగింది బిడ్డ

భవిష్యత్తు మీద ఉండే జిజ్ఞాసతో చెప్పమ్మా చిట్టితల్లీ' అంది కల్పన. ఇలా జరుగుతుందా అని ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టి చూస్తున్నారు ఆమె అత్తమామలూ, భర్త రఘురాం.

" అది 2086 వ సంవత్సరం. ఇండియా ప్రధాని శ్రీ కరుణ్ "దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. దేశంలో అన్ని కరువులతో పాటు ఎవరూ ఊహించని, ఈ కొత్త కరువు ఒకటి వచ్చి గత ఏభై సంవత్సరాలుగా దేశాన్ని పట్టి పీడిస్తోంది. ఎప్పుడో గడచిన శతాబ్దంలో ఉన్న ఆచార వ్యవహారాల వలన ఈ విధంగా జరిగింది ఆ రోజులలో ఉన్న వరకట్న దురాచారం, సాంఘిక అరాచకత్వం, స్త్రీలపై ఉన్న చులకనభావం, వీటికి భయపడి ఆ రోజులలో తల్లిదండ్రులు ఆడపిల్లలని వరిపలన దేశానికి మేలుకంటె కీడే ఎక్కువ. అర్థం పర్థంలేని ఆవేశాలు, అది కానట్లయితే విపరీతమైన నీరసాలు ఈ పరిస్థితిలో ఎవరైనా మన దేశాన్ని అతి సునాయాసంగా కొల్లగొట్టవచ్చు అం ఇంకా ఏమి మిగిలింది" ఇంకొక ఏభై సంవత్సరాలయితే రాజధానులకు, ముఖ్య పట్టణాలకూ ఒక్కొక్క కుటుంబం చొప్పున మిగులుతారు. ఇప్పుడే "అమ్నియో సెంటిసిస్" చేయించి ఆడపిల్లనే కందామంటే ఆ గర్భం దానంతట అదే విచ్ఛిత్తి జరిగిపోతోంది. దీనికి పరిష్కారం ఇంతవరకూ కనుగొనబడలేదు. ఇప్పటికైనా విధి అనేది ఒకటుందని నమ్ముతారా ఈ ప్రజలు. దేశంలో దాదాపు స్త్రీ సంతతి హరించిపోయినట్లే. తెలియగానే వాళ్లను బ్రతికి బట్టకట్టనీయలేదు దానికి ఫలితం ఇప్పుడు అనుభవిస్తున్నారు. ఇప్పుడున్న జనాభాలో నూటికి పదిమంది మాత్రమే స్త్రీలున్నారు. మిగిలిన 90 మంది వృద్ధులుగా ఉంటున్నారు

పురుషుడికో ఎన్నో రకాలైన ఆపరేషన్స్ చేసి పిల్లలు పుట్టించినా ఆడపిల్ల పుట్టడంలేదు. దానికీ ఓమ్. అది ఎక్కడినుండి రావాలి 'స్త్రీ శక్తి స్వరూపిణి, శాంతిదాయని, భగవత్ స్వరూపిణి, ఆనంద తరంగిణి అయితే దానిలో ఓలలాడే ఈ పురుషుడు దానిని నమ్మక తన కాలికింది చెప్పుకు తానే చెప్పంటించుకున్నాడు. దానిలో ఇప్పుడు ఆ పురుషజాతే మాడి మసి అయిపోతోంది, చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం అనుభవిస్తూ. ఇంకొక పంచ సంవత్సరం అయితే ఒకవ్యక్తి గూడ మిగలడు. అలాగే ఆడదానిని పుట్టనీయకుండ ఈ మగవాడి దౌష్ట్యానికి అంతం జరుగుతుంది తెల్లవారి లేచిన దగ్గరనుండి ప్రతి నిమిషం, పుట్టిన దగ్గరనుండి ప్రతిక్షణం, పుట్టక ముందునుండి ప్రతి అరక్షణం ఆడదానిపై, ఆడదాని రక్తమాంసాలపై బ్రతికే ఈ మగవాడు తానేమిటని, తన ఉనికిని విస్మరించి ఆడవాళ్లపై చేస్తున్న అరాచకాలు, పరమ ఘోరంగా, కిరాతకంగా, చేస్తూ తన చితికి తానే కట్టెలు పేర్చుకుంటున్నాడు వీళ్లు చేస్తున్న ఈ పాపాలకు ఇలాంటి శిక్ష అనుభవించాల్సిందే నమ్మా. అయ్యో పాపం అనుకోకు. వస్తానూ, మీకె మందుల ఖర్చూ లేకుండా వెళ్లిపోతున్నాను." "అబ్బా" బాధతో కల్పన పెట్టిన కేకకు ఇహ లోకానికి వచ్చాడు రఘురాం "భగవతీ మా పాపాలకు శిక్ష ఇంత ఘోరంగా విధిస్తున్నావా తల్లీ" అన్నారు వెంటనే కల్పన అత్తమామలు.

పోలవరపు శాంతి లక్ష్మి
వేములవాడ

# పరిస్థితి చక్కబడితే అంతా ఒకటే

గర్భస్థ శిశువుని భూమిమీదకి రాకుండా అబార్షన్ పేరుతో హతం చెయ్యటం అవివేకం. గర్భస్థ శిశువుకి జన్మనిచ్చేది ఎవరూ? ఒక ఆడ- ఒక మగ. అలాంటప్పుడు ఆ చర్యకి ఇద్దరూ ఎంత అవసరమో తెల్సి ఆడ అయితే అబార్షన్ చేయించుకోవటం అవివేకం. అవసరం లేకపోతే గర్భం ధరించటమే మానుకోవాలి గర్భం రాకుండా వుండటానికి ఎన్నో పద్ధతులు ఉన్నప్పుడు అవి వాడకుండా గర్భం వచ్చిన తరువాత పుట్టబోయేది ఆడపిల్ల అని భయపడి గర్భస్రావం చేయించుకోవటం చాలా తెలివితక్కువ పని. ప్రస్తుత సమాజంలో ఇద్దరూ ఒకటిగానే ఉన్నారు ఆడపిల్ల అయితే చదువు కట్నం పేరుతో డబ్బు గుమ్మరిస్తున్నాం మగ అయితే చదువు+ ఉద్యోగం పేరుతో లంచాలకి డబ్బు

ఆఁ ఎవరైతే ఏముంది తేడా! అమ్మాయైతే కట్నం.. అబ్బాయైతే ఉద్యోగం కోసం లంచం ఇవ్వాలి కదా!..

కవిమిత్ర

సమర్పిస్తున్నాం. ఈ పరిస్థితిని చక్కదిద్దిననాడే గర్భస్థ శిశువు ఆడ అయినా మగ అయినా యథేచ్ఛగా భూమ్మీదికి రాగలుగుతారు

ఐ. లలిత, సూర్యారావుపేట,
విజయవాడ.

# జాతికి చేటు

సెక్సు నిర్ధారణ పరీక్షలు(యస్. డి. టి.) గర్భస్థ శిశువుల జన్యు సంబంధమైన సెక్సు వ్యాధుల నివారణకు, ఆరోగ్యం.




అంగవైకల్యం తెలుసుకొని, పుట్టక పూర్వమే బిడ్డలకు తగువైద్యం జరపడానికి ఉద్దేశింపబడినవి.



అంగవైకల్యాన్ని గర్భధారణ జరిగిన 18 నుండి 19 వారాలలో తెలుసుకోవచ్చును. నయం చేయలేని రోగాలు, అంగవైకల్యం, అమిత ఖర్చుతో కూడిన రుగ్మతలు గర్భస్థ శిశువులుగల తల్లులు 20 వారాలలో గర్భస్రావం చెయించుకోవటం చట్ట సమ్మతము. గర్భస్థ శిశువులకు రోగ నిర్ధారణ చెయుటంకన్నా . లింగభేదం తెలుసుకోవటం చాల తేలిక.

తమిళనాడు రాష్ట్రములోని నీలగిరి జిల్లాలలో నివసించు "తోడాలు" అనె ఆటవికులలో మొదట ఆడబిడ్డను మాత్రమే పెంచి తర్వాత పుట్టిన ఆడశిశువులను చంపే దురాచారం ఉండేది. నేడు కూడ మారుమూల ప్రాంతాలలో ఈ పద్ధతి కొనసాగుచున్నదని పరిశీలకులు అభిప్రాయపడుచున్నారు అందుచే వారిలో స్త్రీల సంఖ్య తగ్గి బహుభర్తృత్వ పద్ధతి అమలులో ఉండేది. హిమాలయ పర్వత ప్రాంతంలో నివసించు "ఖాసాలు" అనే ఆదివాసులలో స్త్రీల సంఖ్య తక్కువ అగుటచే బహుభర్తృత్వ పద్ధతి నెలకొన్నట్లు సామాజిక శాస్త్రవేత్తల పరిశోధనలు తెలుపుచున్నవి. నేడు ఈ ఆటవికులు ఆడశిశువుల హత్యలు మానినందువల్ల స్త్రీల సంఖ్య పెరుగుటచే నాగరికులవలె ఏకపత్ని వ్రతము, బహు భార్యాత్వము పాటించుట గమనింప తగిన అంశము.

ఆటవికులు నాగరిక స్థాయి చేరుకుంటుంటే, నాగరికులు ఆదివాసులని అనుకరించుటవలన ఆడవాళ్ల సంఖ్య తగ్గిపోతుంది. 1981 జనాభా లెక్కల ప్రకారం దేశంలో ప్రతి వెయ్యిమంది పురుషులకు 934 మంది స్త్రీలున్నారు. యస్. డి.టి. దుర్వినియోగం కొనసాగితే రానున్న కొన్ని సంవత్సరాలలో పురుషులు స్త్రీల మధ్య నిష్పత్తి బాగా తగ్గి బహుభర్తృత్వం, కన్యాశుల్కము, రాక్షస వివాహాలు అమలులోకి రావచ్చు.

"ఆడపిల్లలపై మోజు తగ్గినందున గర్భస్రావాలవల్ల చైనాలో 1981 లెక్కల ప్రకారం 41.82 శాతం ఆడపిల్లలు మాత్రమే కలుగుచున్నారు. ఇలా కొనసాగితే 20 సంవత్సరాలలో మగవారికి భార్యలు లభించరని చైనా పత్రిక'పీపుల్సు డెయిలీ'హెచ్చరించింది.

వరకట్న బాధలూ స్త్రీలపట్ల చిన్నచూపు, ఆడవాళ్లె దుర్కొనే వేధింపు చర్యలు గర్భస్థ ఆడ శిశువుల హత్యలకు మూలమని తలంచబడుతున్నది. కావున సమాజంలో దురాచారాల నిర్మూలన జరిగినపుడు ఆడపిల్లలను కనెధైర్యం తలిదండ్రుల కేర్పడుతుంది. దీనికై ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థల అవిరళ కృషి ఎంతో తోడ్పడుతుందనటంలో సందేహము లేదు.

రేబల్లి వెంకటేశ్వర్లు, హుస్నాబాద్.

* * *

# రక్తతర్పణం

"అమ్మా.......!"

"ఏమ్మా-?"

"రేపు ఉదయం నన్ను చంపుతా రటగా!"

"......"

"ఏమ్మా ... మాట్లాడవు"



"నన్ను క్షమించు తల్లీ!"

".... అయినా నీవేం చేస్తావు- నాన్నగారి మాట కాదన్లేవుగా! అయినా... ఆయనగాని ఏం చేస్తాడు! పుట్టింది మొదలు చచ్చేంత వరకూ మగతోడు లేకుండా ఆడది బతకలేని సమాజంలో....నేనెలా బతుకుతానో అని కదా ఆయన భయం? నేను ఈ ప్రపంచాన్ని చూడక ముందే చనిపోతే బాధపడేది మీరిద్దరే- నేను బయట పడితే- అడుగడుగునా గండా లెదుర్కొంటూ మీతో పాటు నేను కూడా బాధలు పడాలి కదా?"

"నాకీ అబార్షన్ బొత్తిగా ఇష్టంలేదు తల్లీ..."

"ఏడ్వకమ్మా! నేను చచ్చిపోతానని నాకేమాత్రం భయమూ, బాధ లేవు. అయినా, నే నొక్కదాన్నే కాదుకదా! నాతో పాటు పిండస్థ దశలోనె వుండే ఎన్నో జీవులు చనిపోతున్నాయి. కాదు

కాదు.- చంపబడుతున్నాయి. చూడు! ఈ మారణకాండ ఇలాగే- ఇలాగే- కొనసాగుతూ- కొన్ని దశాబ్దాల తర్వాత- మేము ఆశించే రోజు - 'ఆడవాళ్ళు' అనే మాట వినబడితే అపురూప వస్తువు గురించి విన్నట్లు అనుభూతి చెందేరోజు- 'అతివలే అరుదైరే' అని సౌందర్యోపాసకులు అలమటించే రోజు- 'కన్యాశుల్కం లక్షల్లో ఇస్తాం... అమ్మాయెక్కడ' అని పెళ్ళి కొడుకులు ఊరూరా తిరిగే రోజు- ఆ రోజు కోసం- అటువంటి రోజుల కోసం.... ఇప్పటి నుండే రక్త తర్పణం చేస్తున్నామనుకుంటాం!"

".... వుంటాను మరి! అమ్మా! ఒక్క మాట! రేపటి తమ్ముళ్ళకు నన్ను గుర్తు చేస్తుంటావుగా!"

శేషశాయి కడప □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు : ______________

____________________________

పూర్తి చిరునామా ______________

పిన్ కోడ్ : ______________

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

ఇలా జరగొచ్చునే అనుమానం తను అక్కడ అడుగు పెట్టిందగ్గర్నుంచి అస్పష్టంగా మెసులాడుతున్నా అది నిజ రూపాన్ని దరించే సరికి, వెంకట్రామయ్య కూడా అప్సెట్ అయ్యాడు

ముందుగా తేరుకుంది తాతగారే

నీకేమన్నా మతి పోయిందా? దీన్నిరోజు కొత్తగా అనుకుంటున్నావా? ఎప్పుడో మన పిల్ల ఆ కుర్రాడికి వాగ్దత్త అయిపోయింది పదిమంది సమక్షంలో నిశ్చితార్థం జరిపిన రోజే మన పిల్ల ఆ ఇంటి కోడలయింది ఇహ ఇప్పుడు జరగాల్సింది ఊరికే సాంప్రదాయమైన తంతు మాత్రమే! ఏదేదో మాట్లాడుతా వేమిటి నువ్వు? అన్నారాయన

నా కలాంటి మూఢ నమ్మకాలు లేవు మొండిగా అన్నాడు బాబూరావు

ఇది మూఢ నమ్మకం కాదు ఇచ్చిన మాటను నిజాయితీగా నిలుపుకోవటం

నా కూతురి సుఖం నాకు తెలుసు నన్నెవరూ ప్రైస్ చెయ్యక్కర్లేదు అని

ఎందుకలా స్తంభంలా నిలబడ్డావు? త్వరగా అన్నం పెట్టు నేను మళ్ళీ హైదరాబాదెళ్ళాలి అని శార్వాణిని గదిమాడు బాబూరావు

వెంకట్రామయ్య లేచి వెళ్ళిపోయాడు కందిన మొహంతో

బాబూరావు అన్నం తింటుంటే అక్కడికి కెళ్ళారు తాతగారు

చూడు బాబూ! ఇది మర్యాదస్తులు చెయ్యాల్సిన పని కాదు నీ వరస నాకేం నచ్చటంలేదు ఇంటి కొచ్చిన పెద్ద మనిషినలా అవమానించి పంపటం సభ్యత కాదు

మన పిల్ల ఆ పిల్లాడు ప్రేమించుకున్నారు ఆ ప్రేమను మనం ఆమోదించాం పది మందినీ పిలిచి మరీ మన ఆమోదాన్ని తెలియజేశాం

ఈరోజు మన స్థితిగతులు మారి ఉండొచ్చు అందు కనుగుణంగా ఆ లేత మనసుల్ని బలవంతంగా విరిచేసి నీ దార్లోకి లాక్కోవాలనుకోటం మూర్ఖత్వం

వాళ్ళనలా విడదియ్యటం మంచిదికాదు

నీ కూతురి సుఖాన్ని గురించి కూడా ఆలోచించనివ్వనంతటి స్వార్థం నీలో ఎప్పుడు ప్రవేశించింది? నువ్విలా చెయ్యటం చాలా తప్పు మందలింపుగా అన్నారు తాతగారు

నాన్నా! ఈ విషయంలో మీరు జోక్యం చేసుకోకండి మంజూ ఇప్పు డో మినిష్టర్ కూతురు ఆఫ్టాల్ ఒక ఎస్ ఐ గాడిని చేసుకుని ఆ బడి పంతులింటికి కోడలుగా వెళ్ళాల్సిన ఖర్మ దానికి పట్టలేదు ఫైనాన్స్ మినిష్టర్ రమేష్‌చంద్ర మంజూను తన కోడలుగా చేసుకుంటా నన్నాడు ఆ అబ్బాయి ఒకపెద్ద పరమ్‌కు మానేజింగ్ డైరెక్టర్ ప్రస్తుతం విదేశాల్లో ఉన్నాడు త్వరలో ఇక్కడికి రాబోతున్నాడు రాగానే వాళ్ళు మన మంజూను చూసుకోటాని కొస్తారు

నేను రమేష్‌చంద్రకు మాటిచ్చేశాను ఖచ్చితంగా అన్నాడు బాబూరావు

నిశ్చితార్థం జరిగిన పిల్లను ఇంకొకరికిస్తానని ఎలా మాటిచ్చావు? తక్షణం ఆ మాట వెనక్కి తీసేసుకో!

కుదర్దు అది మర్యాద కాదు

మర్యాద నుల్లంఘించటం నీ కలవాటేగా? ఇప్పుడు నువ్వు చేస్తున్న పరువు తక్కువ పనికన్నా ఏదీ అమర్యాద కాదు

ప్రణీత్ అంటే మంజూకు ఇష్టం దిమ్మెరపోయి చూస్తున్న శార్వాణి గొంతు పెకలించుకుంటూ అన్నది

ఇష్టాలకేముంది మార్చుకుంటే అవే మారతాయి నాకు వంకాయ కూరంటే ఇష్టం డాక్టర్ దాన్ని మానెయ్యమన్నాడు మానేసిన తరవాత నా శరీరానికి మంచే జరిగింది అలా కాకుండా అహ! నా కదంటే ఇష్టం గనక నేను దాన్నే తింటాను మీ మాట వినను అని డాక్టర్ని ఎదిరించి మొండికేస్తే నేనిలా ఉండేవాడిని కాదు అన్నాడు బాబూరావు

వంకాయ కూరా నిర్ణయించిన వరుడూ నీ దృష్టిలో ఒకటిగా ఎప్పుడయితే మారారో అప్పుడే నీలో ఉండే విచక్షణాజ్ఞానం పూర్తిగా అంతరించిపోయింది కోపంగా అన్నారు తాతగారు

చూడండి మీరెన్ని చెప్పినా మంజూను వాడి కివ్వను ఫైనాన్స్ మినిష్టర్

**జరిగిన కథ-6** మంజీర ప్రణీత్‌ల వివాహానికి పెద్దలు తాంబూలాలు పుచ్చుకుంటారు మంజీర ప్రణీత్‌లు ఒకరి మనసు నొకరు అర్థం చేసుకుని ప్రేమైక జీవులవుతారు ఎన్నికల్లో రాజకుమార్ కాంగ్రెస్ తరఫునా బాబూరావు ప్రాంతీయ పార్టీ తరఫునా పోటీ చేస్తారు ఇద్దరి మధ్యా కార్పణ్యం రగులుతుంది రాజకుమార్ మీద నేరం ఆరోపించేందుకు బాబూరావు వర్గం మంగిని ఎత్తుకు పోయి చంపేసి బావిలో పడేస్తారు రాజకుమార్ కుడిభుజం చలపతిని బాబూరావు తనవైపు తిప్పుకుంటాడు బాబూరావు ముస్లింలలో మతబావాలు రెచ్చగొట్టి, తప్పుడు ప్రచారాలు చేసి, అవినీతికి పాల్పడి ఎన్నికల్లో గెలిచి మినిష్టర్ అవుతాడు ప్రణీత్ సబ్ ఇన్‌స్పెక్టర్‌గా హైదిపల్లికి వెళ్ళేవస్తాడు పెళ్ళి గురించి అడగడానికి వెళ్ళిన ప్రణీత్ తండ్రి వెంకట్రామయ్యను బాబూరావు అవమాన పరుస్తాడు

కొడుక్కి ఇస్తాను. అంతే. వచ్చేవారం నేనొచ్చి, మంజూను నాతో హైదరాబాదు తీసి కెళ్ళిపోతాను. అంతే! నా మాటకిహ తిరుగు లేదు."

"అది ప్రాణంలేని బొమ్మ కాదురా నీ ఇష్టం వచ్చినట్లు ఆడుకోటానికి. దానికీ మనసనేది ఉంది ఆ మనసుతో ఇంత దారుణంగా చెలగాటమాడటం మంచిదికాదు."

"మీరు లేనిపోనివన్నీ దానికి నేర్పి పెట్టకండి. ఇక్కడుంటే మీరంతా కలిసి ఇలాగే దాని మనసు విరిచేస్తారు. అసలు ఇప్పుడే దాన్ని నాతో తీసికెళ్ళేవాడిని. దార్లో నాకు పనుంది వేరే వేరే చోట్లకు వెళ్ళాలి ఈసారి మాత్రం ఇహ ఇక్కడుంచను దాన్ని" అంటూ,

"శార్వాణీ! మంజూ ఆ ఇంట్లో అడుగు పెట్టినా.... వాడిని కలుసుకున్నా.... ఫలితాలు బాగోవు. జాగ్రత్త" అని శార్వాణిని హెచ్చరించి, భోజనం ముగించి వెళ్ళిపోయాడు బాబూరావు..

వాకిట్లోనుంచి కారు స్టార్టయిన శబ్దం వినిపించింది....

తాతయ్యా! నేను ప్రణీత్‌ని తప్ప ఇంకెవర్నీ చేసుకోను. బలవంతాన ఇంకెవరికన్నా ఇస్తే. నేను.... నేను చచ్చిపోతాను" అప్పటివరకూ అదిమి ఉంచిన దుఃఖం కట్టలు తెగి ప్రవహించగా, ఒక్క ఉదుటున ఆయన్ను చుట్టుకు పోయింది మంజీర ...

మూర్తీభవించిన శోక దేవతలా ఉన్న ఆ పిల్లను చూస్తుంటే వాళ్ళ గుండెలు ద్రవించిపోయాయి.

"ఈయనింత క్రూరంగా ఎలా మారిపోయారు?" దిగులుగా అన్నది శార్వాణి.

"రాజకీయ రాక్షసి ప్రభావమమ్మా అది." అన్నారాయన.

"వాళ్ళకు మాటిచ్చేసి.... ఇప్పుడిలా తిరగబడటం ..."

"వాగ్దానాలమీద వాగ్దానాలు గుమ్మరించటం... క్షణంలో వాటిని మర్చిపోవటం ఇలాంటి రాజకీయ నాయకులకుండే ప్రథమ గుణం. రాజకీయ రమణి వలలో చిక్కుకుపోయిఉన్న వీడిహ మనమాట చచ్చినా వినడు. పదవి నిలుపుకోటం కోసం పడే తపనలో వాళ్ళు పెళ్ళాం బిడ్డల సుఖాన్ని గురించి కూడా ఆలోచించరు. ఆ పదవి కోసం దేన్నయినా పణంగా పెట్టటానికి వెనకాడరు" నిస్పృహగా అన్నారు తాతగారు.

"ఇప్పుడెలా?"

"వాడి నిర్ణయం ఈ ఇంట్లో సుప్రీం కోర్టు తీర్పు లాంటది. ఆర్థికాధికారాలతో సహా సర్వాధికారాలు కలిగి ఉన్న నియంత వాడు. వాడి మాటనుల్లంఘిస్తే . వాడినే వదులుకోవాల్సి రావచ్చు."

"ఏమయినాసరే! ఎవరిని వదులుకోవాల్సి వచ్చినా నేను లెక్క చెయ్యను. ప్రణీత్‌ను చేసుకోలేకపోతే నా కసలీ జీవితమే ఒద్దు" అంటున్న మంజీరను అనునయిస్తూ "ఆవేశపడకు తల్లీ ఏదో ఒక మార్గం ఆలోచిద్దాం" అన్నారాయన.

"ఏమాలోచిస్తాం? ఆయన మన మాట వినరు మనం ఆయన్ని ఎదిరించి నిలవలేం. చివరికి ఎప్పుడూ ఆయన మాటే నెగ్గటం అనేది నే నీ ఇంట్లో అడుగు పెట్టిన దగ్గర్నుంచీ జరుగుతున్న కథే!" అన్నది శార్వాణి.

'నేను ప్రణీత్ దగ్గర కెళ్ళిపోతాను నాన్నగారొచ్చేలోగా మీరే నా పెళ్ళి ఆయనతో జరిపించెయ్యండి." తనను ప్రణీత్‌కివ్వరు అనే ఊహనే భరించలేకపోతోంది మంజీర

'నువ్వు ఏడవకు. ఈ ఆవేశాలు తగ్గాక ఏదో ఒక మార్గం తోచకపోదు" నిబ్బరంగా అన్నారు తాతగారు.

ఇన్నేళ్ళకు ఇలా కొడుకును ఎదిరించి నిలవాల్సిన పరిస్థితి ఏర్పడుతుందని ఆయన ఎన్నడూ ఊహించలేదు.

ఎదిరించినా.... తన పెద్దరికాన్ని కోల్పోవటమే తప్ప.... ప్రయోజనం ఉండదనే విషయం ఆయనకు పిచ్చెక్కిస్తోంది....

కొడుకు అంత దారుణంగా మాట తప్పటం.... సాంప్రదాయాన్ని కాలదన్నటం . అభం శుభం ఎరుగని ఆ లేత హృదయాలను చిదిమెయ్యాలని చూడటం. . ఆయనకు తీరని వ్యధను కలిగిస్తోంది

వాళ్ళ ప్రేమను మొదట ఆమోదించి ప్రోత్సహించి.... మధ్యలో వచ్చిన నడమంత్రపు పదవితో కళ్ళు పచ్చబడి కొడుకు ఇలా ప్రవర్తించటాన్ని ఆయన



కొత్త శీర్షిక

# రచయిత్రి జవాబులు



ప్రముఖ రచయిత్రి శ్రీమతి ఆదూరి సావిత్రి తమ సీరియల్ నవల "ఒడిలో చెలి మోహనరాగం"పై పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు ఇస్తారు. ఈ అవకాశాన్ని వినియోగించుకో దలచుకున్నవారు తమ ప్రశ్నలని "రచయిత్రి జవాబులు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003 అనే చిరునామాకి పంపవచ్చు. వాటిలో రచయిత్రి ఎంపిక చేసిన ప్రశ్నలని, వాటికి ఆమె ఇచ్చిన సమాధానాలని వారం వారం ఈ సీరియల్ పేజీలలో ప్రచురిస్తాము. ప్రతివారం రచయిత్రి ఉత్తమంగా ఎంపిక చేసిన ప్రశ్నని పంపిన వారికి ఆమె రాసిన నవలలలో ఏదో ఒకదానిని బహుమతిగా ఇవ్వటం జరుగుతుంది. ఈ అవకాశాన్ని పాఠకులు వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.

– సంపాదకుడు

## ఒడిలో చెలి మోహన రాగం

భరించలేకపోతున్నాడు

మనుమరాలిమీద వాత్సల్యం . కొడుకు అధికారపూరిత దౌర్జన్యాల మధ్య ఆయన నలిగిపోతున్నాడు

మంజీరకు పిచ్చెక్కేలా ఉంది

తాతగారూ, తల్లీ తండ్రి నెదిరించగలరా? తన కోరిక తీర్చగలరా?

అది అసంభవం అనే భయం ఆమెను వెర్రెక్కిస్తోంది. అయినా పెళ్ళి చేసుకునేది తను

ఆ వ్యక్తితో కలకాలం జీవితాన్ని గడపాల్సింది తను తనను కాదని తన జీవితాన్ని బలవంతంగా నిర్దేశించే హక్కు తండ్రి కెక్కడిది? ఈ విషయం విని ప్రణీత్ ఏమన్నాడు? ఎలా ఫీలయ్యాడు? ఏం చేస్తున్నాడు? ముందు తను అతన్ని కలుసుకోవాలి తండ్రి వచ్చేలోపల తమ పెళ్ళి జరిగిపోవాలి తన తండ్రి తిరస్కరించినంతమాత్రాన ప్రణీత్ చేతులు ముడుచుకు కూర్చుంటాడా? అందర్నీ ఎదిరించి తనను చేపట్టడా? లేక. తండ్రి ఇంత దురుసుగా మాట్లాడి అతని తండ్రిని అవమానించాడనే కోపంతో తనను అతనూ తిరస్కరిస్తాడా?

'బోడి సంబంధం' అంత మిడిసిపడే వాళ్ళ పిల్ల మన కెందుకు? మనకు తగిన పిల్ల మనకీ వస్తుంది అంత అహంభావపూరితమైన సంబంధం మనకొద్దు ఇంతకన్నా మంచి రూపసి, చదువుకున్నది, వివేకవంతురాలే నీకు భార్యగా వస్తుంది ఇహ నువ్వా పిల్ల గురించి ఆలోచించకు అంటోందా కామేశ్వరత్త?

'ఇంత అవమానించిన వాళ్ళ పిల్ల ఈ ఇంట్లో అడుగు పెట్టకూడదు, ఈ సంబంధం మనకొద్దు" అంటున్నారా మామయ్య?

ప్రణీత్ కూడా అలానే అనుకుంటున్నాడా?

వాళ్ళకేం ఖర్మ పట్టింది మెడబట్టి గెంటినా ఇంకా చూరు పట్టుకు వేళ్ళాడటానికి?

ఇదంతా తలుచుకుంటే భయంగా . దుఃఖంగా ఉంది మంజీరకు ప్రణీత్ నోసారి ఒంటరిగా కలుసుకుంటే బాగుండును ఏమయినాసరే అతనిని కలవాలి. అతను ఎన్ని తిట్టినా మౌనంగా భరించాలి

తనను మాత్రం అతన్నుంచి వేరు చెయ్యొద్దని అర్థించాలి వాళ్ళింటి కెళ్ళాలంటే జంకుగా ఉందామెకు. ఏ మొహం పెట్టుకు వెడుతుంది తను?

మరి అతన్ని తోట దగ్గరకు రమ్మని ఎవరు చెపుతారు? తను కబురంపితే వస్తాడా?

వస్తాడు. హైమతో కబురంపితే తప్పకుండా వస్తాడు

తను హైమ దగ్గర కెళ్ళాలంటే ప్రణీత్ ఇంటిముందు నుంచి వెళ్ళాలి

ధైర్యం సరిపోలేదామెకు

హైమను రమ్మని కబురంపింది మంజీర.

మనుమరాలి వ్యథను ... తత్తరపాటును, భయాన్ని మౌనంగా గమనిస్తూనే ఉన్నారు తాతగారు. శర్వాణి రాయిలా ఉండిపోయింది

కూతుర్ని ఓదార్చనూ లేదు తండ్రి నెదిరించి ధైర్యంగా జీవిత భాగస్వామితో వెళ్ళమని చెప్పనూ లేదు . నిస్సహాయంగా ఉందామె పరిస్థితి .

'ఏమిటంత అర్జెంటుగా రమ్మని కబురంపావు? ఏమయింది? నువ్వేమిటలా ఉన్నావ్? తాతగారు కూడా గంభీరంగానూ, అత్త విషాదంగానూ ఉంది. ఏం జరిగింది? ఉన్నపళంగా రమ్మన్నావంటే ఎక్కడి పని అక్కడ పారేసి వచ్చాను చెప్పు . ఏమిటి?' ఆదుర్దాగా అన్నది హైమ

హైమా అంటూ ఆమె భుజాలు పట్టుకుని ఏడిచింది మంజీర

బిత్తరపోయింది హైమ ఏమయిందే? అంది ఖంగారుగా

మంజీర చెప్పిందంతా విని నిర్ఘాంతపోయింది హైమ

'నిజంగా మామయ్యలా అన్నారా? మై గాడ్! ఇదేం తమాషా? ఇదేమన్నా ఆటనుకున్నాడా? ఆట వస్తువనుకున్నాడా? ఒక బొమ్మ బాగలేదు అవతల పారెయ్యి కొత్త బొమ్మ ఖరీదయింది కొనిస్తా అనగానే సరే అనటానికి? తాతగార్ని కూడా తీసి పారేసేంత క్రౌర్యం వచ్చేసిందన్నమాట ఆయనకి? రాజకీయ నాయకులు ప్రజల నోళ్ళలో మన్ను గొట్టటం, వాళ్ళ మానసిక బలహీనతతో ఆటలాడుకోటం గురించి విన్నా గానీ, ఇలా కన్న కూతురు జీవితాన్ని కూడా అంతస్తూ, హోదా అంటూ నిలువు లోతుకు పాతి పెడతారని నాకు నిజంగా తెలీదు ఆ ఫైనాన్స్ మినిష్టర్‌తో వియ్యమందకపోతే, ఈయనగారి పదవి ఊడిపోతుందటనా?

పాపం ప్రణీత్! నిన్నెంత పిచ్చిగా ప్రేమిస్తున్నాడో తెలుసా? వెయ్యి జన్మ లెత్తితే మాత్రం మీ నాన్న కలాంటి అల్లుడొస్తాడా? పెళ్ళి కొడుకుల్లో నిజాయితీ లేదని ఏడవటమెందుకు? పెళ్ళి కూతుళ్ళ తండ్రులు మాత్రం నిజాయితీగా ఏడుస్తున్నారా?

అయ్యో ఇదంతా నాకు తెలీదు ప్రణీత్ ఎంత వర్రీ అవుతున్నాడో! ఇంటి కొచ్చిన పెద్ద మనిషి నింత ఘాతుకంగా అవమానించి పంపుతాడా మీ నాన్న? వారం రోజుల్లో నిన్ను హైదరాబాద్ తీసి కెడతాడా! ఇక్కడయితే తన ఆటలు సాగవనా?

నీకేం భయం లేదు మంజూ ప్రణీత్ పోలీసాఫీసర్ నీకు మైనారిటీ తీరింది. ఈ వారం రోజుల్లోగా నేనూ, బావ పెద్దలుగా వ్యవహరించి నీ పెళ్ళి జరిపించేస్తాం నే వెళ్ళి ప్రణీత్‌తోనూ, బావతోనూ మాట్లాడి వస్తాను. పెళ్ళెప్పుడో వచ్చి చెపుతాను కొన్నాళ్ళలో ఈ ఇంటికి గుడ్‌బై కొట్టేందుకు నువ్వు సిద్ధమై ఉండు. తమ స్వార్థం కోసం... గొప్ప కోసం కన్న బిడ్డల జీవితాల్ని బలి పెట్టాలనుకునే వ్యక్తి తల్లయినా, తండ్రయినాసరే క్షమించకూడదు కేర్ చెయ్యకూడదు.

పిరికిదానిలా ఏడవకు బీ బ్రేవ్!

ప్రణీత్ అంత చవట సన్యాసి కాడు తన ప్రియురాల్ని బలవంతాన ఎవరికో కట్టబెడుతుంటే చూస్తూ ఊరుకోడు నే వెళ్ళి అతనితో మాట్లాడి అతని ఉద్దేశ్యం నీకు చెబుతాను అయినా.... నువ్వు, అతను కూడా ఒకసారి విడిగా కలిసి మాట్లాడుకోండి సాయంత్రం అతన్ని తోట దగ్గరకు రమ్మని చెపుతాను" అన్నది హైమ.

ఆమె స్వరంలో ఆవేశం బాధ . నిజాయితీ తొణికిసలాడుతున్నాయి.

**తాతగారి కళ్ళు చెమరించాయి**

**"అమ్మా హైమా!"** అని పిలిచారు 'ఏం తాతయ్యా? మీ కిది సబబుగ **అనిపిస్తోందా?" అన్నది హైమ.**

"నా కిది చాలా నీచంగా అనిపిస్తోందమ్మా కాని ఏం చెయ్యను' నా కూతురు నా ఇష్టం అంటాడు. ప్రణీత్‌ని కలుసుకోవద్దని ఆంక్షపెట్టి వెళ్ళాడు ఎవరో ఒకరి విషయాన్ని వాడి చెవిలో ఊదుతారు వాడు మూర్ఖుడు ఏదయినా చేస్తాడు ఇప్పుడు మంజూ, ప్రణీత్‌లు కలుసుకోవటం మంచిది కాదమ్మా ఇది తెలిసిందంటే వెంటనే బాబూరావు తనతో తీసకెళ్ళిపోతాడు దీన్ని. అనుమానం కలిగిందా గట్టి బందోబస్తు ఏర్పాటు చేస్తాడు అప్పుడు మనకిహ అన్ని మార్గాలూ మూసుకుపోతాయి

వాడి అధికారబలం ముందు మనం ఓడిపోక తప్పదు అందుకే. . ప్రస్తుతం కామ్‌గా ఊరుకోండి తొందరపడొద్దని ప్రణీత్‌కి నా మాటగా చెప్పు. ఎప్పటికయినా మంజూ అతనిదే అని చెప్పు.

అతని ఆలోచన లేమిటో నువ్వు తెలుసుకుని వచ్చి నాతో చెప్పు మనకు వారం రోజులు వ్యవధి ఉంది పైకి తేలకుండా... పకడ్బందీగా ప్లాన్ వెయ్యాలి పాపారావులాంటి వాళ్ళకీ విషయంలో కనీసం అనుమానం కూడా కలగనివ్వకుండా వ్యవహరించాలి.

నెమ్మదిగా. .. శాంతంగా ఆలోచించి అతని ఐడియా ఏమిటో చెప్పమను నా సలహాలు నేను చెపుతుంటాను

వెంకట్రామయ్యగారికీ ఇంట జరిగిన అవమానానికి నేను స్వయంగా క్షమాపణలు కోరుకుంటానని చెప్పు" అన్నారాయన.

'థాంక్స్ తాతయ్యా. మీలాంటివారు ఇంటి కొక్కరున్నా చాలు

ఎందరో ఆడపిల్లలు బలవంతపు పెళ్ళిళ్ళ బారినుంచి బయట పడగలుగుతారు

మంజూ అదృష్టవంతురాలు.

పాత తరానికి చెందిన వాళ్ళందరివీ బూజు పట్టిన భావాలు అనుకునే నా అభిప్రాయాన్ని ఒక్క వేటుతో కూలదోశారు మీరు మీ వివేకానికీ. . సాహసానికి నా జోహార్లు" అన్నది హైమ

చిన్నదానివని నిన్ను పొగడటం లేదు గానీ హైమా! నాకన్నా నువ్వే సంస్కారవంతురాలివమ్మా! నాకు అది మనుమరాలు. ఆ మమకారంతో నేనేం చేసినా అది గొప్ప కాదు.

కానీ... నువ్వు?

ఓదార్చి.... ధైర్యం చెప్పి.. . అండగా నిలబడే మంచి స్నేహితురాలు ఎంతమంది ఆడపిల్లల కుంటుంది చెప్పు?" అన్నారు తాతగారు ఆప్యాయంగా హైమను చూస్తూ.

"వస్తా మంజూ! దిగులు పడి . వేడి వేడి నిట్టూర్పులు.. . కడవల కొద్దీ కన్నీళ్ళూ విడిచినంత మాత్రాన సమస్యలు పరిష్కారమవవు. ఇలా కుంగిపోవటం అసమర్థుల లక్షణం.

ప్రణీత్‌మీద నమ్మకముంచి నువ్వు నిశ్చింతగా ఉండు' అని మంజీరకు చెప్పి, తాతయ్యా! నేను ప్రణీత్‌ని కలుసుకుని మీ దగ్గర కొస్తాను అంటూ వెళ్ళిపోయింది హైమ.

నెమ్మదిగా నడచి వచ్చి తాతగారి ఒడిలో మొహం దాచుకుంది మంజీర కృతజ్ఞతతో కూడిన కన్నీరు ఆయన ఒడిని వేడిగా తాకింది

తాతగారి చెయ్యి ఆమె శిరస్సు మీద లాలనగా కదిలింది అప్పుడు వాళ్ళ మనసులో మెదులుతున్న భావాలకు భాష లేదు కొంచెంసేపయ్యాక తాతగారి తొడ మీద మోచెయ్యి ఆనించుకుని, అరచేతి మీద ఉంచిన మొహాన్ని పైకెత్తి చిరునవ్వు నవ్వింది మంజీర

"దట్స్ గుడ్!" అన్నారాయన తడిసి చెంపల కంటుకుపోయిన ఆమె ముంగురుల్ని చెవి వెనక్కు నెడుతూ .

శార్వాణికి భయంగా నిశ్చింతగా అనిపిస్తోంది ఏ భావమూ ఆమెలో సరిగ్గా నిలవ లేకపోతోంది .

ఆయన్నెదిరించి మనమీ కార్యాన్ని సవ్యంగా జరిపించగలమా" కంటి సైగతో మొత్తమంతటినీ భగ్నం చేసి పారెయ్య గల శక్తి ఆయనకుంది

ఆయనలో ఆవేశాన్ని రెచ్చగొడితే. ఆ ఫలితాల కెవరు ఆహుతి కావలసి వస్తుందో .

అసలిదంతా సవ్యంగా జరుగుతుందనే నమ్మకం మీకుందా?' సందేహంగా అడిగింది శార్వాణి

ప్రశాంతంగా సాగుతున్న తమ సంసారంలో ఒక్కసారిగా రేగిన ఈ తుఫాను ఎంతటి ఉధృత రూపాన్ని దాలుస్తుందో ఏ భయంకర పరిణామాలకు దారి తీస్తుందో అని భయంగా ఉందామెకు..

'పర్లేదమ్మా! అంతా ఆ రాముడి దయ. ఆయనే కాసుకుంటాడు ' అన్నారు తాతగారు.

శార్వాణికీ సమాధానం తృప్తిగా అనిపించటం లేదు రాముడు చూసుకునేదేమిటి? ఏం చూసుకుంటాడాయన? రేపు తన భర్త చెయ్యబోయే దౌర్జన్యాన్ని ఆయనే విధంగా అడ్డుకోగలడు? ఆ నమ్మకం తనకు లేదు మనిషి స్వశక్తి మీద ఆధారపడాలి గానీ దైవభక్తి మీద కాదు. దైవభక్తిని తమ ఆలోచనలకు సపోర్టుగా తీసుకోవాలే తప్ప, పూర్తి భారం వేసేసి చేతులెత్తెయ్యగూడదు! కానీ ఇదంతా తాతగారితో అనే ధైర్యం లేదు శార్వాణికి...

"అంతా సవ్యంగానే జరుగుతుంది లేమ్మా కాకపోతే మంజూ కొన్నాళ్ళు ఈ ఇంటికి దూరంగా ఉండాల్సి రావచ్చు. నువ్వు దాన్ని కలుసుకోటానికి వీల్లేదనీ ఆంక్షలు ఏర్పడొచ్చు.. దాన్ని విడిచి దూరంగా ఉండాల్సి రావటం నీ కెంత నరకమో నాకు తెలుసమ్మా

కానీ నీ కూతురి సుఖం కోసం నువ్వాహింసను భరించక తప్పదు " తాతగారి మాటలతో శార్వాణికి భరించలేనంత దుఃఖ మొచ్చింది చేతి చూపుడు వేలూ బొటన వేలూ కళ్ళ మీద నొక్కిపట్టి, దాన్ని అదిమే ప్రయత్నం చేసి విఫలమయిందామె...

తాతగారు జాలిగా చూశారు. ఈ విషయంలో తను ఆమె కెలాంటి సహాయమూ చెయ్యలేడు!

(ఇంకా ఉంది)






# దేవుడుంటూ వేరేలేడు

తూర్పు దిక్కున సూర్యుడు పద్మవ్యూహంలా తనను కమ్ముకున్న మేఘాలను కొద్దిగా ఛేదించుకుని అమాయకంగా భూలోకం వైపు చూస్తున్నాడు.

మూడు రోజుల క్రితం మొదలైన తుఫాను అప్పుడే కొద్దిగా శాంతించింది. యిళ్ళు కూలిపోయినవారు, సజీవంగా యిళ్ళల్లోను, నీటిలోను ప్రాణాలు కోల్పోయిన శవాలు దిక్కులేని అనాథల్లా కొట్టుకుపోతున్నాయి. తుఫాను సృష్టించిన బీభత్సానికి అనేక విధాల బలై గోడు గోడున విలపిస్తూ ఎవరి గొడవలో వారున్నారు.

గంటనుండి చంద్రి గుడి అరుగుమీద కూర్చున్నది. ఆకలితో పేగుకి అంటిన కడుపుని బాధగా తడుముకుంది.

సూర్య కిరణాలు వాడిగా భూమిని తాకేకొద్ది చంద్రిలోని ఆకలి బాణాలై దాని పేగుల్ని చీల్చుతున్నాయి.

ఆకలి, దరిద్రం నిత్యం దానికి సహవాసమైయాయి రెండేళ్ళనుంచి. దానికి పెద్ద పెద్ద కోరికలు లేవు. తన యిద్దరి బిడ్డలకు, తనకు పట్టెడు మెతుకులు చాలు. తమ జీవితాలు ఈ ఆకలిలోటు లేకుండా వెళ్ళమారితే చాలని చంద్రి రోజుకు పదిసార్లయినా భగవంతుడికి మొక్కుకుంటుంది.

రెండేళ్ళకు ముందు చంద్రికి మొగుడుగా రంగడు తృప్తికరమైన జీవితాన్నే చూపించాడు. వాడు రిక్షా లాగుతుంటాడు. ఏ విధమైన దురలవాట్లు లేవు వాడికి.

చంద్రిది, రంగడిది మనసులు కలిసిన వివాహం. రంగడికి యిచ్చి పెళ్ళి చేసేందుకు చంద్రి పెద్దలకు ఏమాత్రం యిష్టంలేదు. ఆచారంగాని, కట్టుబాట్లుగానీ రంగడి వంశానికి తమ వంశానికి నక్కకి నాగలోకానికి వున్నంత తేడా వున్నాయని చంద్రి తరపువారి అభిప్రాయం.

శ్రీ కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకొచ్చి వివాహ మాడినట్లుగా రంగడు చంద్రిని ఎవరి సహాయము ప్రమేయము లేకుండానే అర్థాంగిగా చేసుకున్నాడు.

చంద్రికి, రంగడికి వారి వారి పెద్దలతోను, ఆచారాలతోను, కట్టుబాట్లతోను సంబంధాలు తెగిపోయాయి. యిరువైపులవారు యిద్దరిని వెలివేశారు.

ఊరికి దూరంగా గుడికి దగ్గరగా గుడిసె వేసుకుని సంసారాన్ని ప్రారంభించారు. వారి ప్రేమ కథ విన్న ఆలయ పూజారి రామశాస్త్రిగారు జగమెరిగిన బ్రాహ్మణునికి జంధ్యమేల అని తెలిసినవాడు కావడంతో చంద్రిని, రంగడిని నిండు మనుస్సుతో ఆశీర్వదించారు.

కొద్ది సంవత్సరాలు వారి జీవితం పచ్చని వసంతాల్ని చవిచూసింది. యిద్దరి బిడ్డలకు తండ్రైన తరువాత రంగడు ఓ లారీ ప్రమాదంలో శాశ్వత విశ్రాంతి తీసుకున్నాడు. అప్పటినుంచి ప్రారంభమైయాయి చంద్రిపాట్లు. ఆ యింట్లో ఈ యింట్లో పాచిపని చేసుకుంటూ బిడ్డల నిద్దర్ని పోషించుకుంటోంది.

మూడు రోజులనుంచి పట్టుకున్న తుఫానువల్ల అది గుడిసె విడిచి వచ్చేందుకు వీలుకాలేదు. బిడ్డలిద్దరితోపాటు చంద్రి కూడా ఆకలితో మల మల మాడి పోతూంది దానికీ సమయంలో ఊళ్లో కెళ్ళినా పట్టెడన్నం దొరకదని తెలుసు. తుఫాను సృష్టించిన అల్లకల్లోలంనుంచి సర్దుకోడానికి ప్రజలకు కొద్ది రోజులు పట్టవచ్చు.

ఎన్ని తుఫాను లొచ్చినా ఎన్ని అవాంతరాలు జరిగినా గుళ్లో దీపం వెలిగించకా తప్పదు. దేవునికి నైవేద్యంగా పొంగలి పెట్టకతప్పదు. ఆ ప్రసాదంతోనైనా ఈ రోజుకు తను తన బిడ్డలు ఆకలి తీర్చుకోవచ్చుని దాని ఆశ.

'పూజారి గారింకా రాలేదు. ఎప్పుడొస్తారో? పూజ చేసే వేళ దాటిపోతూంది. ఈ రోజుకు నైవేద్యం చేయకపోతే? హమ్మో'! ఒక్కసారిగా గుండెలమీద చేతులు వేసుకుంది చంద్రి. దాని ఆలోచనలు దానికే భయం కలిగించాయి.

మామూలు రోజుల్లో అయితే ఓ మాదిరిగా జనం గుడికి వస్తుంటారు. ఈ తుఫాను దెబ్బకు కొద్ది రోజులు గుడి మొహం జనం చూడరేమో?కనీసం కొబ్బరికాయ, అరటి పళ్లతో నైవేద్యం చేసినా చాలు ఎలాగో ప్రాణం నిలుపుకుంటాం. ఆకలితో శోష వచ్చేలా వున్నది. అనుకుంటూ చుట్టూ చూసింది చంద్రి.

గుడిగోపురం చుట్టూ వివిధ భంగిమల్లో నగ్నంగా వున్న ఆడ మగ బొమ్మలు దానికి కనిపించాయి. ఎప్పుడూ అంత పరీక్షగా చూడకపోవడంతో దాని కంటపడలేదా బొమ్మలు అప్పటివరకు. ఒక్కసారిగా దానికి సిగ్గు, భయం, అసహ్యం కలిగాయి. గుళ్లో యిటువంటి బొమ్మలెందుకున్నాయో ఎంతాలోచించినా దాని మనస్సుకు అర్థం కాలేదు.

ఒక్కసారిగా చంద్రి వాస్తవంలోకి వచ్చింది బిడ్డలు ఏం చేస్తున్నారో ఆకలితో వెన్ను నంటిన



కవిత

కడుపులకి అమ్మ అన్నం తెస్తుందని ఆత్రంగా ఎదురు చూస్తున్నారేమో? పెద్దాడికి కొంచెం ఓర్పు ఎక్కువే వాళ్ల నాన్నలా, కానీ చిన్నాడు ఆకలని ఏడుస్తున్నాడేమో? పూజారిగారింకా రాలేదు.

పూజారిగారు త్వరగా వస్తే బాగుండు అయనిచ్చే ప్రసాదం యింటికి తీసుకెళ్లి బిడ్డలిద్దరికి తినిపించాలి.

లేని ఓపిక కూడ గట్టుకుని అరుగుమీంచి లేచి గుళ్లోకి నడిచింది చంద్రి.

కొంతమంది సాధువులు గంజాయిలాంటిది ఒకరి తరువాత ఒకరు పీల్చుకుంటూ మత్తులోకి జారుకుంటున్నారు. మరి కొందరు పేకాడుతున్నారు. మధ్య మధ్యలో బ్రాందిలాంటివి గ్లాసుల్లో పోసుకుని తాగుతున్నారు.

యిన్ని అమానుషాలు తన కంటి ఎదుటే జరుగుతాయని తెలిసికాబోలు దేవుడు హృదయంలేని శిలారూపుడై నిత్య చిద్విలాసుడైనాడు.

ఆలోచిస్తూ మంటపానికి ఆనుకుని శోషతో నిద్రలోకి జారింది చంద్రి.

* * *

పూజారిగారు కొట్టిన గంటకు చంద్రికి మెలకువ వచ్చింది.

నైవేద్యం అయిపోతుందేమో, అనుకుంటూ గబగబా గుళ్లోకి నడిచింది చంద్రి.

లోపల దేవుడి గదిలో పూజారి రామశాస్త్రిగారు హారతి పడుతూ మంత్రాలు ఉచ్చరిస్తున్నారు.

పూజారిగారు బాధగా నిట్టూర్చారు "చెయనీవె చంద్రి. వాళ్ళను అడ్డుకునే ధైర్యం నాకులేదు. ఆ భగవంతుడే వాళ్లకు తగిన శిక్ష వేయాలి. గుడిక్రింద వున్న భూముల ఆదాయం యధేచ్ఛగా, దౌర్జన్యంగా తింటూ మా కడుపులను కొడుతున్న పెద్దవాళ్లనే యిదేం న్యాయం అని నిలదీయలేని నిస్సహాయుణ్ణి అయ్యాను. నేను చేయగలిగిందేమి లేదు."

"ఈ రోజు మీరిచ్చే ప్రసాదమే మా ప్రాణాల్ని నిలుపుతుంది పూజారిగారు దీనికోసం రెండుగంటలనుంచి కాచుకున్నాను." జాలిగా అంది చంద్రి.

పూజారిగారు చలించేరు "నువ్వేకాదు చంద్రి ఈ ప్రసాదంకోసం ఆలయంలో దేవుడే యిప్పటివరకు ఎదురు చూశాడు. రెండు రోజులనుంచి భోజనంలేని నా కుటుంబం ఆత్రంగా ఎదురు చూస్తుంటుంది. అడుగంటిన రెండు దోసిళ్ల బియ్యంతో ఈ రోజుకు

గుమ్మంలో నిలబడిన చంద్రిని చూసి ఆశ్చర్యంగా అడిగారు.

"ఈ ప్రసాదం తీసుకోండి పూజారిగారు. దైవంవంటి మీరు. మీ కుటుంబం ఆకలితో పస్తులుండి మీ రిచ్చిన ప్రసాదంతో మా కడుపులు నింపుకోలేము. పనిచేసో, యాచించో మా కడుపులు ఎలాగో నింపుకోగలం.

దేహి అన్నవాళ్లకు దానం చెయ్యడం తప్ప యాచించడం తెలీని మీకు నోటికందవలసిన ప్రసాదం తీసుకుని పాపం మూటగట్టుకోలేను. దయచేసి నా ప్రార్ధనను తోసిపుచ్చక ఈ ప్రసాదం తీసుకోండి." అంటూ తనచేతిలోని ప్రసాదాన్ని రామశాస్త్రిగారి చేతిలో వదలి గబగబా తన గుడిసెవేపు వెళ్లిపోయింది చంద్రి.

కలో నిజమో తెలీని పరిస్థితి అయింది



చేతులు జోడించింది చంద్రి.

అరగంటకల్లా పూజ అయిపోయింది. పూజారిగారితో పాటు ప్రసాదం గిన్నె బయటకు వచ్చింది. అక్కడున్న అందరికి ప్రసాదంపెట్టి మిగిలిన మొత్తం దీనంగా అర్ధిస్తున్న చంద్రికి యిచ్చారు.

"పూజారిగారు గుడి తలుపులు తెరచుకుని వెధవపన్ను చేస్తున్నారండి" అంది చంద్రి. పూజారిగారిచ్చిన ప్రసాదం కళ్లకద్దుకుని మనస్సులోనే అయనకు నమస్కరించింది.

దేవుడికి నైవేద్యం వెళ్లబుచ్చాను. రేపుకి ఆ దేవుడే మార్గం చూపించాలి." ఆయనకంఠం ఏదో తెలియని బాధతో వణికింది.

చంద్రి నిలబడిపోయింది దానిలోని మానవత్వం చలనం తెచ్చుకుంది. కొద్ది క్షణాలు ఆలోచించింది అప్పటికే పూజారిగారు యింటికి వెళ్లిపోయారు.

చేతిలోని ప్రసాదం కట్టిన మూటను భద్రంగా పట్టుకుని గబగబా వెళ్లి పూజారిగారి యింటి తలుపు తట్టింది.

పూజారిగారు తలుపుతీశారు... ఏవిటే చంద్రి?"

రామశాస్త్రిగారికి అన్నీ తెలిసీ ఏమీ తెలియనట్టుండే దేవునికన్నా, ఏమీ తెలియక తనకున్న సంస్కారంతో ఎదుటివారి బాధలు పంచుకుందామనే గుణం కలిగిన చంద్రి ఆ క్షణంలో రామశాస్త్రిగారి దృష్టిలో దేవునికంటే ఎక్కువ స్థానం పొందింది

నీరు నిండిన కళ్ళకు దూరంగా గుడిసెవేపు వెళుతున్న చంద్రి మసక మసకగా కనిపించింది. రెండు చేతులెత్తి నమస్కరించాడు రామశాస్త్రి. □

# వ్యక్తిగతం



కెప్టెన్ సుబ్బారావుప్రభల భారత్ ఎలెక్ట్రానిక్స్ లిమిటెడ్ చైర్మెన్, మానేజింగ్ డైరెక్టరుగా నియమింపబడ్డారు. భారత నౌకాదళంలో పదవీ విరమణ చేసిన కెప్టెన్ సుబ్బారావుప్రభల ఇంతకు ముందు బెంగుళూరులోని భారత్ ఎలెక్ట్రానిక్స్ లిమిటెడ్ సముదాయానికి ఎక్సిక్యూటివ్ డైరెక్టర్‌గా ఉన్నారు □



హృదయ కోశ వ్యాధుల శస్త్ర వైద్యుడుగా వైద్య ప్రపంచానికి చిర పరిచితులైన డాక్టర్ దన్‌రాజ్ మహాజన్ ఇటీవల రాష్ట్రపతికి గౌరవ వైద్యుడిగా నియమింపబడ్డారు ఆయన న్యూయార్క్‌లోని కార్నెల్ మెడికల్ సెంటర్‌లో పని చెస్తున్నప్పుడు ప్రపంచంలో మొట్ట మొదటి అయోర్టా మార్పిడి శస్త్ర చికిత్స చేసారు ప్రస్తుతం న్యూఢిల్లీలోని గంగారామ్ హాస్పిటల్‌లో పని చేస్తున్న ఈయన ఎన్నిటిలోనో మొదటివారుగా ఉన్నారు కంతులని కరిగించటానికి లేసర్ పద్ధతిని ఉపయోగించటం అన్నది ఇటీవల ఆయన మొదటి సారిగా చేసారు ఢిల్లీ మెడికల్ స్పెషాలిటీస్ ఆసుపత్రి రూపకల్పన కూడా ఆయన ఊహాజనితమైనదే పదహారు సంవత్సరాలపాటు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఈయన పని చేసారు ఢిల్లీలోని జె ప హాస్పటల్‌లో ఇంటర్‌నిషిప్ పూర్తి చేసిన వెంటనే ఆయన ఫుల్‌బ్రైట్ స్కాలర్‌గా అమెరికా వెళ్లారు అక్కడ డేవిడ్ ఫ్లెమింగ్ అనే ఆరేళ్ల బాలుడికి అత్యంత క్లిష్టమైన గుండె ఆపరేషన్ చేసారు ఆపరేషన్ చేస్తూ ఉండగా డేవిడ్ గుండె ఒకసారి ఆగిపోయింది కూడా అయినా తిరిగి దానిని పని చేయించి ఆ శస్త్ర చికిత్సని విజయవంతంగా పూర్తి చేసారు. ఆ సందర్భంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని తూర్పు ప్రాంతంలో ఉన్న పత్రికలన్నీ డా మహాజన్ గురించి మొదటి పేజీలలో ప్రముఖంగా రాసాయి రెండు బెలూన్‌లు ఉండే కార్డియాక్ కాథెటర్ (గుండెలోకి చొప్పించే గొట్టం లాంటిది) ఒక దానిని ఆయన రూపకల్పన చేసారు మహాజన్ క్లిఫ్టన్ కాథెటర్ అని పిలువబడే దానిని ప్రస్తుతం ప్రపంచంలోని హృదయరోగ వైద్యులంతా ఉపయోగిస్తున్నారు ఎన్నో వైద్య సంఘాలలో ఆయనకి సభ్యత్వం ఉన్నది అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని భారతీయ వైద్యుల సంఘాన్ని ఆయనే స్థాపించారు ఆయన అసాధారణ ప్రతిభకి గుర్తింపుగా ఎన్నెన్నో పతకాలు ఆయనకి లభించాయి □

# వారఫలం

## 19-12-1986 శుక్రవారం మొదలు 25-12-1986 గురువారం వరకు

★ **మేషం :** అష్టమ శని బాధ ఉన్నా, ఒకటి రెండు రంగాలలో అనుకూలత చెప్పదగియున్నది. అంటే ఆర్థికంగా అని అర్థం. ఏదైనా వ్యాపారం క్రొత్తగా ప్రారంభమయ్యేలాగైతే అనుకూలమే. కాని వారి మాటలను నమ్మరాదు. స్త్రీలకు : అనవసరంగా గొడవలు, లేనిపోని చికాకులు.

★ **వృషభం :** మీరు చేసే ఉద్యోగంలో స్థంభించినలాగవుతుంది. మీ ఆరోగ్యంలో భంగం ఏర్పడుతుంది. మీ యింట శుభం జరుగుటకు యింకా కొంతకాలం పడుతుంది. 'కోర్టు' వ్యవహారాలు ఉంటే అనుకూలమే. విద్యా విషయంగా పెంపొందే వారం. దూర ప్రయాణాలుంటాయి. కొందరు ప్రమాదానికి గురి కావచ్చు, జాగ్రత్త. స్త్రీలకు : అనుకోనని యిబ్బందులుంటాయి. అప్రయత్న లబ్ధి ఉన్నా యిబ్బందులే.

★ **మిధునం :** నాలుగు విధాలా మేలున్నది మేలున్నదని, డబ్బు బాగా అందుతున్నదని, యితరులకు సహాయం చేయాలంటూ వ్యర్థం చేసికోకండి. అప్పులిస్తే తిరిగిరావు. స్త్రీలకు : వృత్తి యందు మెరుగు. ఉద్యోగ రీత్యా లాభించే సమయం. రాజకీయంగా మేలు గాదు.

★ **కర్కాటకం :** ఆదాయం గల వారం ఆదరణకు అనుకూల వారం. మిత్రులుగాని, బంధువులు గాని. పరిచితులుగాని యింటికి రావచ్చు. కొందరు హటాత్తుగా సంభవించిన ఆపదనుండి తప్పించుకోగలరు. ప్రభుత్వపరంగా కొందరు దండన అనుభవించవలసి రావచ్చు. స్త్రీలకు : అన్ని విధాలా యిబ్బందులే.

★ **సింహం :** ఒకానొక విషయంలో ముందు వెనుకలు ఆలోచించక ప్రతిజ్ఞ చేస్తారు, ఎవరికో మేలు చేస్తామని బాస చేస్తారు. ఇంకెవరికో ఏదో మేలు చేయగలమని చెబుతారు. ఏదీ చేయలేని పరిస్థితి ఏర్పడుతుంది. స్త్రీలకు : నూతన వస్తువులు, బట్టలు కొనుగోలు చేయగలుగుతారు

★ **కన్య :** అనుకూల శతృవులున్నారు. వెనుక ముందు లాలోచించి మెలగండి. అలా యిలా తిరుగుతూ మతిమరుపు వలన ముఖ్య కాగితాలు పోగొట్టుకొంటారు. గమనించండి. స్త్రీలకు : సుఖ శాంతులు, ఆనందోత్సాహాలు, శుభ కార్య తత్పరత.

★ **తుల :** ఉత్సాహం అతిశయిస్తుంది. చాలమంది 'పొంగు శని' బాగా మేలుచేసాడని గ్రహిస్తారు. అరవై ఏండ్లు దాటినవారు ఆరోగ్య రీత్యా జాగ్రత్త పడాలి. పది మందిలో కొందరకు అనవసరంగా యిబ్బందులు రాగలవు. స్త్రీలకు : నూతన యత్నాలు ఫలిస్తాయి, గమనించండి.

★ **వృశ్చికం :** ఏ విషయానికైనా సూటిగా మాట్లాడటం అలవాటు చేసికోవాలి. ఏదో మాట్లాడి తప్పించుకొందామనుకోవటం పొరబాటు. మాటల్లో, చేతల్లో జాగ్రత్తగా ఉండాలి. ఒకదానికొకటి పొందిక ఉండాలి. స్త్రీలకు : ఏమంత సుకరమైన వారం కాదనే చెప్పాలి.

★ **ధనుస్సు :** గ్రహస్థితిలో మార్పులు వచ్చినా మీకేమంత మంచి జరుగదు. చెప్పరాని ఖర్చులు తగులుతవి. అలవాటుగా చేసే పనులలో యిబ్బందులు ఏర్పడుతవి. మాటకు విలువ పోగొట్టుకోకండి. అలాంటి సంఘటనలు జరుగవచ్చు. స్త్రీలకు : కొందరకు అశాంతి, కొందరకు అనవసర గొడవలు.

★ **మకరం :** వృత్తి యందు పెంపు చెప్పదగిన సమయం. వ్యాపారమందు చెప్పదగిన హాయి, ఆనందం, అనుకూలం, ధన లాభం చేకూరుట గమనిస్తారు. ఏనాడో రావలసిన 'ఇంక్రిమెంటు' ఈనాడు అందుట విశేషం. స్త్రీలకు : ఆపనీ, ఈపనీ అని హడావుడిగా వారమంతా జరుపుతారు.

★ **కుంభం :** ఆదాయమున్నా, అధిక వ్యయం చేయవలసిన పరిస్థితులుంటాయి. కొందరకు కారణం ఏమో గాని ఉత్సాహం సన్నగిల్లుతుంది. పోయినచోట నెల్లా యిబ్బంది ఎదురవుతుంది. ఒకానొక విషయంలో మనశ్శాంతి లోపిస్తుంది. స్త్రీలకు : సర్వ విధాలా ఉత్సాహ జనకమైన వారం.

★ **మీనం :** ఇంట శుభం జరుగుట నిశ్చయం. పుణ్య కార్యాచరణమైనా కొనసాగుతుంది. వృత్తి యందు ప్రగతి చెప్పదగిన సమయం. శ్రమకు తగిన ఫలితం అందుకోగలరు. స్త్రీలకు : విద్యా పరిశ్రమ ఫలవంతం, ధనాదాయం, ఆదరించే వ్యక్తులు తటస్థ పడుతారు, గ్రహించాలి.

-విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# ప్రాణాంతకాలైన ధూమపాన – మద్యపానాల కలయిక

త్రాగుడు – ధూమపానం, రెండూ హానికరమైన దురలవాట్లే! వీటిలో ఏ ఒక్కటి వున్నా మానవుడికి కలిగే అనారోగ్యం ఎన్న తగినది. అలాంటిది ఈరెండూ కలసి ఒకేవ్యక్తిలో వున్నపుడు కలిగే దుష్పరిణామాల సంగతి ఇక చెప్పేదేముంది?

సాధారణంగా మగపిల్లలు కౌమార దశలో ధూమపానాన్ని మద్యాన్ని అలవాటు చేసుకుంటారు. ఎందుకంటె దీన్ని వారు'మగసిరి'కి చిహ్నంగా భావించడమే! కాని ఆధునిక ప్రయోగాలలో, శాస్త్ర పరిశోధనలో తేలిన అంశాలు వింటే, వారు ఎంతటి అపోహలలో నివసిస్తున్నారో తెలుస్తుంది. మద్యానికి అలవాటు పడిన పురుషుడిలో లైంగిక పరిపక్వత ఆలస్యమవుతుంది. క్రమం తప్పకుండ చేసే మద్యపానం వల్ల పురుషునిలోని సెక్స్ హార్మోన్ 'టిస్టాస్టిరోన్' స్థాయి రక్త ప్రవాహంలో తగ్గిపోతుంది. ఇక పొగాకు సేవనం స్పెర్మ్‌సెల్స్ యొక్క క్రమ రహితమైన ఆకారానికి దోహదం చేస్తుంది. ఈ విధంగా ఈ రెండు అలవాట్లూ వున్న పురుషుడు తాను తండ్రి అయ్యే అవకాశాన్ని లేకుండా చేసుకోవడమో, లేక సంతానం వున్నా అనారోగ్యం తోకూడుకుని వుండడమో జరుగుతుంది.

త్రాగుడులో వాహనాన్ని నడపడం అన్నది అతి ప్రమాదకరమైన చర్యగా భావించ బడుతుంది. కాని ప్రస్తుతము వైద్య పరిశోధనలో కనుగొన్నదేమిటంటే ఆల్కహాలు + పొగాకుల కలయిక ఒకవ్యక్తిపై కలుగజేసే ప్రభావం చాలా దారుణంగా వుంది, అవి విడివిడిగా కలుగజేసే ప్రభావానికి ఎన్నోరెట్లు అధికంగా వుంటుందని. దీనివల్ల అవ్యక్తి ఎక్కువ రిస్క్‌కి లోనవుతాడు.

శాస్త్ర పరిశోధనలన్ని సమీక్షించిన తర్వాత అమెరికాలోని 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆన్ ఆల్కహాల్ అబ్యూస్ ఎండ్ ఆల్కహాలి జమ్' వారు ఆల్కహాలు, పొగాకు కలిసి పరస్పర సహకారంతో కూడబలుక్కున్నట్టుగా కాన్సర్ రిస్క్‌ని పెంచడానికి దోహదం చేస్తున్నాయి." అని ప్రకటించారు. ఈ రెండు అలవాట్లని క్షుణ్ణంగా పరిశీలిస్తే ఇవి కలిగిస్తున్న హాని అర్థమవుతుంది. ధూమపానంచేసే వ్యక్తి ప్రతి పీల్పులో దాదాపు 4000 వివిధ రసాయనాలులోపలికి తీసుకుంటాడు. ఇందులో ప్రమాదకరమైన హైడ్రోజన్ సైనైడ్, కార్బన్ మోనాక్సైడ్, నైట్రోజన్‌డై ఆక్సైడ్‌వంటి వాయువులేకాక మరి 4 డజన్ల బెంజోపైరిన్, రేడియో ధార్మిక పొలోనియం –210 లాంటి పదార్థాలు వున్నాయి. పొగాకు ధూమంలోని చాలా రసాయనాలు నోరు, నాసిక, గొంతు, ఊపిరి తిత్తులలో తారు అనే పూతరూపంలో నిలిచి పోతాయి. ఈ తారులోనే కాన్సర్‌ని కలుగజేసే శక్తి ఇమిడి వుంది. మద్యపానం ధూమపానం రెండూ వున్న వ్యక్తి, ధూమపానం అయిన వెంటనే మద్యంతో తన దాహాన్ని తీర్చుకోవడంతో, ఈ తారుపూతని విస్కీతో లోపలికి కడిగేయడంతో విస్కీ ఈ పూతకు ద్రావణిగా పనిచేసి, దీనిని పూర్తిగా కరిగించుకుని కార్సినోజన్‌లను అంటే కాన్సర్ కారక కణాలను వివిధ మెంబ్రేన్స్ ద్వారా రవాణా చేసే చర్యను సులభతరం చేస్తుంది. ఇలా మద్యం సేవిస్తూ సిగరెట్టు వెలిగించడం అన్నది కొనసాగిస్తే, రసాయన కర్మాగారం అయిన మానవ శరీరంలోని కాలేయం, మామూలుగా అది జరపాల్సిన కొన్నిదైనందిన చర్యలను వాయిదా వేసి, రక్త ప్రవాహంలోని హానికారక పదార్థాలని వడపోసే చర్యగా ఆల్కహాల్‌ని దాదాపు 95 శాతంవరకు ఇతర రసాయనాలుగా మార్చడానికి పూనుకుంటుంది. ఏ స్టాండర్డ్ మద్యంలోనైనా ఒకగంట కాలంలో సేవించే పరిమాణంలో 15 సి. సి. ల స్వచ్ఛమైన ఆల్కహాల్ వుంటుంది. పై రెండు అలవాట్లకి బానిసయైన వ్యక్తి రక్తంనుండి పై పరిమాణంగల ఆల్కహాల్‌ని మార్చే చర్యలో వుపయోగించే శక్తివల్ల, కాలేయం రక్త ప్రవాహంలోని పొగాకు పొగలోని విషాలను తొలగించడం క్రొవ్వును తీసివేయడం లాంటి చర్యలు నిలిపివేయడంతో రక్తంలో 'లిపిడ్స్', ట్రిగ్లిసీరైడ్స్', లాంటివి పేరుకు పోవడమేకాక సిగరెట్టు పొగలోని ఇతర రసాయనాలు రక్తానికి 'కొయగులేట్' అయ్యే స్వభావాన్ని పెంచుతూ పోతాయి. దినివల్ల రక్తం చిక్కబడిపోయి రక్తనాళాల్లో రక్తం క్రిక్కిరిసిపోయి, రక్త ప్రసరణకు ఇబ్బంది కలుగుతుంది.

ఊపిరి తిత్తులలో, ఆక్సిజన్ అణువులు రక్తంలోని 'హెమోగ్లోబిన్' తో కలిసి వుంటాయి. ఒక్కొక్క సిగరెట్టుపీల్పులోపైరెండు అలవాట్లున్న వ్యక్తి గ్రహించే కార్బన్ మోనాక్సైడ్‌ని లోపలికి గ్రహించడంవల్ల ఆక్సిజన్ కంటే 240 రెట్లు ఎక్కువగా హెమోగ్లోబిన్‌తో కలిసే రసాయన ప్రవృత్తి వున్న ఈ కార్బన్ మోనాక్సైడ్ ఆక్సిజన్ అణువులు హెమోగ్లోబిన్‌లో చేరకుండ చేస్తుంది. ఈ విధంగా రోజుకు 1–2 పెట్టెలు సిగరెట్టు త్రాగే వ్యక్తి రక్తం 6–8 శాతం వరకు ఆక్సిజన్‌ని మోసుకెళ్లే సామర్థ్యాన్ని కోల్పోతుంది. ఇది దినదినాభివృద్ధి పొందే కొద్దీ ఆక్సిజన్ కొరత ఎక్కువై అతని నాడీ మండలములోని అన్ని భాగాలు ఒక ప్రమాద స్థితిని చేరుకుంటాయి. దీనికి తోడు కాలేయానికి సంబంధించిన జబ్బు ముదిరిన స్థితిలో వుంటే, ఇది 'సయనోసిస్' హైపర్ వెంటిలేషన్, హైపాక్సియావంటి ఆక్సిజన్ లేనితనానికి ఆ వ్యక్తిని గురిచేస్తాయి. రోజుకి 60 సి. సి. ల ఆల్కహాల్‌ని సేవించే వారిలో హైపర్ టెన్షన్ ఎక్కువై బి. పి. పెరగడం, తద్వార గుండె జబ్బుల అవకాశాన్ని పెంచుతుంది.

"గాస్ట్రిక్ అల్సర్స్"కి చేసే చికిత్సలో వాడే మందులు ధూమపానం చేసే వాళ్లలో పొగాకు ప్రభావంవల్ల ఏమాత్రం పని చేయవని కనుగొన్నారు. ఎందువల్లనంటే కొంత



ప్రాణాంతకాలైన
ధూమపాన – మద్యపానాల కలయిక

వాడు రెండింటిలో దేన్నీకూడా
క్షణం వదిలి వుండలేడు!

కాలపరిమితిలో నెమ్మదిగా పనిచేయాల్సిన ఈ మందులు పై వ్యక్తి మద్యం సేవించేవాడుగా కూడ వున్నప్పుడు, ఆల్కహాల్ ఆ మందులను కరిగించే ద్రావణిగా పనిచేసి ఒకేసారి ఎక్కువ మోతాదులో ఆమందును శరీరానికి అందజేసి శరీరంపై ఒకషాకిలాగా పనిచేసి ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది 1972 లో జరిపిన ఒక సర్వేలో 76 శాతం నోటి కాన్సర్, పై రెండు అలవాట్లూ వున్నవారిలో వస్తున్నట్లు తెలిసింది.

గర్భవతులు పై రెండు అలవాట్లని కలిగివుంటే ఆక్సిజన్ గ్రహించే సామర్థ్యం తగ్గడలవల్ల గర్భస్థ శిశువుకి ఆక్సిజన్ అందకపోవడం, తల్లి రక్తంలోని నికోటిన్ రక్త ప్రవాహానికి ఆక్సిజన్ సరఫరాకు ఆటంకం కలిగించడం జరిగి గర్భ విచ్ఛిత్తికి దారితీస్తుంది లేదా పుట్టబోయె శిశువు రకరకాల జబ్బులకు లోనయ్యే అవకాశముంది వీని ప్రభావంవల్ల ఆ శిశువు యొక్క భౌతిక పెరుగుదలతో పాటు తెలివి తేటల పెరుగుదల కూడ తీవ్రంగా అరికట్టబడుతుంది. ఎంతో మంది ఈ విషయాలేవి గమనించకుండ ధూమపానానికి, మద్యానికి బానిసలై మృత్యుకౌగిలిని చేరుతున్నారు ఈ రెండు దురలవాట్లను నివారించె చర్యలు ఏ మాత్రం ఆశాజనకంగా లేవు ప్రస్తుత కంప్యూటర్ యుగానికి, దేశాభివృద్ధికి ఇటువంటి దురలవాట్లు గొడ్డలిపెట్టులాంటివి పూర్వం చైనీయులను నిర్వీర్యులనుగా చేయడానికి శత్రువులు ఓపియం (నల్లమందు)ని వాడారట! అదేవిధంగా జాతిని నిస్తేజం చేసె ఈ రెండు దురలవాట్లకు బానిసలు కాకుండ ప్రజలలో చైతన్యాన్ని కలిగించడానికి ప్రభుత్వమూ, వ్యాపార సంస్థలు, ప్రచార సంస్థలైన రేడియోలు, టీవీలు మొదలైనవి నడుంకట్టి పని చేయాల్సిన తరుణం ఆసన్నమైంది.

–కే. యస్. శాంతలక్ష్మి



"ఏమిటీ మీ ఇంట్లో నీళ్ళు లేవా? అయ్యో పాపం!!"
"ఉండండి, మా ఇంట్లో బిందెలో ఉన్నాయేమో చూస్తాను."





నీటి కథ
కన్యాకుమారి





"అయ్యో బాబోయ్, ఎవరో వస్తున్నట్లున్నారు! కొంపదీసి మా నాయనమ్మ కాదు కదా? నా వీపు..."
"మీ వెర్రిగానీ సిటీలో నీళ్ళకోసం ప్రాణాలైనా ఇస్తారుగానీ బిందెడు నీళ్ళు ఇస్తారుటండీ!..."

ఫోటోలు: విజయసుందర్

# పాఠకని పెళ్ళిపాలు

తెలుగు వెలుగు సంపాదకులకు,

నమస్కారం

మీరు నిర్వహిస్తున్న ఉగాది కథల పోటీకి 'కంచిమేక' అనే కథ పంపిస్తున్నా. ఈకథ మీ గడువుతేది దాటిన రెండ్రోజులకు మీకు అందుతుంది. అయినా దయతో పోటీకి స్వీకరిస్తారని ఆశిస్తున్నా. కథ ఫెయిర్‌చేసి పంపించడానికి నా ఆర్థిక పరిస్థితులు అనుకూలించక ఆలస్యమయ్యింది. నేనొక పేపర్‌బాయ్‌ని. ఇది నా ప్రథమ ప్రయత్నం అందుకనే పోటీకి స్వీకరించమని మరీ మరీ కోరుతున్నా సార్. మీ నిబంధనల్లో కాగితానికి ఒక ప్రక్క సిరాతో రాయాలని వుంది కానీ నాకందుబాటులో వున్న బాల్‌పెన్‌తో రాసి పంపిస్తున్నా అది సిరాతో రాసినట్టు పరిగణిస్తారో లేదో నాకు తెలీదు. కథ సొంతమనీ, దేనికీ అనుసరణ, అనువాదంకాదని హామీ ఇస్తూ, నా ఈ రచనను పోటీకి పరిశీలించమని కోరుతున్నా.

ఇట్లు

కె. తాతయ్యలు.

సాధారణంగా పోటీ కథలలో వచ్చే హామీ పత్రాలకు భిన్నంగా అమాయకంగా ఉన్న ఆ ఉత్తరం, ఉత్తరం కింది పేరు నన్ను అమితంగా ఆకర్షించాయి. ఉత్తరంలోని దస్తూరి అస్తవ్యస్తంగా ఉన్నా, రాసిన తీరు చేయి తిరిగిన రచయితలా ఉండడం నన్నాశ్చర్య పరిచింది. సరిగ్గా గంట క్రితమే కథల పోటీకి వచ్చిన రచనలను మొదటి వడపోసి న్యాయ నిర్ణేతలకు పంపాల్సిందిగా సబ్ ఎడిటర్ మానసతో చెప్పాను. అయినా పై ఉత్తరం చూసిన తర్వాత బావుంటే ఆ కథను కూడా చేర్చాల్ననే అభిప్రాయం 'కంచిమేక' కథను చదివించింది. ఆ కథలోని మొదటి వాక్యమే నన్నాకట్టుకుంది. పూర్తిగా చదవాల్సిన అవసరం లేకపోయినా కథ చివరంటా చదివించింది. కథలో శిల్పం కాని, వస్తువు కాని కొత్త రచయిత రాసినట్టు లేవు! నేను న్యాయ నిర్ణేతనైతే బహుమతికి నిలబడేకథే. వెంటనే మానసను పిలిపించి ఆ కథను కూడా పోటీ కథల లిస్ట్‌లో చేర్చమన్నాను.

చూడమ్మా మానసా..." వెను దిరిగిన మానస నా పిలుపుతో ఆగింది. "వాళ్ళు ముగ్గురూ లాడ్జికి చేరుకున్నట్టేనా?"

"శశిభూషణ్‌గారు, పార్థసారథిగారు ఇద్దరూ రెడీగా ఉన్నారు. శరత్‌బాబుగారు మరో గంటలో అక్కడికి వెళ్తున్నట్టు ఫోన్ చేశారు. ఈలోగా స్క్రిప్ట్‌లు పంపిస్తే మిగతా ఇద్దరూ చదువుతుంటారు"

"అయితే వాటిని నువ్వే స్వయంగా తీసుకెళ్ళు. వాళ్ళకేమయినా అనుమానా లొస్తే వివరంగా చెప్పు. లాడ్జి మేనేజర్‌తో వాళ్ళక్కావలసిన ఏర్పాట్లన్నీ జాగ్రత్తగా చూడమని చెప్పు."

"అలాగే"

"ఎల్లుండికల్లా నిర్ణయం పూర్తి కావాలని - లేకపోతే మనకు వ్యవధి చాలదని జడ్జెస్‌తో మరోసారి చెప్పు."

"ఓకే. అలాగే" మానస వెళ్ళిపోయింది.

నన్ను ఆ తాతయ్యలు ఆలోచనలు వదలలేదు. సాధారణంగా రచయితలు అందమైన కలం పేర్లను పెట్టుకుంటారు - అలాంటిది ఎంత పాతగా ఉన్నా అసలు పేరుతో నే కథ రాసిన ఆ కుర్రాడి నిజాయితీ, నన్ను కదిలించింది. ఉత్తరంలో కూడా నిజం దాయకుండా ఎంత అమాయకంగా రాసాడు?!"...

* * *

మూడో నాటి సాయంత్రానికల్లా అనుకున్నట్టుగానే న్యాయ నిర్ణేతలు ఫలితాలతో సహా ఆఫీసు కొచ్చారు. బహుమతులు పొందిన కథల జాబితాలో మూడో ది తాతయ్యలు కథ కావడం నన్ను సంతృప్తి పరిచింది. ఈసారి మొదటి, రెండు బహుమతులూ ప్రఖ్యాత రచయితలకే దక్కాయి వాళ్ళు ముగ్గురూ నన్నుకూడా ఓసారి కథలు చదివి బహుమతుల వరసలో మార్పులు అవసరమైతే చెయ్యమన్నారు. కానీ ఆ విషయంలో జోక్యం కలిగించుకోడం నా కిష్టంలేదు. జడ్జిమెంట్ వీలైనంత నిక్కచ్చిగా ఉండాలనే అభిప్రాయంతో నే సమర్థులు, ప్రలోభాలకు లొంగని వాళ్ళు అని భావించి వాళ్ళముగ్గుర్ని పిల్చి లాడ్జిలో కూర్చోబెట్టి మూడ్రోజులపాటు అదేపనిగా చదివించి మరీ న్యాయ నిర్ణయం చేయించాను

శశిభూషణ్ రచయిత కాదు నా కాలేజీలో క్లాస్ మేట్. నేను కథలు రాసే రోజుల్నుంచీ పత్రికలు చదువుతూ బాగోగులు చక్కగా విమర్శించేవాడు ప్రస్తుతం విశాఖలో లాయర్‌గా ఉంటున్నాడు. రచయితలైతే రాగద్వేషాలకు అవకాశముంటుందని, అందరూ వాళ్ళే కాకుండా ఒక న్యాయ నిర్ణేతగా శశిభూషణ్‌ని ఎన్నుకున్నాను. రెండో వ్యక్తి పార్థసారథి స్కూలు మాష్టరుగా పన్చేసి రిటైరయ్యారు ఆంధ్రదేశంలో ఉన్న అద్భుతమైన కథకులలో ఒకడు కానీ ఆయన రాసిన అన్ని కథలూ లెక్క పెడితే ముప్పైదాటవు. ఈ రోజుల్లో నిజంగా ఆయన వ్యాపారం చేయదల్చుకుంటే ఏ పత్రికకు రచన పంపినా, ఏ ప్రచురణ కర్తను పుస్తకం వేయమని అడిగినా ఎవరూ కాదనరు. కానీ, కథ రాయాల్సిన అగత్యం వస్తే తప్ప కథ రాయకూడదనే సిద్ధాంతం ఆయనది అయినప్పటికీ ఈతరం రచయితలను వదలకుండా చదవడం ఆయన ప్రత్యేకత.

మూడో అతను శరత్‌బాబు విజయవాడలోని కాలేజి లెక్చరర్‌గా పని చేస్తున్నాడు. వయస్సు మూడు పదులు దాటక పోయినా, రాసిన నవలల సంఖ్య దానికి చేరుతుంది. వారపత్రికల్లో పుంఖాను పుంఖాలుగా సీరియల్స్ రాస్తూ అభిమాన పాఠకలోకాన్ని ఉర్రూత లూగిస్తున్న ప్రఖ్యాత రచయిత

ఇంత వైవిధ్యం ఉన్న వ్యక్తులను న్యాయ నిర్ణేతలుగా ఎంపిక చేసిన తర్వాత తిరిగి నేను చదవడం అవసరమని పించలేదు

'ఈ మూడు రోజులూ యింతకంటే జైలే నయమనిపిస్తుంది మీకు. అక్కడింత మెంటల్ స్ట్రెయిన్‌వుండదు- సారీ ఫర్‌ది ట్రబుల్"- అన్నాను'టీ' సిప్ చేస్తున్న జడ్జెస్‌ను ఉద్దేశించి

"మాకీ జైలు జీవితం థ్రిల్లింగ్‌గానే వుంది మీలా యావజ్జీవ ఖైదీలం కాదుగా మరి?" శశిభూషణ్ జోక్ పేలింది.

"మాస్టారూ, ఎలా వుంది స్టాండర్డ్ ?" ఫలితాల గురించి ముందు మాటలో ఆ విషయం ప్రస్తావించాలని అడిగాను

"బావుంది యువతరం మంచి కథలు రాస్తున్నారు. నాకయితే - నేను కథలు రాయడం మానేసి మంచి పని చేసాననిపిస్తుంది ఈ తరం తీసుకుంటున్న వస్తువులూ, శిల్పం చూస్తుంటే మన తరం యిప్పుడు పోటీ పడలేమని పిస్తోంది". పార్థ సారథిగారు నిర్మొహమాటంగా చెప్పారు

"అయ్యా, మాస్టారి అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తున్నాను అయితే నాది చిన్న సలహా పోటీలో దాదాపు మూడోవంతు రచయిత్రులున్నారు వాళ్ళలో ఎవరికీ ప్రైజు రాలేదు కనుక ఆ కథల్లో మంచి కథకు ఓ కన్సొలేషన్ ప్రకటిస్తే బావుంటుంది"

"అవసరం లేదు శశి భూషణ్ గారూ, వాళ్ళంతా ఎలాగూ రచయిత్రులు కాదు ఈనాడు "బృహన్న వలలు" రాసేస్తున్న రచయిత్రులలో సగం మంది 'బృహన్నల'లే- మీకు తెలుసా?" శరత్‌బాబు శశిభూషణ్ గారి ప్రతిపాదనకు అంగీకరించలేదు

"శశిభూషణ్ గారూ, ఆడ, మగా? ప్రఖ్యాతులా- వర్ధిష్ణువులా? అనే విచారణ మనకొద్దు. రిజర్వేషన్లు నాకిష్టం వుండదు ఎవ్వరాశారన్నది కాదు- ఎలా రాశారన్నదే మనకు ముఖ్యం. అందు వల్ల కన్సొలేషన్ల ప్రసక్తి పెట్టుకోవద్దు. ఎలాగూ మంచి కథలు ప్రచురణకు తీసుకుంటున్నాంగా? ఏమంటారు?" నా అభిప్రాయాన్ని ముగ్గురూ ఆమోదించారు మానసను పిల్చి బహుమతులు పొందిన రచయితలకు టెలిగ్రాంలు ఇమ్మన్నాను

★ ★ ★ ★ ★

టెలిగ్రాం లిచ్చిన వారం రోజులకు అందరి పరిచయాలు అందాయి- తాతయ్యలు నుంచి తప్ప. బహుశా ఫోటో తీయించుకోడాన్కి డబ్బు లేక ఆలస్యమయిందేమో అనుకున్నా. ఆ రోజు పోస్టుకూడా చూసి అందక పోతే తర్వాత సంచికలో అతని పరిచయం వేద్దామని మానసతో చెప్పేశాను ఇంతలో ఆరోజు పోస్టులో వచ్చిన ఓ ఉత్తరం చూసి నేను షాక్ తిన్నాను అనుమానం చాలక మళ్ళీ

మళ్ళీ చదివాను–

తెలుగు వెలుగు వారపత్రిక సంపాదకులకు

నమస్కారం

ఇటీవల నేను ఓ ప్రముఖ ఇంగ్లీష్ పత్రికలో "ది స్కేప్ గోట్' అనే కథ చదివాను ఆ కథ సారాంశం ఇది –

ఓ యాభై ఏళ్ళు పైబడిన రాజకీయ నాయకుడికి సెక్స్ సంబంధమైన పెర్వర్షన్ వుంటుంది. అతగాడికి రేపో మాపో రజస్వల కాబోయే ఆడపిల్లననుభవించడం సరదా అతని అధి కారానికీ, పలుకుబడికీ దాసోహం చేసే మరో ఛోటానాయకుడు ఓ ట్రావెలర్స్ బంగాళాలో అతనికి అలాంటి వచ్చీరాని వయసున్న 'శారిక' అనే అమ్మాయిని సమర్పిస్తాడు. అతనికి థ్రిల్ కలిగించే ఆ రాక్షస రతిలో ఆ ఏడీ ఏడని మొగ్గ నలిగిపోయి చనిపోతుంది ఆ తర్వాత ఆ పిల్ల అతని అక్రమ సంతానమేననే నిజం బయట పడుతుంది. . ఇందులో సంఘటన హృదయాన్ని కదిలించేదిగా ఉంది. మీరు సూత్ర ప్రాయంగా ఈ కథ నామోదిస్తే అనువదించి పంపిస్తాను ఈ కథ తాలూకు పారితోషికం కూడా నాకవసరం లేదు. ఆ మొత్తాన్ని ఏ 'శారిక' కన్న తల్లి లాంటి నిర్భాగ్యురాలికో పంపించండి ... మీ జాబు కోసం ఎదురు చూస్తుంటాను.

ఇట్లు

నారాయణరావు

అతని ఉత్తరం మీద ఎడ్రస్సూ , కవరు మీద స్టాంపూ, రెండూ చూసాను. సందేహం లేదు ఆ ఉత్తరం విశాఖ నుంచే వచ్చింది. నారాయణరావు ఓ ప్రభుత్వ కార్యాలయంలో ఎల్డీసిగా పనిచేస్తున్నాడు.

అతని ఎడ్రస్ని, ఉత్తరాన్ని అంతగా పట్టించుకోడానికి కారణం– అతను రాసిన ఇతివృత్తమే 'కంచి మేక' కథ!! అయితే తాతయ్యలు. ..? సందేహం లేదు నేననుకున్నట్టు నిజాయితీ పరుడూ, అమాయకుడు కాదు దగాకోరు! దొంగ– అతను రాసినట్టు అతను పేపర్‌బాయ్ అయిఉండడు. అది కూడా నా సానుభూతి పొందడానికి చేసిన కల్పనే. అయినా అనుమానం చాలక మానసను పిల్చి నారాయణరావు ఉత్తరం ఇచ్చి చదవమన్నాను. ఉత్తరం చదివిన మానస మొహంలో నెత్తురు చుక్క లేదు.

"ఈ కథా, మనం బహుమతి ఇచ్చిన 'కంచిమేక' కథా ఒకటే సార్ ఆ తాతయ్యలు ఒట్టి 'చీట్'లా ఉన్నాడు"

"ఇంకా నయం సంచిక ప్రింట్ కాకుండా ఈ నారాయణరావెవరో దేవుడ్లా రక్షించాడు ఇప్పుడేం చేద్దాం? మళ్ళీ జడ్జెస్‌ను పిలిచే టైం కూడా లేదు".

"సాధారణ ప్రచురణకు స్వీకరించిన కథల జాబితా వుంది కదాసార్ దానిలో మొదటి కథకు బహుమతిస్తే సరిపోతుంది కదా"

"ఆ మొదటి కథ ఎవరిదో చూడు".

"సగం చెక్కిన రాతి రథం' అనే కథ. విజయనగరం నుంచి మాధవి అనే ఆవిడ పంపించింది సార్" రచయిత్రులకు కూడా ఓ ప్రైజ్ యిస్తే బావుంటుందనే శశిభూషణ్ గారి కోరిక కూడా తీరుతోంది!

సరే, ఆ రోగ్‌కి ప్రైజ్ కాన్సిల్ చేస్తున్నట్టు, మాధవి గారికి ప్రైజ్ ఇచ్చినట్టు వెంటనే టెలిగ్రాంలు పంపించు. ఫోన్ చేసి 'హరి' గార్ని పిల్చి వెంటనే ఆ రాతిరథం కథకు ఇలస్ట్రేషన్ వేయించు తాతయ్యలుకు టెలిగ్రాంను కన్‌ఫర్మ్ చేస్తూ ఓ ఉత్తరం కూడా రాసి పడెయ్".

"అలాగే సార్" నా కోపాన్ని చూసి వీలైనంత నిర్లిప్తంగా, క్లుప్తంగా మాట్లాడుతోంది మానస

"రచయితల్లో కూడా ఎంత వంచకులున్నారు!" నా మొహం కోపంతో ఎరుపెక్కింది

★ ★ ★ ★ ★

"..... ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపవద్దంటే మనుష్యుల్ని రమ్మనమని అర్థమా? అయినా ఇంత సేపటి నుంచి చూస్తున్నా ఆ అబ్బాయి మాట్లాడటం లేదు అతని తరఫున మీరు వకాల్తా తీసుకున్నారా?" తాతయ్యలను వెంట పెట్టుకొని వచ్చిన శాయిని చెడామడా తిట్టాను

"హీ యీజ్ టూ యంగ్ మీలాంటి పెద్దలతో ఇలాంటి విషయాలు ఎలా మాట్లాడాలో



# పురోమార్గం

దినకరుడస్తమిస్తున్నాడు
ఇకతిమిరతతి ఆవరిస్తుంది
అయినా కాలగమనం
అర్ధక్షణమైనా ఆగదు కదా!
కరుణాన్వితశీతల చంద్రికాదృక్కులు
దయతో ప్రసరించి
పురోమార్గాన్ని ప్రస్ఫుట మొనర్చు
ప్రభూ!

— గోవిందరాజు రామకృష్ణారావు

## పోటీ కథ

తెలియక'... " నీళ్లు నములుతున్నాడు వటపత్రశాయి. వటపత్రశాయి కాస్త కూస్త పేరున్న కథకుడు. నాకు పరిచితుడు అతనేది కూడా తాతయ్యలు ఊరే కావడంతో అతన్ని తీసుకొని వచ్చాడు. తాతయ్యలు వయస్సు ఇరవై లోపు. మొహం చూస్తే టార్చ్‌లైట్ వేసి వెదికినా తెలివి తేటలున్న జాడ కనిపించడం లేదు. చదువు సంస్కారం ఉన్న వాడిలా కూడా లేడు. నేను శాయిని వివాట్లు పెడుతుంటే తనకు సంబంధించనట్లు దిక్కులు చూస్తున్నాడు తాతయ్యలు

"తాతకు దగ్గులు నేర్పినట్లు నాముందా ఇలాంటి కబుర్లు. ఇంకెవరికైనా చెప్పండి నమ్ముతారు కథలు రాయగలిగిన వాడు మాట్లాడలేడంటే నేన్నమ్మను. ఈ అబ్బాయి మొహం చూస్తే కథలు రాసేలాలేడు. అసలు ఈ 'కంచి మేక' కథే ఇతను రాసి ఉండడు. మీకు రెండు మూడు పేర్లతో రాయడం ఇదివరకే అలవాటు. ఈ కథ కూడా మీరే రాసి ఈ అబ్బాయి పేరు పెట్టుంటారు. ఇదేదో బినామీ లావాదేవీ.. . " ఒక అభి యోగం తేల్చడానికొస్తే శాయి మీద మరో అభియోగం మోపడంతో అతని మొహం వివర్ణమయింది.

"మీరు అలా అంటే నేను మాట్లాడలేను సార్, ఇతనికి ఎవరూ తెలియక పోవడం వల్ల నన్ను తీసుకొచ్చాడు".

"ఇంకా మాయ మాటలు చెప్పకండి. కథ పోస్టు చెయ్యడానికి డబ్బు లేదని రాసిన వాడికి మిమ్మల్ని అంతదూరం నుంచి తీసుకు రావడానికి డబ్బెలా వచ్చింది?"

"అది..... అది..... " గొంతు పెగలడం లేదు తాతయ్యలుకి.

"ఏ అమ్మ పుస్తలో తాకట్టు పెట్టానని కూడా చెపుతావు నాయనా– నువ్వు దేనికయినా సమర్థుడివి. అంతగా కాగితాలు నలుపు చేయాలని దురదే వుంటే కథలే రాయాలా? రామకోటో, పత్రికలకు ఉత్తరాలో రాసుకోకూడదూ? కాపీ కథవ్రాసి, లక్షలలో వ్యాపారం చేసే మా పత్రిక పరువు ప్రతిష్ఠలతో ఆటలాడతావా? నీకసలు అక్షరాలు కూడా వచ్చా అని నా అనుమానం..... " ఈ వ్యవహారంతో విసిగిపోయి ఉన్న నేను కుర్రాడి మీద విరుచుకు పడ్డాను.

'ఎడిటర్ గారూ– నన్ను నమ్మండి. మీరన్నట్లు ఈ అబ్బాయికి పెద్దగా చదువు రాని మాట నిజమే. అసలు ఆ విషయం చెప్పుకోవాలనే ఇక్కడకు వచ్చింది కూడా. మీ ఉత్తరంలో ఇతని కథ ఓ, ప్రముఖ ఇంగ్లీషుకథకు కాపీ అని రాసారు. కానీ ఇతను చదివింది ఏడో తరగతి మాత్రమే. ఇతనికి ఇంగ్లీషు సరిగా రాదు". నాకు నచ్చజెప్పడాన్కి ప్రయత్నిస్తున్నాడు శాయి.

"అతనికి రాకపోతే మీరే చదివి చెప్పుంటారు".

"మీరా ఇంగ్లీషు కథ చదివారా?" ధైర్యాన్ని కూడ దీసుకొని శాయి అడిగాడు. నా గొంతులో పచ్చి వెలక్కాయ పడింది. నేను చదివే వ్యవధిలేదు. శాయిని దబాయించడం తప్ప నాకు గత్యంతరం కనిపించలేదు.

"మీ యక్ష ప్రశ్నలన్నిటికీ జవాబు చెప్పాల్సిన అవసరం మాకు లేదు అయినా ఇంతదూరం శ్రమపడి వచ్చారు కనుక మర్యాద కోసం చెప్తున్నా. ఈ ఉత్తరం చూడండి మీకు తెలుస్తుంది". అంటూ పేపరు వెయిట్ కింద నుంచి నారాయణరావు రాసిన ఉత్తరాన్ని తీసి శాయి మీదికి విసిరాను.

ఉత్తరం చదవగానే ఇద్దరూ నిశ్చేష్టులయ్యారు.

కొంత సేపటికి తేరుకొని శాయి నాకు నచ్చ చెప్పడం ప్రారంభించాడు.

"ఈ ఉత్తరాన్ని చదివిన వాళ్లెవరూ ఈ అబ్బాయి కథ కాపీ కథ కాదనలేరు కానీ దయచేసి నా ఆర్గ్యుమెంట్ కూడా వినండి. కేవలం ఉత్తరాన్నే ఆధారం చేసుకొని ఇది కాపీకథ అని నిర్ణయించడం సబబుకాదు మీరు నారాయణరావుగారికి రాసి ఆ కథ తెప్పించి రెండూ చదివి అపుడు మీ నిర్ణయం ప్రకటించండి."

"శాయిగారూ – అనవసరంగా నన్ను విసిగించకండి. బోడి అయిదు వందల రూపాయల మొత్తానికి ఎవరో మోసం ఎందుకు చేస్తారు? ఈ కుర్రాడికి ప్రైజ్ రాకపోతే వాళ్ళ కొచ్చే లాభం ఏమిటి? పోనీ పోటీకి కథలు పంపించిన వారిలో ఈ నారాయణరావు లేడు. సంబంధం నిశ్చయమైన తర్వాత పెళ్లి కూతురు మంచిది కాదని ఆకాశరామన్న ఉత్తరం వచ్చిందనుకోండి –– వెంటనే ఆ సంబంధం కాన్సిల్ చేస్కుంటాం కానీ పిల్ల మంచిదా కాదా అని విచారిస్తూ కూచుంటామా లక్షల మీద వ్యాపారం చేసే పత్రిక విషయం కూడా అంతే. నిజానికి మేం బహుమతి ఇవ్వాలనుకున్న కథకు అది రాకపోతే మాకంటే దుఃఖ పడేవాళ్ళు ఎవరూ ఉండరు. ఇక వెళ్ళండి.... నమస్కారం". ఇక వదిలేలాలేరని అక్కడ్నుంచి విసురుగా లేచి బయటకు వచ్చాను.

శాయి తాతయ్యలు కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయారు.

★ ★ ★ ★ ★

"కేవలం ఉత్తరాన్నే ఆధారం చేసుకొని ఇది కాపీకథ అని నిర్ణయించడం సబబు కాదు..... " శాయి మాటలు నా చెవుల్లో గింగురుమంటున్నాయి. కానీ నారాయణరావు ఉత్తరం తాలూకు నిజానిజాలను ఆరా తీసే వ్యవధి లేదు. నారాయణరావుకి కథను అనువదించి పంపించమని ఉత్తరం రాసి ప్రత్యేకసంచిక సరుకూ సప్పరాలో మునిగి పోయాను.

ప్రత్యేక సంచిక విడుదలైన తర్వాత యథా ప్రకారం బహుమతి పొందిన కథల్ని మెచ్చుకుంటూ అనేక ఉత్తరాలు వచ్చాయి. వాట్లో నారాయణరావు ఉత్తరం కూడా ఒకటి. కానీ నారాయణరావు నుంచి ఆ కథ మాత్రం అందలేదు. మళ్లీ ఉత్తరం రాసాను. ఈసారి ఆ ఇంగ్లీషు పత్రిక పేరు, సంచిక తెలియ చేయమన్నాను. అయినా సమాధానం రాకపోవడంతో టెలిగ్రాం కూడా ఇప్పించాను. కానీ ఫలితం లేక పోయింది.

నారాయణరావు సంగతి తేల్చాలనే పట్టుదల నాలో పెరిగింది. మానస యూనివర్సిటీ విద్యార్థి విద్యార్థులను ఇంటర్వ్యూ చేయడానికి విశాఖ వెళుతుంటే నారాయణరావు ఎడ్రస్ ఇచ్చి అతని విషయం కనుక్కుని రమ్మని మరీ మరీ చెప్పాను. మానస తిరిగి వచ్చి నాకు చెప్పిన వార్త అందోళన కలిగించింది.

అతనిచ్చిన ఎడ్రస్‌లో నారాయణరావు అనే వ్యక్తి లేనే లేడట! అయితే మరి నారాయణరావు రాసిన ఉత్తరం?! నా అనుమానం దృఢపడినా ఎందు కయినా మంచిదని ఇంగ్లీషు పత్రికలను బాగా చదివే అలవాటున్న మిత్రులను 'స్కేప్ గోట్' కథ గురించి అడిగాను. అటువంటి పేరు గాని, యితివృత్తం గాని గల కథ యిటీవల కాలంలో ప్రచురితం కాలేదని వాళ్ళు చెప్పారు!

జరిగిన మోసం తీలగా నాకు అర్ధమైంది. అయినా తాతయ్యలుకు ఉత్తరం రాసి ఆ విషయం తవ్వడానికి నా అహం అంగీకరించలేదు.

'మీ కథ 'కంచి మేక' ప్రచురణకు స్వీకరించామని తెలియ జెయ్యడానికి సంతోషిస్తున్నాం. కథ వీలువెంట ప్రచురిస్తాం ' అనే కార్డు మాత్రం తాతయ్యలుకు పోస్టు చేయించాను

★ ★ ★ ★ ★

రెండు నెలలు గడిచాయి. దాదాపు తాతయ్యలు విషయం మర్చిపోయాను ఆరోజు ఓ సాహిత్య సభలో పాల్గొనడానికి రాజమండ్రి వెళ్ళాల్సొచ్చింది. ఆ సభలో శాయి ఒక ఉపన్యాసకుడు–

సభ అయిపోయిం తర్వాత శాయి ఏదైనా మాట్లాడతాడేమో నని చూశాను చివరకు నేనే అతన్ని కదిలించాను.

"ఆ తాతయ్యలు కథ తాలూకు నిజం మీకేమయినా తెలిసిందా. ఆ నారాయణ రావు పేరుతో వచ్చిన ఉత్తరం అబద్ధంలా వుంది. ఆరా తీస్తే అటువంటి ఇంగ్లీషు కథ ఏదీ లేదని తేలింది. ఇంటి ఎడ్రస్‌లో గానీ, ఆఫీస్‌లో గానీ ఆ నారాయణరావు పేరు గలిగిన వాడు లేనే లేడట' నిజాన్ని వీలైనంత నిజాయితీగా ఒప్పేసుకున్నాను.

"ఇప్పటి కైనా మీ కొంత నిజం తెలిసినందుకు

## పోటీ కథ

సంతోషం మీకు తెలియని కథ నేను చెప్తాను తాతయ్యలు లాంటి ఓ పేపరు బాయ్‌కి బహుమతి రావడం మావూళ్లో చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది. మీరిచ్చిన టెలిగ్రాం చూపిస్తేనే కానీ ఆ నిజాన్ని నేను కూడా నమ్మ లేక పోయాను నా లాగే అయిదారేళ్ల నుంచి కథల్రాస్తూ బహుమతులకు కాదు కదా ప్రచురణకు కూడా నోచుకోని మా సహరచయితలు ఆ కుర్రాడి అదృష్టానికి అసూయ పడ్డారు అలాంటి రచయితల్లో నిరంజన్ ఒకడు

నిరంజన్ మావయ్య ఓ ఎడ్వకేటు మీకు స్నేహితుడట. ఆయన బెజవాడ నుంచి తిరిగి వస్తూ రాజమండ్రిలో దిగారట నిరంజన్ కాగితాలు నలుపు చేస్తుంటాడని తెలిసిన వాళ్ళ మావయ్య తను తెలుగు వెలుగు' కథల పోటీకి న్యాయ నిర్ణేతగా వెళ్ళిన విషయం కాకతాళీయంగా చెప్పడం జరిగింది.

ఆ కథా వస్తువుల గురించి కూడా చెప్పి "అన్నట్టు ఆ మూడో బహుమతి వచ్చిన అబ్బాయిది మీ వూరే' అనడంతో నిరంజన్‌కి అసహనం పెరిగింది. మావయ్య దగ్గర తెలుసుకున్న కథ అధారంగా నారాయణరావు పేరుతో ఉత్తరం సృష్టించి అది మీ కనుమానం రాకుండా విశాఖలో పోస్టు చేయించాడు"–

"నిజమా – నాకు శశిభూషణ్ అనే లాయర్ మిత్రులు కావడం. అతను ఈ కథల పోటీకి న్యాయ నిర్ణేతగా ఉండడం అంతా నిజమే. కానీ .. శశిభూషణ్ అన్యాయానికి తల ఒగ్గేమనిషి కాదు".

"మీరు చెప్పింది కాదనను శశిభూషణ్ అన్యాయం చేశారని ఎవరన్నారు? ఆయనకు తెలీకుండానే ఆయన చెప్పిన కథ అధారంగా ఈ పథకం వేసింది నిరంజన్ "అతనికి మావూళ్లో తనకంటే కుర్రాడికి పేరొస్తుందనే దుగ్ధ.. రెండో గీతను చెరిపి చిన్నదిగా చేసి తాను పెద్ద గీతగా నిరూపించుకోవాలనే ఎదగలేని నిరంజన్ ఇంత పని చేశాడు.

"రచయితల్లో కూడా ఇంత దగుల్బాజీలుంటారా–? నేనసలు పోటీని పోటీగా స్వీకరించలేని ఇలాంటి వాళ్ళుంటారని పోటీ కథలు వద్దన్నాను. కానీ మా మేనేజ్‌మెంట్ బలవంతం మీద నిర్వహించక తప్పలేదు. సారీ.... నేను మిమ్మల్ని కూడా నొప్పించాను. మరి ఆఫీసుకొచ్చి నప్పుడు మీరీ విషయం నాకెందుకు చెప్పలేదు?"

"అప్పటికి మాకు తెలియదు. మేం మీ ఆఫీసు నుంచి తిరిగి వెళ్ళిం తర్వాత ఊళ్లో వాళ్ళంతా తాతయ్యలను రకరకాలుగా గేలి చేశారు. తనకు రాని బహుమతి నువ్వు పొందటం చూసి ఓర్వలేక మీ శాయి గారే ఉత్తరం రాశారని కూడా అతనికి కొందరు చెప్పారట. చివరకు తాగుబోతు నిరంజన్ తాతయ్యలకు ప్రైజ్ కాన్సిల్ చేసిన సంధర్భంగా మిత్రులకు మందు పార్టీ ఏర్పాటు చేసి మైకంలో నిజం చెబితే నాకు తెలిసింది "

"సారీ .. అతని కథ ప్రచురిస్తున్నట్టు ఉత్తరం పంపించాను ఇక ముందు కూడా ప్రోత్సహిస్తాను. అతనితో చెప్పండి

కుర్రాడు మంచి స్పార్క్ ఉన్నవాడు. బాగా పైకి వచ్చే అవకాశం వుంద అతనేం చేస్తున్నాడు?!"

"బాగా పైకి వెళ్ళిపోయాడ్సార్" శాయి కళ్ళు కన్నీటితో నిండిపోయాయి.

'యూమీన్"?!

"అమ్మాయిల్ని కర్షించడానికి రచయిత అవతారం ఎత్తిన అర్భకుడు బయట పడి పోయాడ'ని అసూయ పరులు చేసిన హేళనలని తట్టుకో లేక అభిమానం అడ్డొచ్చి ఆత్మహత్య చేసుకున్నాడు".

"ఇంత చిన్న విషయానికి ?!! నేన్నమ్మను"

"కథలు చదవడానికి అలవాటు పడి పోయిన మీరు నిజాన్ని నమ్మలేక పోతే అది నిజం తప్పుకాదు. మీ కార్డును తాతయ్యలు తల్లి తీసుకొచ్చి నాకు చూపించింది. మాకు ఏమైనా డబ్బొస్తుందా అని అమాయకంగా అడిగింది. మీ కార్డు అతని ఆత్మకు శాంతిని ప్రసాదించాలి– అంతే" శాయి కంఠం గాద్గదికమయింది.

"వెరీ సారీ " చెమ్మగిల్లిన నా కళ్ళముందు ..... నీటి పొరల్లోంచి.... నవ్వుతున్న అమాయకమైన, అందవికారమైన తాతయ్యలు!! □

# బైద్యనాథ్ ...............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగసౌఖ్యములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు
ఆనందముగా ఉండుటకు
శ్రద్ధ తీసుకుంటారు.

మీకు శక్తిని, బలమును కలుగచేసి
రోజు రోజుకు సంవత్సరముల తరబడి
విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషధము.



## బైద్యనాథ్ విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు
చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి
మంచి రక్తశుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా
ఉంచును,






## బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.



## బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ్ స్పెషల్

కుటుంబాని కంతటికీ
ఉత్తమమైన ఆయుర్వేద టానిక్

B J P/102 T

# దాదాజీ విమలారామం

సంధ్య రాగరంజిత మయింది.

గూళ్ళకి తిరిగిపోయే పక్షులు చిన్నపాట కచ్చేరీ పెడుతున్నాయి మెల్ల మెల్లగా కదలి వచ్చే పిల్లగాలి గిలిగింతలు పెడుతోంది

పిల్లలు కేరింతలు కొడుతున్నారు. యువ జంటలు పరిహాసాల చిరుహాసాల మురిపాలలో తేలియాడుతున్నారు.

వయసు మళ్ళిన వాళ్ళకి కొంచెం వయస్సు వెనక్కి మళ్ళించేటంత మనోహరంగా వుంది పార్కులోని వాతావరణం'

లక్ష్మీనారాయణగారు పార్కులోకి వచ్చి అప్పుడే అరగంటయింది అరగంట నుంచీ ఉండుండి ఆయన గేటు వైపు చూస్తూనే ఉన్నాడు.. రంజని వస్తుందేమోనని!

రంజని వచ్చే వేళ ఇంకా కాలేదు రంజని రోజూ ఒకే వేళకు వస్తుంది తను రంజని కంటె చాలా ముందు వచ్చి కూర్చున్నాడు ఆమె కోసం అలా యెదురు చూడటంలో ఆయనకేదో అవ్యక్తమయిన ఆనందం ఉంది!

రంజనితో పరిచయమయి ఆరు నెలలు అయిందేమో! అంతే ఎన్నో ఏళ్ళ నుంచి ఉన్న బంధాలన్నిటినీ మరిపించేటంత అనుబంధం ఆమెతో ఏర్పడిపోయింది

ఒక్కోసారి లక్ష్మీనారాయణ గారికి దేవుడెంత గమ్మత్తయిన పనులు చేస్తుంటాడు – అని అనిపిస్తూంటుంది! మనస్సు కెంతో దగ్గరయిన వాళ్ళను ఇట్టే దూరం చేస్తుంటాడు మనస్సులో పెట్టుకుని ఆదరించవల్సిన వాళ్ళు ఎంత దగ్గరగా వున్నా ఎంతో దూరమయి పోయినట్టు అనిపించేలా చేస్తుంటాడు. ఈ జీవితం యింక ఒంటరితనంతో కడతేరిపోతుందేమో – అని దిగులు పడుతున్న సమయంలో ఎక్కడి నుంచో ఎవర్నో తెచ్చి తన మనస్సులో పీఠం వేసుక్కూర్చోమంటుంటాడు' తనతో పరిహాస మాడటం ఆ భగవంతుడికి వేడుక యేమో!

లక్ష్మీనారాయణ గారు సర్వీసులో ఉండగా ఎప్పుడూ బిజీగా ఉండే వాడు ఆఫీసులో అనేకమందికి పనులు వెతుక్కోవటంతోనే సరిపోయేది – కాని, ఆయన కోసం పనులు ఎప్పుడూ సిద్ధంగా కూర్చునేవి. చాలా మందికి ఆఫీసుకి వచ్చింది లగాయితు గడియారాల వైపు చూస్తూ – ఎప్పుడు ఆఫీసు టైము అయిపోతుందా అని ఎదురు చూడ్డం తోటే గడిచిపోయేది. కాని, ఆయనకి మాత్రం – అంతా వెళ్ళిపోయాక ఆఫీసులో నిశ్శబ్దమైపోతే ' – 'అరే, అప్పుడే టయిమై పోయిందా' అని అనిపించేది.

ఆయన చాల క్రమశిక్షణలో పెరిగిన మనిషి. ఎవరు మారినా ఎవరు మారకపోయినా – తను మాత్రం తను నమ్మిన పంథా నుంచి ఒక్క మిల్లీ మీటరు పక్కకు జరిగి ఎరుగడు. ఆఫీసు వేళలో ఆఫీసుకే అంకితమయి పోవాలని తుచ తప్పకుండా నమ్మిన మనిషి – ఆచరించి చూపించిన మనిషి!

చెప్పాలంటే – చాలా మందితో పోలిస్తే – ఆఫీసు పనుల వత్తిడి వల్ల – తన స్వవిషయాలు చాలా వాటిని చాలా కాలం ఆయన వాయిదా వేసుకుంటూ వచ్చాడు.

ఆయనకి సాహిత్యాభిలాష మెండు ఇంట్లో బోల్డన్ని పుస్తకాలున్నాయి. ఎప్పుడో వావిళ్ళ వారు ప్రచురించిన పురాతన గ్రంథాలు మొదలుకొని ఇటీవల ఎమెస్కో వారు ప్రచురించిన ప్రబంధాల వరకూ ఆయన దగ్గర ఎన్నో పుస్తకాలు ఉన్నాయి. పాత పుస్తకాలు బాగు చేసి వాటిని స్వయంగా బైండు చేసాడు అది మంచి వయస్సులో ఉన్నప్పటి సంగతి ఆ రోజుల్లో సరదాయే కాకుండ చదవటానికి సమయమూ ఉండేది కాని, తర్వాత్తర్వాత పిల్లలు పెద్ద వాళ్ళవటంతో, ఆఫీసు బాధ్యతలు పెరగటంతో ఇక తీరలేదు అడపాతడపా కొనే పుస్తకాలకి కాగితం అట్టలు మాత్రం వేసి వుంచేవాడు .. కొంచెం ఈ బాధ్యతలు భారం తగ్గాక ఈ పుస్తకాలన్నిటినీ కేటలాగ్ చేసి ఇంట్లో చక్కని లైబ్రరీ ఒకటి తయారు చేయాలని ఆయన సంకల్పం ఆ తర్వాత ఒక్కొక్కటే తీసుకొని తీరిగ్గా చదువుకోవాలని కోరిక ఇది సర్వీసులో ఉండగా తీరదని త్వరలోనే ఆయనకి తెల్సిపోయింది రిటయిరయినాక తను చేద్దామనుకుంటూ వాయిదా వేసిన పనులలో ఇదొకటి!

తనకు కాశీ యాత్ర చేయాలని వుండేది. 'గంగలో స్నానం చేద్దామండీ' అనేది భార్య. 'కాశీయే కాదు ప్రయాగ యాత్ర చేద్దాం. త్రివేణీ సంగమంలో స్నానం చేద్దాం' అన్నాడు తను తిరుపతి రాజు కన్యాకుమారి వెళ్ళి అక్కడి సూర్యోదయ సౌందర్యాన్ని వర్ణించి చెప్పాక అది తప్పక చూడాలనిపించింది 'శంకరా భరణం' సినిమాలో మంజుభార్గవి నృత్యం చేసిన చోటు – బేలూరులో చెన్నకేశవస్వామి గుడిలోదని ఎవరో చెప్పారు. బేలూరు వెళ్ళి ఆ శిల్పకళను కనులారా విందు చేసుకోవాలనిపించింది. ఊటీ వెళ్ళి వచ్చిన శేషాచలం నీలగిరుల చక్కదనాన్ని రోజుల తరబడీ వర్ణించాడు. ఊటీకి వెళ్ళలేక పోయినా దగ్గరున్న అరకులోయకయినా తప్పకుండా వెళ్ళాలనుకున్నాడు లక్ష్మీనారాయణగారు. ఈ యాత్రలు, విహారాలు ఆయనకు సర్వీసులో ఉండగా వీలుపడలేదు. ఆర్థికమయిన చిక్కులే కాదు, ఆఫీసు పనులు – ఇంటి పనులూ ఏవో ఒకటి ఆటంకం తెచ్చేవి. 'తర్వాత వెడదాం' అని అనుకునేవాడు. ఆ 'తరువాత' రిటయిరుమెంటు తేదీని కూడా దాటి వెళ్ళిపోయింది!

'ఇన్నాళ్ళుగా చేయలేకపోయిన పనులన్నీ చేపట్టాలి' అని అనుకుంటుండగా హఠాత్తుగా భార్య జబ్బు పడింది. భార్య వెంట లేకుండా ఆయన చుట్టాలింట్లో పెళ్ళి క్కూడా వెళ్ళి ఎరుగడు – అటువంటిది తీర్థయాత్రలు చేయటం కూడానా!

రిటయిరయి ఏడాది కావస్తోంది భార్య ఆరోగ్యం ఏమాత్రమూ బాగుపడలేదు యాత్రల మాట దేవుడెరుగు. కనీసం, ఇంట్లో లైబ్రరీ పెట్టుకుందామనుకున్న పనికి శ్రీకారం చుట్టటం కూడ కాలేదు పట్టుమని పది పుస్తకాలు చదవటమూ జరగలేదు 'ఇంత కాలం కాయ శరీరంతో చకచకా యింట్లో తిరిగే మనిషి – ఒక్కసారిగా యిలా మంచాన పడిపోయిందేమిటి?' అని భార్య గురించి దిగులుతోనే ఆయనకి రోజులు వెళ్ళిపోయాయి

భార్య పరిస్థితి విషమించింది 'వద్దు శాంతా! నాకన్యాయం చేయకు' అని తను కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు 'ఈ అనారోగ్యంతో మిమ్మల్ని నిత్యం బాధ పెడుతున్నాను. నా వల్ల సుఖమేముంది?' అని తను బాధ పడింది 'అలాగనకు నీ వల్ల నాకెటువంటి బాధా లేదు. నా కోసం నువ్వు బ్రతకాలి, ఉద్యోగంలో ఉండగా నిన్నెక్కడికీ తీసుకొని వెళ్ళలేకపోయాను కొన్ని కొన్ని పనులు వయసులో ఉండగానే చేయాలి వాటిని వాయిదా వేయటం వల్ల ఎంత నష్టం వస్తుందో నా కిప్పుడు తెలుస్తోంది నా కోసం నువ్వు ఆరోగ్యవంతురాలివి కావాలి మనం యిద్దరం కల్సి అన్ని వూళ్ళూ చూసివద్దాం పెద్దవాడి దగ్గర కొన్నాళ్ళుందాం మరికొన్నాళ్ళు చిన్నాడి దగ్గరకి వెడదాం అమ్మాయి కూడా తన దగ్గరకి రమ్మని ఎన్నో సార్లు చెప్పింది దాని కోరిక కూడా తీర్చాలి. ఆ తర్వాత కాశీ, కన్యాకుమారి, బేలూరు. ఇంత కాలంగా వెళ్ళాలనుకున్న చోట్ల కల్లా వెడదాం అన్ని చోట్లకు నిన్ను తీసుకువెళ్ళి తిప్పి తీసుకు వస్తాను ఇప్పుడు డబ్బు కిబ్బంది లేదు గ్రాట్యుయిటీ వచ్చింది మన బాధ్యతల బరువు పిల్లలమీద పెట్టనక్కర్లేదు' అని ఎంతో యిదిగా చెప్పాడు

భార్య తన కోరిక తీర్చాలనుకుంది తనతో కల్సి తీర్థయాత్రలు చేయాలనుకుంది. ఆమె బ్రతకటానికి కేవలం ఆమె 'విల్ పవర్' సరిపోలేదు తన కోసం దేవుడితో చాలా పోరాడింది. కాని, లాభం లేకపోయింది చివరకి దేవుడే గెలిచాడు 'మీ చేతుల్లో పసుపు కుంకుమలతో వెళ్ళి పోతున్నాను నా అంత అదృష్టవంతురాలు లేదు' అంటూ తనని దురదృష్టవంతుడ్ని చేసి వెళ్ళిపోయింది శాంత.

ప్రతి మనిషికి జీవితంలో ఎన్నో అనుబంధాలు ఏర్పడుతుంటాయి. కొన్ని అనుబంధాలు ప్రాణ సమానమయిపోతాయి. లక్ష్మీనారాయణ గారికి ఉద్యోగం రావటమూ పెళ్ళి జరగటమూ దాదాపు ఒకేసారి జరిగాయి. ఉద్యోగంలో కొత్త, సంసారంలో కొత్త. కొత్తదయిన ప్రతి దాంట్లోనూ ఆకర్షణ వుంటుంది. ఆకర్షించిన చోట అనురాగం ఏర్పడితే అది విడదీయరాని అనుబంధంగా ఏర్పడుతుంది.

ఉద్యోగంలోని తృప్తి - భార్య అనురాగంలోని రక్తి, ఆయన మనస్సుని మురిపించాయి. మరపురాని అనుభూతుల్ని అంతర్లీనం చేసాయి

అటువంటి జీవితం ఒక్కసారిగా తారుమారయి పోయినట్టయింది ఉద్యోగం తోటి బంధమూ - భార్య తోటి రాగానుబంధమూ రెండూ స్వల్ప వ్యవధిలో తెగిపోయాయి. ఆయనకి జీవితంలో శూన్యం చోటు చేసుకుంది అబ్బ, జీవితంలో మనిషి ఇంత ఒంటరివాడయి పోయే క్షణాలుంటాయా! గతంలో ఎవరికయినా ఇలాంటి పరిస్థితి వస్తుందంటే ఆయన వూహకు కూడా అంది వుండేది కాదు అంత బిజీ లైఫ్ గడిపాడాయన ఇప్పుడో! స్వయంగా అనుబవిస్తున్నాడు భరించ లేనంత బాధగా వుంది!

తను ఒంటరితనం ఫీల్ అవుతున్నాడని తెల్సి చిన్నకొడుకు ఢిల్లీకి తీసుకు వెళ్ళి కొన్నాళ్ళు దగ్గర పెట్టుకున్నాడు చిన్నకోడలి హృదయం విశాల మయినదే - కాని, వాళ్ళుండే యిల్లు చాలా యిరుకయినది ఇద్దరు పిల్లలతో ఆ గదిన్నర జాగాలోను వాళ్ళి బ్బందులు పడుతుంటే వాళ్ళెంత ఉండమంటున్నా తనెంత కాలం అక్కడుండగలడు? వెళ్ళిన నాల్గు నెలలలోనే 'అన్నయ్యనీ అక్కయ్యనీ చూసి మళ్ళీ వస్తానురా' అని చెప్పి తిరిగి వచ్చేసాడు

కూతురి ఆనందం కోసం తృప్తి కోసం ఆమె దగ్గర ఓ నెల్నాళ్ళు ఉన్నాడు అంతకుమించి అల్లుడి యింట్లో ఉండటం భావ్యమనిపించలేదు చివరకు పెద్దకొడుకు యింట్లో స్థిర నివాసం ఏర్పరచుకోవటం జరిగింది!

శాంతతో పెళ్ళయిన కొత్తలో ఉమ్మడి కుటుంబంలో ఉండేవారు కొంచెం నోరు విప్పి భార్యాభర్తలు మాట్లాడుకోటానికి సంకోచించ వల్సి వచ్చేది ఎవరు వింటారో - ఎవరు పరిహాసం చేస్తారో అని వెనకముందులు చూసుకోవటం తోటే ఆవేశాలు చప్పబడిపోయేవి అనుబవాలు అనుభూతుల వరకే పరిమితమయిపోయేవి

కొంచెం అన్నదమ్ముల నుంచి విడివడి తను సంసారం ప్రత్యేకంగా పెట్టుకున్నారనుకొనేసరికి తమ కన్నబిడ్డలే ఎదిగి వచ్చారు భార్యని ఒక్కసారి దగ్గరకు తీసుకోటానిక్కూడా దొంగతనం చేస్తున్నంతగా అటూ యిటూ చూడాల్సి వచ్చేది ఎప్పుడో 'పిల్ల పిశాచులు' నిద్రపోయాక కాని తమకి వీలు చిక్కేది కాదు అటువంటి ఏకాంతం తమకెప్పుడూ కొరవే అయింది

ఆ ఏకాంతం కోసమే తను రిటయిరయిన తర్వాత తన పెద్ద కొడుకు వచ్చి వుండమన్నా - భార్యను తీసుకొని వెళ్ళలేదు లక్ష్మీనారాయణగారు గతించిన జీవితంలోని మధురానుబూతుల్ని ఒక్కటొక్కటే గుర్తుకు తెచ్చుకొని పూలమాలలా గుచ్చుకోవటం మొదలు పెట్టారు ఆ మదుర పరిమళాలు ఆఘ్రాణించి ఆనందించటం ప్రారంభించి నాల్గు నెలలు కాలేదు భార్యకు జబ్బు చేసింది ఆ తర్వాత తను ఏకాంతాన్నే కాదు తన జీవితంలోని ఆశల్నీ, ఆశయాల్నీ అన్నిటినీ లాక్కుపోయి తనని ఏకాకిని చేసింది శాంత

రిటయిరయినప్పుడు కూడా తనకి పెద్ద వయస్సు వచ్చిందని నమ్మలేక పోయాడు బార్య చనిపోయ్యాక ఒక్క ఆరు నెలల్లో ఆరేళ్ళ వయస్సు మీద పడినంత నిస్సత్తువ, నీరసం ఆయన్ని ఆవరించాయి

పెద్దకొడుకు సూర్యం యింట్లో పైకి చెప్పు కునేటంత ఇబ్బందులేవీ లేవు తనకు కాని, భరించలేకపోతున్నది ఈ ఒంటరితనమే! అంతా దగ్గరగా వున్నా దూరంగా ఉన్నట్లే వుంటుంది

సూర్యం పెద్ద ఆఫీసరు అయినందుకు తనకు సంతోషంగానే వుంటుంది కాని, పెద్ద ఆఫీసరు అయినందుకు అతనికి పెద్ద పెద్ద కనెక్షన్సు ఉన్నాయి క్లబ్బుకి వెడతాడు పార్టీలకి వెడతాడు ఎక్కడో మీటింగులకి వెడతాడు రోజూ పొద్దు పోయి యింటికి వస్తాడు తన దగ్గర కూర్చుని కాసేపు పిచ్చాపాటీ వేసేంత తీరిక అతనికి లేదు! . ఏ ఆదివారమో కాసేపు కాఫీ తాగే వేళనో, భోజనం చేసే వేళనో పలకరిస్తే అదే ఒక బ్రహ్మాండం అయిపోతోంది!

తానాయింటికి వచ్చిన కొత్తలో మనుమడు నారాయణ బి కామ్ చదువుతూండేవాడు ఆ తర్వాత బాంకింగ్ పరీక్షలకి చదివేవాడు' ఎప్పుడూ ఏదోటి చదువుకొనే మనవడి దగ్గరకి వెళ్ళి - తన భవిష్యత్తుని 'బాట' వేసుకుంటున్న వాడి దగ్గరకి వెళ్ళి - 'నాతో కాసేపు కబుర్లు చెప్పరా' అని అనలేదు కదా! సరే, తర్వాత వాడికి ఊళ్ళోనే బ్యాంకులో ఉద్యోగం దొరికింది ఇక కుర్రాడికి కాస్త తీరిక దొరికిందనుకుంటే సాయంత్రాలు కూడ యింట్లో వుండడు బ్యాంకులో స్పోర్ట్సు అసోసియేషన్‌లో చేరాడు క్రికెట్ ఆడతాడు టెన్నిస్ ఆడతాడు ఆడి ఆడి అలసిపోయి వస్తాడు తన దగ్గర కూర్చుని మాట్లాడ్డానికి ఓపిక వుండదు తనకు సాహిత్యం మీద మక్కువ వాడికి ఆటల మీద ఆసక్తి తనకు చరిత్ర అంటే యిష్టం. వాడికి పాలిటిక్సు అంటే సరదా ఇంక తనతో ఏం మాట్లాడతాడు? సంభాషణ పెంచాలంటే ఇరువురికీ యిష్టమయిన టాపిక్ అంటూ ఉండాలి కదా!

పెద్ద మనమరాలు శాంతి కొంతలో కొంత తనని అర్థం చేసుకునేది కాలేజీ నుంచి రాగానే తన దగ్గర అరగంట సేపయినా కూర్చుని కబుర్లు చెప్పాక కాని తన పనుల్లోకి వెళ్ళేది కాదు రోజంతా పడిన ఒంటరితనం బాధని ఆ ఒక్క అరగంటలోను తీర్చి వేసేది ఆ పిల్ల కాలేజీ చదువయిపోయింది ఆ వేసంగుల్లోనే ఒక సంబంధం కలిసొచ్చింది తనే పూనుకొని మనుమరాలు పెళ్ళి చేయించాడు శాంతి అత్త వారింటికి వెళ్ళిపోయింది మళ్ళీ తనూ తన ఒంటరితనమూ మిగిలాయి

చిన్న మనుమరాలు పద్మ చిన్నది ఇంగ్లీషు మీడియం చదువు ఎనిడ్‌బ్లయిటన్, నేన్సీడ్రూ చదువుతుంది టి వి లో 'హమ్‌లోగ్', 'రజని' చూస్తుంది ఆ పిల్లది కొత్త తరం తనది పాత



తరం! తనొక చక్కని తెలుగు పదం వాడితే ఆ పిల్లకి ఓ పట్టాన అర్థం కాదు అదే ఇంగ్లీషులో అయితే దంచేస్తుంది తనకే పాఠాలు చెపుతుంది! తమ ఇద్దరి తత్వాలు సమానాంతర రేఖల్లా ఉంటాయి! ఇద్దర్కీ నచ్చేది ఒక్కటే! బొబ్బట్లు, పులిహోర! కోడలు పండగలకి చేస్తుంది పద్మతో కబుర్లు చెప్పటానికి అదే తన పాలిట పండగ అవుతుంది

కోడలు పెద్దగా చదువుకోలేదు. తనతో సాహిత్య చర్చ చేసే శక్తి ఆమెకు లేదు లోకాభిరామాయణం ముచ్చటించేంత తీరికా ఆమెకుండదు పాపం, ఇంటెడు చాకిరీ తానే చేసుకుంటుంది ఆఫీసరు భార్యనని భేషజాలకి పోదు జాగ్రత్తమంతురాలు అది కొంత వరకు తనకు తృప్తిగా వున్నా తనకు కావల్సింది వేరు కదా! తనకు కావల్సింది తనతో తీరిక చేసుకొని మాట్లాడే వాళ్ళు ఏదో మాట వరసకు పలకరించే వాళ్ళయితే తన కిష్టం వుండదు ఎందుకు వాళ్ళిలా తన కోసం నటించటం – అని అనిపిస్తుంది వాళ్ళకి ఏ యిబ్బందీ లేకుండ తనే సంభాషణని త్రుంచేస్తాడు తను కోరుకొనేదల్లా తనతో మనసారా మాట్లాడే వాళ్ళు! తనతో సంతోషంగా మాట్లాడే వాళ్ళు

ఎదురింట్లో ఇంజినీరుగారి తండ్రి జగన్నాదం-గారితో పరిచయమయియది ఆయనదీ కలుపుగోలు గుణమే! ఇద్దరూ ఇట్టే కల్సిపోయారు. పగటి వేళ ఆ చర్చా ఈ చర్చా జరిగేది 'కొంచెం అలా చల్లగాలి పీల్చుకు వద్దాం పదండి ' అన్నాడొక సాయంత్రం వేళ జగన్నాధంగారు అక్కడ నుంచి రోజూ పార్కుకి షికారు వెళ్ళటం తమ డైరీలో ఒక భాగం అయిపోయింది

'అమ్మయ్య – తనకో తోడు దొరికింది' అని లక్ష్మీనారాయణగారు తృప్తిగా ఊపిరి పీల్చుకొని ఆరు నెలలు కాలేదు ఇంతలో ఇంజినీరు గారికి ఆ వూరి నుంచి బదిలీ అయిపోయింది కొడుకుతో పాటు జగన్నాధం గారు వెళ్ళి పోక తప్పలేదు!

ఇలాగే తన జీవితంలో ఎంతో మంది అడుగు పెట్టారు మనస్సుకి చాలా దగ్గరయ్యారు – అని అనుకొనే లోపల అర్థాంతరంగా వెళ్ళిపోయారు

## దాదాజీ

తాను రిటయిరయి ఆరేళ్ళయింది ఈ వ్యవధిలో ఏ ఒక్కరితోనూ ఆ అనుబంధం సుస్థిరం కాలేదు కేవలం జ్ఞాపకాలే మిగిలిపోతున్నాయి ఒంటరితనంలో మరింత బాధాజనితా లవుతున్నాయి

జగన్నాదంగారు వెళ్ళిపోతూ రోజూ పార్కుకి వెళ్ళటం అనే అలవాటు చేసి వెళ్ళాడు ఆ పార్కులో అనేక మంది చేరుతుంటారు ఎవరి ఆటల్లో వాళ్ళుంటారు ఎవరి మాటల్లో వాళ్ళుంటారు కొందరితో పరిచయం కాకపోలేదు కొన్ని పరిచయాలు చిరునవ్వుల వరకే పరిమితం మరికొన్ని చిరు ప్రసంగాలతో టే సమాప్తం కొందరు రోజూ రారు మరికొందరు మళ్ళీ ముఖమే చూపించరు మళ్ళీ వాళ్ళు వస్తే బావుండును – అని అనిపించేటంత స్నేహం ఎవ్వరితోనూ కలగలేదు

రంజనితో పరిచయమయ్యే వరకూ అయనకు రోజులు నిస్తేజంగా నిర్వీర్యంగా గడిచిపోయాయి ఆ రోజు తనకిప్పటికీ బాగా గుర్తు. 'నమస్కారమండీ!' అన్న కోమల కంఠం విని ఉలిక్కి పడ్డాడు ఆలోచనల్లోంచి తలెత్తి చూసాడు నాజూగ్గా అందంగా వుంది విస్ఫారితమయిన కళ్ళు తళుక్కు తళుక్కుమంటున్నాయి చిరునవ్వులు చిందిస్తోంది ఇరవై పైన ఒకటో రెండో వయస్సుంటుంది 'ఇక్కడ కూర్చో వచ్చాండీ!' అంది పక్కనే బెంచీ మీద కూర్చుంటూ.

తనకు నవ్వు వచ్చింది 'అనుమతి అడిగినదాన్ని మీ అనుమతి యివ్వకుండానే కూర్చున్నానని నవ్వుతున్నారా?' అని మందహాసం చేసింది 'అహ! అందుక్కాదమ్మా! పబ్లిక్ పార్కులో ఖాళీగా వున్న చోట కూర్చోటానిక్కూడ అనుమతి అడుగు తున్నావా – అని నవ్వు వచ్చింది ' అన్నాడు తను 'మీరు పెద్దవారు ముందు వచ్చి కూర్చున్నారు మీ అనుమతి అడగటం నా ధర్మం కదా!' అంది ఆ అమ్మాయి ఆమె సంస్కారానికి అబ్బుర పడ్డాడు, ఆనందపడ్డాడు.

అలా అలా మాటా మాటా కల్సింది 'నీ పేరేమిటమ్మా!' అని తను అడిగాడు 'నా పేరు వెనక పెద్ద కథ వుందండీ!' అని నవ్వింది ఏమిటో చెప్పమని కుతూహలంగా అడిగాడు

'మా వాళ్ళు పెట్టిన పేరు రజని మా స్కూల్లో ఓ క్లర్కు మహాశయుడుండే వాడు లెండి అతను పేర్లు తారుమారు చేయటంలో ఉద్దండుడు ఒకసారి తండ్రి పేరున్న చోట కొడుకు పేరు, కొడుకు పేరున్న చోట తండ్రి పేరు టైపు చేసాడు అది అలాగే బోర్డుకి వెళ్ళిపోయింది చివరకి తండ్రిగారి పేర హాల్ టిక్కట్టు వచ్చినప్పుడు కాని మా హెడ్మాస్టారు పొరపాటు గుర్తించలేదు ఇక అలాంటి చిత్రగుప్తుడు నా పేరు రజనికి బదులుగా రంజని అని టైపు చేయటంలో ఆశ్చర్యం లేదు కదా! హాల్ టిక్కట్టే కాదు – తర్వాత బోర్డు సర్టిఫికెట్టు కూడా రంజని పేరుతో టే వచ్చింది చివరికి కాలేజీలో కూడా నేను రంజనిగానే స్థిరపడి పోయాను థేంక్ గాడ్! సజని అని టైపు చేయనందుకు బ్రతికిపోయాను ' అని నవ్వింది

తన కర్థంకాక 'సజని అంటే?' అని అడిగాడు 'హిందీలో సజని అంటే ప్రియురాలు అని అర్థం కదండీ?' అని గలగలా నవ్వింది తనూ నవ్వకుండ ఉండలేకపోయాడు "మీ చిత్రగుప్తుడు పొర పాటు చేస్తే చేసాడు. నీకు చక్కని పేరు పెట్టాడు అందరి మనస్సులీ రంజింప చేసేలా మాట్లాడ గలవు అందుకనే ఆ పేరు పెట్టాడు "అన్నాడు తను ఆమె బిడియంగా నవ్వింది నిజంగా సిగ్గే సింగారం – అన్నది ఆమెలాంటి పిల్లను చూసాకనే అన్నారేమో – అని తన కనిపించింది

ఆమె గురించి వివరాలడిగాడు చెప్పింది బియ్యే చదివింది హిందీలో విశారద పాసయింది ఈ వూళ్ళో వాళ్ళ బాబాయి గారున్నారు బాబాయి గారికి పిల్లలు లేరు తనంటే వాళ్ళకి వల్లమాలిన అభిమానం. ఇక్కడ హిందీ టీచరు పోస్టు ఖాళీగా వుందంటే ఆమెకు కబురు పంపి రప్పించాడాయన ఇటీవలే వచ్చి స్కూల్లో చేరింది స్కూలు నుంచి వచ్చాక పిన తల్లితో కాసేపు కబుర్లు చెపుతుంది ఇంట్లో సాయం చేస్తుంది చిన్న సంసారం పెద్దగా పనులేవీ ఉండవు బాబాయి ఎప్పుడో పొద్దు పోయి గాని రాడు ఇంట్లో తోచక ఆ వేళ అలా పార్కు వైపు వచ్చింది

ఒంటరిగా కూర్చున్న తను కనిపించాడు ఎందుకో తననే పలకరించాలనిపించిందట! తనకి పరమానందమయింది. ' . ఈ ఒంటరి వాడి మీద దయ కలిగి ఆ దేవుడే నిన్ను నా దగ్గరకి పంపించాడమ్మా!' అన్నాడు మనస్ఫూర్తిగా. తన గొంతులోని దగ్గుత్తికకు రంజని చకితురాలైంది 'అదేమిటండీ! మీరు ఒంటరివారా? మీ కెవరూ . ' ఆమె మాటల కడ్డు వచ్చి అందరూ వుండి తను ఒంటరి వాడెలా అయ్యాడో చెప్పాడు ' ఎంత అయిన వాళ్ళయినా ఇలాంటి సున్నితమయిన విషయాలు పైకి చెప్పుకోలేం కదమ్మా!' అన్నాడు



బాంబినో ఒక అద్భుత మైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రోటీన్లు కలిగి యుండి క్రొవ్వు పదార్థము లేకుండుటయే బాంబినో విశిష్టత. వండినప్పుడు కాని, తరువాత కాని, ముద్దగాకాక పోవుటయే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో ఎంతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



**బాంబినో పకోడా**

మూడు కప్పుల నీళ్ళలో ఒక కప్పు బాంబినో ఉడికించండి. ఉల్లి పాయలు 2, ఒక ఆలు దుంప, చిన్న అల్లం ముక్క తరిగి ఉంచండి. ఒలిచిన వెల్లుల్లి నుండి 5 పాయలు ముద్ద చేయండి. దానిని బాంబినోలో కలపండి. రుచికోసం పచ్చి మిరపకాయలు వేయండి. ఒక కప్పు శనగపిండి వేసి చిక్కటి ముద్ద అయ్యేవరకు నీళ్ళు పోసి కలపండి. మూకుడులో నూనె మరగించి ఒక్కొక్క స్పూన్‌తో ముద్ద తీసి అందులో వేయండి. బంగారు గోధుమ రంగు వచ్చే వరకు వేగిన తరువాత దించి, పచ్చడితో కాని టమోటా సాస్‌తో వడ్డించండి.



బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం కొరకు వ్రాయండి.

జన జీవన్ ఫుడ్స్ ప్రైవేటు లిమిటెడ్,
1వ ఫ్లోర్, బషీర్‌బాగ్ ప్యాలెస్,
హైద్రాబాద్.





**వెర్మిసెల్లిని**

తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!






కొన్ని నిమిషాల క్రితం ఏర్పడిన అనుబంధం తన మనస్సులోని వేదననంతా వెళ్ళగక్కుకునే స్వతంత్రాన్ని తెచ్చింది ఆ అమ్మాయితో తన గురించి చెప్పుకోకుండ ఉండలేక పోయాడు

'సారీ! నా సొదతో నిన్ను బోరు కొట్టినట్టున్నాను' అని తానంటే 'అయ్యో! అంత మాటనకండీ! మీ గురించి తెల్సుకోవటం నాకు సంతోషంగా వుంది మీరు రోజూ యిక్కడికి వస్తారు కదా! నాకూ సాయంత్రాలు తోచటం లేదు. ఇక నుంచి రోజూ నేనూ వస్తాను' అంది ఆమె 'అంత కంటేనా తల్లీ!' అన్నాడు ఆమె ఆప్యాయతకు కళ్ళు చెమ్మగిల్లగా

మర్నాడు 'దాదాజీ! మై ఆగ యీ!' అంటూ వచ్చింది తను తెల్లబోతూ చూసేసరికి 'సో సారీ! పిల్లలకి హిందీ పాఠం చెప్పి చెప్పి వచ్చాను కదాండీ! తాతయ్యగారూ అనబోయి దాదాజీ అనేసాను' అని నవ్వింది 'అభిమానానికి స్వరమే కాని భాషతో నిమిత్తం లేదు తల్లీ! నువ్వెలా పిలిచినా నా కిష్టమే!' అన్నాడు తను 'అయితే, సరదాగా మిమ్మల్ని దాదాజీ అనే పిలుస్తాను' అంది. అబ్బ, ఎన్ని కబుర్లు చెపుతుందో! 'మరి వెళ్ళొస్తాను దాదాజీ!' అని ఆమె లేచే వరకూ బాగా చీకటి పడిందని తనకు స్పృహ రాదు ఆమె సమక్షంలో గంటలు క్షణాల్లా గడిచిపోతాయి

ఓ రోజున ఏదో పత్రిక చేత బుచ్చుకుని వచ్చింది. 'దాదాజీ! నేను హిందీ లోంచి తెలుగులోకి అనువాదం చేసిన కథ ఈ పత్రికలో పడింది మీకు చూపిద్దామని తెచ్చాను' అంది తాను ఆశ్చర్యపోయాడు 'నువ్వు కథలు రాస్తావామ్మా! ఎప్పుడూ చెప్పావు కాదేం?' అంటూ ఆ పత్రిక నందుకున్నాడు

'స్వంత రచనలు కాదు కదాండీ! ఇందులో చెప్పుకునేంత ప్రత్యేకత ఏముందని?' అని బిడియంగా నవ్వింది ఆ కథ చదివాడు తను హృదయానికి హత్తుకునేలా వుంది రచన అనువాదకురాలి ప్రజ్ఞ వల్ల ఆ రచనకి ఆ గొప్పతనం వచ్చిందేమో అన్నంతగా బావుంది 'నిజంగా ఆణిముత్యం లాంటి కథ! నీ ఎన్నిక బావుంది నీ అనువాదమూ బావుంది రెండు భాషలకీ మధ్య వారధి లాంటి దానివి నువ్వు!' అన్నాడు తను అభినందిస్తూ

'ఇంత చిన్నదానికి నన్ను ఆకాశాని కెత్తేస్తున్నారు నేనింకా చిన్న దాన్ని ప్రారంభంలోనే ఉన్నాను దాదాజీ!' అంది రంజని 'లేదమ్మా! ముఖస్తుతికి నేనా మాట అనటం లేదు నీ అనువాదం నిజంగా చాలా బావుంది హిందీ నుంచి తెలుగులోకి చేసావు బాగానే వుంది మరి మన బాషలో కూడ మంచి మంచి కథలున్నాయి కదా! వాటిని హిందీలోకి అనువాదం చేయకూడదూ!' అన్నాడు

రెండు రోజులు పోయాక 'దాదాజీ! మొత్తానికి మీరు నా బుర్ర తిరిగి పోయేలా చేసారు' అంది రంజని అప్పటికే ఆమె గమ్మత్తు కబుర్లకి

## తేడా!

గతం-
చరిత్ర
పుటల్లో
జీవిస్తే
భవిష్యత్తు-
కవి
కవితల్లో
జ్వలిస్తుంది!!

—చల్లా విశ్వనాథం

## దాదాజీ

అలవాటయిన తనకి ఆమె అలాగనటం ఆశ్చర్య మనిపించలేదు మృదు పరిహాసమనిపించింది 'ఏమిటమ్మా! ఏ సంగతీ?' అని అడిగాడు 'ఆఖరి కెలాగయితేనేం మీ కోరిక నెరవేరింది. 'వెలుగు' అనే తెలుగు కథని హిందీలోకి అనువాదం చేసాను' అంటూ అచ్చులోని తెలుగు కథని – హిందీ అనువాద ప్రతిని చూపించింది తెలుగు కథని తను చదివాడు

కాపీ చేస్తుంటే పట్టుకున్న లెక్చరర్ మీద దౌర్జన్యం చేయటానికి చాకు పుచ్చుకుని ఇద్దరు కాలేజీ కుర్రాళ్ళు వాళ్ళింటికి వెడతారు లెక్చరర్ ఇంట్లో వుండడు కాని, వాళ్ళెందుకు వచ్చారో గ్రహిస్తుంది ఆయన భార్య ఏ మాత్రం తొణక్కుండా ఆ కుర్రాళ్ళతో సాదరంగా మాట్లాడి వాళ్ళలోని ఆలోచనల దారి మార్చి – వాళ్ళలో పరివర్తన కలిగిస్తుంది చివరకి వాళ్ళ జీవితాలకు వెలుగు చూపించటం ఆ కథలోని ఇతివృత్తం

'కాపీ చేసే పిల్లలు అన్ని ప్రాంతాలలోనూ ఉన్నారు ఇన్విజిలేటర్లు మీద దౌర్జన్యం చేయడం దేశమంతటా సర్వసాధారణమయిపోయింది అన్ని ప్రాంతాలకీ సరిపోయే చక్కని కథని ఎన్నుకున్నావు హిందీ పాఠకులకి నీ కథ తప్పకుండా నచ్చుతుంది' అన్నాడు తను.

'అచ్చు కావాలి కదండీ! అప్పటి మాట కదా!' అంది రంజని 'అచ్చవనీ అచ్చు కాకపోనీ నీ ప్రయత్నం మానకూడదు తెలుగు కథల్ని నీలాంటి వాళ్ళే వెలుగులోకి తీసుకురాగలిగేది నా దగ్గర మంచి లైబ్రరీ వుంది పుస్తకాలు నేను తెచ్చిస్తాను బాగా చదువు భాష మీద మంచి అథార్టీ వస్తుంది' అని తను ప్రోత్సహించారు 'దాదాజీ! మీతో మాట్లాడ్డమే నాకొక ఎడ్యుకేషన్!' అని కమ్మగా నవ్వింది రంజని

తను పుస్తకాలు తెస్తుంటాడు ఆమె చదువుతుంది వాటి మీద తమ మధ్య చర్చలు జరుగుతుంటాయి. ఆమెతో చర్చించటం కోసమయినా తను పని కట్టుకొని పుస్తకాలు చదువుతుంటాడు పగటి పూట వుండే ఒంటరి తనం మటుమాయమయిపోయింది!

ఓ రోజున రంజని తన కంటి ముందే పార్కుకి వచ్చి కూర్చుంది తనని చూస్తూనే చిన్న పిల్లలా పరిగెత్తుకు వచ్చి 'దాదాజీ! యు ఆర్ గ్రేట్!' అంది ఆమె చేతిలోని కవరు చూస్తూ 'ఏమిటమ్మా! అంత ఘన కార్యం నేనేం చేసాను?' అని నవ్వాడు తను.

'సరిత – అనే హిందీ మేగజైన్‌లో నా కథను అచ్చు వేయబోతున్నారు ఏక్సెప్ట్ చేసినట్టు ఇవాళే ఉత్తరం వచ్చింది మీరు ఎంకరేజ్ చేసి వుండకపోతే నేను తెలుగు కథని హిందీలోకి అనువాదం చేసేదాన్ని కాదు 'దిస్ క్రెడిట్ మస్ట్ గో టూ యూ!' అంటూ ఆ కవరు తన కందించింది రంజని

ఆనంద పారవశ్యంతో తనకు కళ్ళనీళ్ళు వచ్చాయి 'నిన్ను పొగిడితే ఆయుష్ హీనం అవుతుందని కాని నువ్వు ప్రతిభావంతురాలివని నేనెప్పుడో గ్రహించానమ్మా! నీకు ఉజ్వలమైన భవిష్యత్తు ఉంది!' అన్నాడు తను ఆమె తల మీద చేయి వేసి ఆప్యాయంగా నిమురుతూ

'అంతా మీ ఆశీర్వాదం దాదాజీ! మీతో పరిచయం నా జీవితంలో ఇంత చక్కని మలుపు త్రిప్పుతుందని నేనెప్పుడూ ఊహించలేదు.' అంది రంజని 'ఉహుం! ఎల్లా కాలం ట్రాన్స్ లేటర్‌గా ఉండి పోదామనుకుంటున్నావా? నీలో ఒరిజినాలిటీ ఉంది ఏనాడో భావావేశం పొంగి వస్తుంది భాష నీకందుబాటులో వుంది. స్వంతంగా కథలు రాయాలనిపిస్తుంది రాస్తావు రాయకుండ ఉండలేవు అటు హిందీలోను .. ఇటు తెలుగులోను కూడా!' అన్నాడు తను. 'అమ్మో!' దాదాజీ నన్ను హడల కొట్టేస్తున్నారు' అంది రంజని.

'హడలి పోతావో! కదలిపోతావో! నాకు తెలియదు నీ కలం మాత్రం కదలిపోవాలి కథలతో ఆగిపోదామనుకుంటున్నావా! ఉహుం! ఇంతింత నవలలు రాయాలి దాదాజీ – ఇదిగో ఈ నవల మీ కంకితం ఇస్తున్నాను – అని నువ్వు అనాలి. అప్పటి దాకా నా బాకీ తీర్చావు కాదేమిటమ్మా – అని నిన్ను నేను వేదిస్తూనే ఉంటాను!' అన్నాడు తాను

ఆ అమ్మాయి ముఖం సిగ్గుతో ఎర్రనయింది మాట్లాడలేక మురిపెంగా నవ్వి వూరుకుంది ఆ సంఘటన జరిగి నెల రోజులయింది ఈలోగా రెండు హిందీ కథల్ని తెలుగులోకి అనువాదం చేసి పత్రికలకు పంపింది రంజని గత నాల్గు రోజులుగా మరో చక్కని తెలుగు కథని హిందీలోకి తర్జుమా చేసే పనిలో పడింది నిన్నటి రోజునే అది పూర్తి చేసింది ఫెయిర్ కాపీ చేసి ఇవేళ పోస్టు చేస్తానని చెప్పింది

ఇంక రంజని వచ్చే వేళయింది .. అనుకుంటూ గేటు వైపు మళ్ళీ దృష్టి సారించాడు లక్ష్మీనారాయణ గారు

అల్లంత దూరంలో రంజని కనిపించేసరికి ఆయన మనస్సు పరవశించింది ఉత్సాహంగా పైకి లేచి బెంచీ మీద లేని దుమ్ముని దులిపి మళ్ళీ కూర్చున్నాడు

నువ్వు నాలుగు వందల ఏభై సెకన్లు ఆలస్యంగా

వచ్చావమ్మా!" అన్నాడు దగ్గరగా వచ్చిన రంజని ముఖంలోకి చూసి నవ్వుతూ.

రంజని ఏదో గమ్మత్తయిన మాట అంటుంది అనుకుంటూ ఎదురు చూసాడు ఆయన. కాని, ఆమె ఏమీ అనలేదు. పల్చగా నవ్వి వూరుకుంది. ఆ నవ్వులో ఎందుకో ఎప్పటి కాంతి లేదు. స్కూల్లో పిల్లలకి పాఠాలు చెప్పి చెప్పి పాపం అలసిపోయిందేమో! 'అలా నిలబడి పోయావేమిటమ్మా! కూర్చో!" అన్నాడు.

రంజని కూర్చుంది. అటూ ఇటూ తల తిప్పి చూసింది. కొన్ని క్షణాల పాటు పార్కులో అందర్నీ కలయజూస్తూ కూర్చొంది.

వస్తూనే గలగల సెలయేరులా ప్రవహించే ఆమె ఒక్కసారిగా మౌనవ్రతం పట్టటమేమిటి? అతనికి చిత్రమనిపించింది ఏదో అసాధారణమనిపించింది ఎలా ప్రస్తావన ఎత్తాలో మొదట తోచలేదు. ఏదో గుర్తొచ్చి "కథ పోస్టు చేసేసావా?" అని అడిగాడు.

తల వూపింది కాని పెదవి విప్పలేదు.

'ఏమిటాలోచిస్తున్నావు?"

'అబ్బే, ఏమీ లేదండీ!"

"ఉహుఁ! నాకు తెల్సు ఒక ఏతత అనువాద కథలయిపోయాయి. మరి దాదాజీ బాకీ తీర్చటానికి ఏ తెలుగు కథ రాయ్యాలా అని ఆలోచిస్తున్నావు కదూ!... ఎవరి కథో ఎవరి కథో ఎందుకు? మీ దాదాజీ కథే వ్రాసేసెయ్!" అని గలగల నవ్వాడు లక్ష్మీనారాయణగారు.

"నేనెప్పటికీ మీ బాకీ తీర్చలేను దాదాజీ!"

అలవాటుగా రంజని పరిహాసాని కామాట అందేమోనని ఆమె వైపు చూసి నవ్వబోయాడు ఆయన. వాడిపోయిన ఆమె ముఖం చూసేసరికి ఆయన కేదో అంతు పట్టని భయంతో గుండె జల్లుమంది. "ఎందుకమ్మా అంత మాట అంటున్నావు?"

"ఓ సంగతి మీతో చెప్పాలని చాలా రోజులుగా అనుకున్నానే కాని చెప్పనే లేకపోయాను దాదాజీ!"

'ఏమిటమ్మా? ఏ సంగతి?" అని అడిగాడు అయోమయంగా చూస్తూ.

'నేనీ వూర్నించి వెళ్ళిపోతున్నానండీ!"

ఆయన గతుక్కుమన్నాడు. " ఈ వూర్నించి వెళ్ళిపోతున్నావా? ఎందుకమ్మా? ఎందుకని?" అని కంగారుగా అడిగాడు.

'నన్ను క్షమిస్తానంటే...."

"క్షమించవల్సినంత అపరాధం నువ్వేం చేసావమ్మా!" అన్నాడు పిచ్చివాడిలా చూస్తూ

హేండ్‌బేగ్ తెరచి అందులోంచి ఓ కవరు బయటకు తీసి లక్ష్మీనారాయణ గారి చేతుల కందించింది ఆమె. అందుకుంటుంటే ఆయన చేతు లెందుకో కంపించాయి. ఆ కవరు మీద 'దాదాజీ' అని వ్రాసి వుంది..

"ఏమిటమ్మా యిది?" అని అడిగాడు తెల్లబోతూ.

"తెరిచి చూడండి."

తెరచి చూసాడు.... పెళ్ళి శుభలేఖ! వరుడు ప్రభాకర్! వధువు రజని!

"ర.....జ.....ని" నీ పెళ్ళి శుభలేఖా!"

"అవునండి. ప్రభాకర్ మా బావ. అతనికి కలకత్తాలో ఉద్యోగం...." ఆపైకి రంజని మాటలు లక్ష్మీనారాయణ గారికి వినిపించలేదు ఆయనకు స్పృహ తప్పినంత పనయింది.

"రేపటి నుంచి రజని ఇక్కడికి రాదు. ఈ వూర్నించి వెళ్ళిపోతోంది..." ఆ నిజం ఆయన నవనాడుల్ని క్రుంగదీస్తోంది గాఢంగా ఏర్పడే అనుబంధాలన్నీ, ఒక్కటొక్కటే యిలా అర్థాంతరంగా తెగిపోవటాని కేనా – అని గుండె కలుక్కుమంటోంది.

"నన్ను క్షమించండి దాదాజీ!..."

రంజని గద్గద స్వరం ఆయన మనస్సుని కదలించింది. "అయ్యో! ఎంత మాట తల్లీ! పెళ్ళి శుభలేఖ ఇచ్చావు. కంగ్రాట్యులేషన్స్ వెంటనే చెప్పాలని తోచని మూర్ఖుడ్ని. నువ్వే నన్ను క్షమించాలి"

.. .

రంజని వెనక్కి తిరిగి వెళ్ళిపోతుంటే 'దాదాజీ' గుండె చెరువయింది. మళ్ళీ తన మనస్సుని రంజింప జేసే రంజని కనిపించదు.. అన్న నిజం ఆయన్ని నిలువునా కాల్చేస్తోంది

పార్కులోని జనమంతా ఎప్పుడో వెళ్ళిపోయారు. లక్ష్మీనారాయణగారొక్కడూ అక్కడ ఒంటరిగా మిగిలిపోయారు.

అక్కడంతా శూన్యం. చీకటి. 'దాదాజీ' మనసు నిండా శూన్యం. చీకటి' □

# ఇ·వేమన·పద్యాలు




పాము కంటి గలదె పాపిష్టి జంతువు
యట్టిపాము చెప్పినట్టి వినును
ఖలుని గుణము మాన్ప ఘనులెవ్వరును లేరు
విశ్వదాభిరామ వినురవేమ

# సింగపూర్‌లో భారతీయ



హొటల్ ''అన్నల

ప్రపంచంలోని పలురకాలయిన సంస్కృతులకు చెందిన ప్రజలు నివసించే నగరం సింగపూర్, అది ఒక అంతర్జాతీయ వాణిజ్య కేంద్రం. ప్రపంచంలోని నలుమూలల నుంచి వచ్చిన అతిథులు తమ విరామ సమయాన్ని ఈ మనోహరమైన ప్రదేశంలో గడుపుతూ ఉంటారు. వీరిలో చైనా, మలయా జాతీయుల తర్వాత భారతీయుల జనాభా సంఖ్య ఎక్కువగా ఉంది.

కానీ నిన్న మొన్నటి వరకు నగరంలోని ధనికులు నివసించే ప్రాంతాల్లో ఎక్కడా ఒక్క శాకాహార భోజనశాల లేదు. భారతీయులు, ఇతర శాకాహార యాత్రికులు ఎక్కడో మైళ్ల దూరంలో సెరంగూన్ రోడ్డులో ఉన్న హోటల్‌కు వెళ్లాల్సిందే. అక్కడా ప్రథమశ్రేణి భోజనం కూడా దొరకదు.

''అన్నలక్ష్మి''లో ఒక విభాగం

గత మార్చిలో సింగపూర్ నగరానికి నడి బొడ్డులో వెలసిన "అన్నలక్ష్మి" అనే శాకాహార భోజన-ఫలహార శాల ఉలోటును తీర్చింది. ఈ హోటలును దక్షిణ భారత మహిళలు హెచ్చు లాభాలు ఆశించకుండా తమ ఇచ్ఛా పూర్వకంగా సహకార ప్రాతి పదికపై నడుపుతున్నారు.

ఈ హోటలులో వంట చేయడం, వడ్డించడం అన్నీ మహిళలే నిర్వహిస్తారు. ఇలాంటిది బహుశా ఆసియాలో ఇదే మొదటిది కావచ్చు. గృహిణులు, టీచర్లు, విద్యార్థులు, ఆఫీసుల్లో పని చేసే వారు తదితర ఉద్యోగాలు చేసుకునే దాదాపు 80 మంది కలసి వంతులు వారీగా తమ విరామ సమయాల్లో వచ్చి పని చేస్తారు. టేబుల్ దగ్గర సర్వ్ చేసే వారు, గిన్నెలు కడిగే వారు అందరూ అందమైన స్త్రీలే. భారతీయ సంస్కృతి ఉట్టిపడే విధంగా చీరలు ధరించి అప్సరసల్లా వారు హోటలులో అటు, ఇటు తిరుగుతూ ఉంటే కనుల విందుగా ఉంటుంది.

భోజన ప్రియుల కంతా "అన్నలక్ష్మి"లో నోరూరించే

అన్నలక్ష్మిలోని అత్యం





క్ష్మి"- సింగపూర్

# మహిళల "అన్నలక్ష్మి"

పరిశుభ్రమైన పాకశాల



తిను బండారాలు, భోజన పదార్థాలు, తాజా పండ్ల రసాలు దొరుకుతాయి. పోషక పదార్థాలతో కూడిన రుచికరమైన ఆహారాన్ని శుచిగా, శుభ్రంగా వండి అతిథుల కందించడమే ఈ "అన్నలక్ష్మి" ప్రధాన ధ్యేయం. కేవలం వండటం, వడ్డించడం అని గాకుండా ఈ వనితలు చేసే ప్రతి పని కళాత్మకంగా ఉంటుంది. ఆఖరికి మెతుకాకార్డు ప్రింటు చేయడంతో కూడా ఒక విధమైన ప్రత్యేకత ఉంది. సాధారణ ప్రజానీకానికి అందు బాటులో ఉండే ధరలలో ఇంచు మించు వందరకాలయిన భోజన పదార్థాలు "అన్నలక్ష్మి"లో తయారవుతాయి.

ఇందులో రాజ్యలక్ష్మి, మహాలక్ష్మి అనే రెండు సర్వీసు విభాగాలున్నాయి. మొదటిది రోజు వారి లభించిన పదార్థాలతో ప్రత్యేక భోజనం, కాగా రెండవది శాకాహారంలో అతి పసందైన భోజనం. చకచక పనులు చేస్తూ అప్సరసల్లా ఉండి "అన్నలక్ష్మి"లో పని చేసే పడతులు చక్కని తమిళ, మలయాళ భాషలలోనే గాక వారు ఇంగ్లీషులో కూడా బాగా మాట్లాడతారు.



"అన్నలక్ష్మి"లో ఈశ్వరుని విగ్రహం

"కళామందిర్' అనే సాంస్కృతిక సంస్థకు చెందిన సభ్యులందరూ తమ గురువైన స్వామి శాంతానంద కోర్కె మీద ఈ హోటల్ ఏర్పాటు చేసినట్లు శ్రీమతి విలాసినీ త్యాగరాజన్ తెలిపారు. ఆ హోటల్ ఒక దేవాలయం లాంటి దంటుందామె. దక్షిణ భారత భోజనానికి 'నల' అని, ఉత్తర భారత భోజనానికి 'దమయంతి' అని పేర్లు పెట్టారు. ఇక్కడ పెసరట్లు, దోసె, లడ్డు, జాంగ్రి వగైరా కూడా దొరుకుతాయి. తమ హోటల్లో సాంస్కృతిక కార్యక్రమాలివ్వడానికి భారతీయ నర్తకులను, గాయకులను 'అన్నలక్ష్మి' ఆహ్వానిస్తున్నది కూడా!

రచన, ఫోటోలు :
–కె. ఎ. విశ్వనాథన్

# అభిమాన తారలపై అభిప్రాయం

సినీ వినీలాకాశంలో సుప్రీం స్టార్గా ప్రకాశించుచున్న డేరింగ్, డేషింగ్, డైనమిక్ హీరో చిరంజీవి నా అభిమాన నటుడు. 'మగ మహారాజు' చిత్రము చూచి చిరంజీవి అభిమానిగా మారాను. ఈ చిత్రములో నిరుద్యోగిగా చిరంజీవి నటన అద్భుతముగా ఉంది. అమాయకతను ప్రదర్శించే ఆ మోమును ఎన్ని సార్లు చూచినా ఇంకా ఇంకా చూడాలనిపిస్తుంది.



'విజేత' చిత్రములో చెల్లెలి పెళ్లి కొసము గొప్ప త్యాగము చేసిన అన్నయ్య పాత్ర, లోకములో ఇలాంటి అన్నయ్యలు ఉంటారా, అన్నట్లుగా చిరంజీవి నటించారు. చిరంజీవి నా అభిమాన నటుడే కాక నేను అభిమానించే అన్నయ్య కూడా. మాటల ఉచ్చారణలోను, ఫైటింగ్స్ లోను, స్టెప్స్ వేయడము లోను ఇతనికి ఇతనే సాటి. ఎటువంటి హావ భావాల నైనను తన మోములో చక్కగా ప్రదర్శించగల వ్యక్తి చిరంజీవి. మొన్నటి 'ఖైదీ' నిన్నటి 'మగధీరుడు' నేటి 'రాక్షసుడు' చిత్రములలో చిరంజీవి నటన అత్యద్భుతము. కథకు ప్రాధాన్యము గల చిత్రములలో, కుటుంబ కథా చిత్రములలో నటించాలని ఒక అభిమానిగా కోరుకొనుచున్నాను.

–జి. గీత, పెరుమాళ్ళపల్లె, చిత్తూరు

★ ★ ★

నా అభిమాన నటి సుమధుర హాసిని సుహాసిని "కొత్త జీవితాలు" ద్వారా తెలుగు ప్రేక్షకులకు పరిచయమై అనతి కాలంలో నే వారి హృదయాలలో ఉన్నత స్థానం నిర్మించుకున్న ఈమె నటన



అద్భుతం. స్వాతి పాత్ర ఆమెకు ఎంతో పేరు తెచ్చింది. "స్వాతి" చిత్రంలో ఆమె నటించారు అనే దానికంటే జీవించారు అనటం సమంజసం. "సిరివెన్నెల"లో ఆమె నటనకు ఎవరు సాటిరారు. "రాక్షసుడు"లో ఒక ఆదర్శభావాలు గల స్త్రీగా ఎంతో బాగా నటించారు. "సింధు భైరవి" ద్వారా జాతీయ అవార్డును పొందిన ఆమె ఇంకా ఎన్నో అవార్డులను పొంది ఉత్తమ నటిగా తెలుగు ప్రజలలో చిరస్థాయిగా నిలిచిపోవాలని నా కోరిక. ఆమెను లాయర్గా, ఇన్స్పెక్టర్గా చూడాలని అభిమానిగా ఆశ.

–తోట ఛాయాప్రసన్న, పాత చీరాల, చీరాల

★ ★ ★

నా అభిమాన, అందాల, సుకుమార, ముద్దుగుమ్మ అయినటువంటి విప్లవ జ్యోతి కుమారి విజయశాంతి అంటే నాకెంతో ఇష్టం. "నేటి భారతం"లో భారతిగా, "వందే మాతరంలో" శాంతిగా "ప్రతిఘటన"లో ఝాన్సీగా, "అరుణ కిరణం"లో అరుణగా "రేపటి పౌరులు"లో సరస్వతిగా నటించిన ఆమె నటన, గ్లామర్, వాయిస్ ఎంతో అద్భుతంగా ప్రేక్షకుల హృదయాలను ఆకట్టుకునే విధంగా సూపర్బ్గా వుంది. అనతి కాలంలో నే తారాస్థాయికి ఎదిగి ఒక ధృవతారగా గుర్తింపబడి, విప్లవాత్మక మైనటువంటి భావాలు కల్గిన "వీరవనిత" విజయశాంతిగార్కి ఒక అభిమానిగా చెప్పేది ఏమిటంటే



ఏమిటంటే ముమ్ముందు కూడ విప్లవ, కళాత్మక మైనటువంటి పాత్రలనే ధరించి నిండుగా హుందాతనంగా కన్పించాలని ఆశిస్తున్నాను. ఒక బిడ్డను ఉత్తమ జాతి పౌరునిగా తీర్చి దిద్దే తల్లి పాత్రలో మిమ్మల్ని చూడాలని వుంది. ఈ జన్మలో మా కోర్కెను తీర్చగలుగుతారా? ఆ అవకాశం వస్తే తప్పక వినియోగించుకుంటారని ఆకాంక్షిస్తున్నాను.

–ఎం. శకుంతలాదేవి, మాచర్ల

★ ★ ★

నా అభిమాన హీరో ప్రజానటుడు, సాహస నటుడు, పేదలపాలిట పెన్నిధి సూపర్స్టార్ కృష్ణగారు. కృష్ణగారు ఎక్కువ శాతం ప్రజల మనిషిగా నటిస్తూ ఉంటారు. ప్రజలు బాధపడితే చూడలేరు. అందుకే మా సూపర్స్టార్ కృష్ణగారంటే ఎనలేని అభిమానం. గోదావరి వరదలలో రు. 4 లక్షలు యిచ్చిన మహామనిషి. ఏ చిత్రం తీసినా సాహసంతో తీస్తారు. ఇటీవల వారి సాహస మాణిక్యాలు తను కథ, స్క్రీన్ప్లే, ఎడిటింగ్, నిర్మాత, దర్శకత్వం నిర్వహించిన పద్మాలయా స్టూడియోస్ 70 ఎం. ఎం. చిత్రం సింహాసనం తెలుగు, హిందీ, తమిళ, మలయాళ భాషలలో కొన్నికోట్ల వ్యయంతో నిర్మించి భారత దేశంలో సంచలనం సృష్టించారు. పద్మాలయా ఫిలింస్ 'నా పిలుపే ప్రభంజనం' ఆంధ్రదేశంలో శతదినోత్సవానికి పరుగులు తీస్తోంది.

వారు నిర్మించబోతున్న 'ప్రజా రథం' ప్రారంభించ బోతున్నారు. తన జీవితంలో సాహసమే లక్ష్యంగా నటిస్తున్నారు కాబట్టి నాకు కృష్ణగారంటే పిచ్చి



మాలిన అభిమానం.

–చెరుకూరి శ్రీనివాస్, బాపట్ల

★ ★ ★

సాధారణంగా సినిమా రంగంలో ఎవరైనా డాక్టరు కావాలనుకొని యాక్టరు నయ్యానని చెప్పుకోవటం పరిపాటి. కానీ డాక్టర్ అయివుండీ యాక్షన్లో సూపర్బ్, ఫెంటాస్టిక్ అనిపించుకొంటున్న నేటి యువ కథా నాయకుడు డాక్టర్ రాజశేఖర్ నా అభిమాన నటుడు.

భారీ చిత్రాలతో అగ్రశ్రేణి తారాగణంతో సినిమా రంగం దద్దరిల్లిపోతున్న సమయంలో మనసుకు ఆహ్లాదం కలిగించే చిత్రాలలో, సందేశాత్మక చిత్రాలలో అద్భుతంగా నటించి ఆశేషాంధ్రుల అభిమానాన్ని సంపాదించుకొన్న అందాల నటుడు, స్వచ్ఛమైన సంభాషణా చతురత, మంచి పర్సనాలిటీ కలిగిన నటుడు, 'ప్రతిఘటన' చిత్రం ద్వారా పరిచయమై వందేమాతరం, రేపటిపౌరులు, అరుణ కిరణం చిత్రాలలో నటించి నటనలో ఘన విజయం సాధించినాడు.



ఈ మధ్య విడుదలయిన 'తలంబ్రాలు' చిత్రం అతని నటనకు మరో మణిమకుటం. నటనా శిఖరాగ్రాల అధిరోహణకు అద్భుతమైన ఆరంభం. హీరోకమ్ విలన్లా ఆ చిత్రంలో అతని నటన అభిమానిగా జీవితంలో మరపురానిది. మరెన్నో మంచి చిత్రాలలో నటించి కీర్తి కిరీటాలను చేజిక్కించుకోవాలని అభిమానిగా నా కోరిక.

-కుమారి ధరణి వాణి, ప్రకాశ్నగర్, కర్నూల్ □



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు!

**కొండపనేని వనజాక్షి, మంచికలపూడి**

"అనాదిగా ఆడది" చిత్రంలోని మీ పాత్ర చాలా బాగుంది. అదే నిజజీవితంలో ఎదురైతే ఏం చేస్తారు?

ఎదుర్కోగలను– కానీ ఆ పద్ధతుల్లో మాత్రం కాదు.

**కూచిపూడి నల్లయ్య, గుంటూరు**

పెళ్ళి అయితే స్త్రీకి మెడలో మంగళ సూత్రం గుర్తు. అదే మగాడికి ఎలాంటి గుర్తులు వుండవు ఎందుకని?

ఎందుకుండవ్! కొన్నేళ్ళు పోయాక తల మీద బొప్పెలూ – వీపు మీద వాతలూ కనిపిస్తాయి.

**యన్. రాజగోపాల్, ఇల్లెందు**

మీరు – స్త్రీ సమస్యలకు అద్దం పట్టే చిత్రాల్లో నటించి...., వరకట్న నిర్మూలనకు నివారణోపాయం తెలిపే పాత్రల్ని పోషించి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయాలన్నది నా కోరిక.

తప్పకుండా! ఆ అవకాశం రావాలి కానీ!

**టి. శివాజీ, బెండమార్లంక**

ఆడది అర్ధరాత్రి నిర్భయంగా తిరగ గల్గితే స్వతంత్రం వచ్చినట్లు అని అన్నారు– పూజ్య బాపూజీ. పట్ట పగలు కూడా స్త్రీ ఒంటరిగా తిరగలేని నేటి దుస్థితి మారేది ఎప్పుడంటారు?

మగాళ్ళు మారినప్పుడు – స్త్రీ ఎదురు తిరగ గలిగినప్పుడు.

**చాగంటి పద్మావతి, అమరావతి**

తెలుగు నటిని ఎవరినైనా మీ అభిమాన నటి ఎవరు? అని ప్రశ్నిస్తే హాలివుడ్ తార పేరునో...., లేక హిందీ నటి పేరునో చెబుతుంది. మనల్ని మనం గౌరవించుకోము ఎందుకని?

ఎందుకని? అదే నాకూ అర్థం కావడం లేదు.

**సి. హెచ్. రవితేజ, పెద్దపల్లి**

నాటి నాయికలకు.... నేటి నాయికలకు గల తేడాను వివరంగా వివరించరూ?

వారు వారే – వీరు వీరే!

**టి. మాధవీలత, రాయచోటి**

మీరు ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని అనుకుంటు న్నారా? లేక పెద్దల నిర్ణయంతో పెళ్ళి చేసుకుంటారా?

ప్రస్తుతం అది ఆలోచించే తీరికలేదు.

## ఉత్తమ ప్రశ్న

**డి. వరలక్ష్మి, చిట్టివలస**

క్షణం... క్షణం... చిత్త క్షోభను అనుభవిస్తూ కోరికల కడలిలో కొట్టుకు పోయే మధ్య తరగతి ఆడపడుచులకు మీ సలహా?

కోరికల కడలి అన్నది తెలుసుకోమనీ, దురాశ పడవద్దనీ–

**బోనేపల్లి యూన్సీ లక్ష్మి, తెనాలి**

మహాకవి శ్రీశ్రీ వ్రాసిన "మహాప్రస్థానం" ఎక్కువ మంది చదివి వుండరు. కానీ గొప్పగా అందరూ చెప్పుకుంటారు. అలాగే–

అవార్డ్ చిత్రాలను గూర్చి చాలా బాగా తీసారని చెప్పుకుంటారు. ప్రేక్షకులు చాలా తక్కువ మందే ఆ చిత్రాల్ని చూడ్డం జరుగుతుంది. జనం చూడని చిత్రాలకు అవార్డులిచ్చి ఉపయోగం ఏమిటన్నది నా ప్రశ్న. మరి మీ సమాధానం....?

బహుశా జనం ఎలాగూ చూడరు కనీసం అవార్డ్ యిచ్చి తీసిన వాళ్ళని సంతృప్తి పెడదామని కాబోలు.

**యస్. శ్రీదేవి**

మీకు మీదృష్టిలో ఎటువంటి పాత్రలు వేయాలని అనుకుంటున్నారు?

మంచిపాత్రలు.

**పి. ఆర్. మోహనరావు, నాగార్జున సాగర్**

మీ "మంచి మనసులు" చిత్రంలోని జానకి పాత్ర మీ జీవితంలో ఎదురైతే ఏం చేస్తారు?

అలాంటి పరిస్థితి మరే ఆడదానికీ రాకూడదని కోరుకుంటాను.

**యస్. కనకారావు, పర్లాకిమిడి**

మీ దృష్టిలో నేటి సమాజ శ్రేయస్సుకు ఎటువంటి చిత్రాలు అవసరం?

మంచి చిత్రాలు.

**ఆర్. కులకర్ణి, మెదక్**

విజ్ఞానపు అజ్ఞానపు బావుటాల్ని చూపి అసలైన సామాజిక స్పృహని సినిమాలు ఎంత వరకూ కల్పిస్తున్నాయి?

మీరీ ప్రశ్నని సమాచార శాఖ మంత్రి గారినో, ఏ అభ్యుదయ రచయితనో, ఏ సంఘ సంస్కర్తనో అడగండి!

**పి. గౌస్ మొహిద్దీన్, కాకినాడ**

అభ్యుదయ దర్శకుడు కీ. శే. శ్రీ టి. కృష్ణగారిపై మీ అభిప్రాయం?

మేటి దర్శకుడనీ, నేటి చలనచిత్ర రంగాన్ని ఓ మలుపు తిప్పిన మేధావనీ! □

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

____________________

పంపిన వారి పేరు ____________________

పూర్తి చిరునామా ____________________

____________________



"ధర్మపత్ని" లో భానుప్రియ



"కాబోయే అల్లుడు" లో రేఖ

# సినిమా విశేషాలు

– జి.వి.జి.

## జి. వి. ఎస్. రాజు సమర్పించే "రౌడీ పోలీస్"

మౌళికథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో జి. వి. జి. రాజు నిర్మించే విజయలక్ష్మి మూవీస్ వారిపై చిత్రం చివరి షెడ్యూల్ డిసెంబర్‌లో జరుగుతుంది. భానుచందర్, రాధిక, సత్యనారాయణ, వేలు, కల్పన, మణిమాల నటిస్తున్నారు. భట్టాచార్య రచనా సహకారం, రాజన్ – నాగేంద్ర సంగీతం, దేవీప్రసాద్ ఛాయ, బాలు శిల్పం, రాజేంద్ర – వెంకటేశ్వరరావు ప్రొడక్షన్, జి. శివరావు నిర్వహణతో జి. వి. ఎస్. రాజు సమర్పణ.

## "స్వాతంత్ర్యానికి ఊపిరి పోయండి"

"డిసెంబర్‌నుంచి ఒంగోలు, ఈతముక్కల, మన్నూరు, శ్రీశైలం ప్రాంతాలలో షూటింగ్," అన్నారు అరుణోదయ ఫిలిమ్స్ డివిజన్ అధినేతలు ఐ. వి. రత్నం, జి. ఎస్. చౌదరి. వీరు ఒంగోలులోని అరుణోదయా రియల్ ఎస్టేట్ అధినేతలు కూడా.

వీరిపై చిత్రంలో ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన విజయభూషణ్, విజయశేఖర్, వినయ్, బాలు, సాయిరాజ్, ప్రసాద్, రమేష్‌తో పాటు రాజ్యలక్ష్మి, తులసి, స్మిత, అనూరాధ, వై విజయ, లక్ష్మీచిత్ర, కల్పనారాయ్, జయమాలిని, పాత్రి కేయుడు దేవానంద్, ఒక ప్రత్యేక పాత్రలో చంద్ర మోహన్ నటిస్తారు. కొత్త రచయిత నిరంజన్ బొబ్బా మాటలు, పాటలు రాశారు. గాయకుడు ఆనంద్ సంగీత దర్శకుడు. దక్షిణభారత ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ ప్రధానోపాధ్యాయుడు యు. వి. బాబు, నృత్య దర్శకుడు చిన్ని కలిసి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఈ చిత్రం తమిళంలో కూడా తయారవుతుంది.

## తారక ప్రభు ఫిలిమ్స్ "రొటేషన్ చక్రవర్తి"లో "కళా ప్రపూర్ణ" దాసరి, "ఊర్వశి" శారద

"నా సరసన శారద తొలిసారిగా నటిస్తోంది. డిసెంబర్ 5 నుంచి జనవరి 4 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు దాసరి. ఈయన 'రొటేషన్ చక్రవర్తి'గా ఒక విలక్షణమైన పాత్రను నిర్వహించే తారక ప్రభు ఫిలిమ్స్ చిత్రాన్ని దాసరి పద్మ సమర్పిస్తారు. శారద, రాజేంద్రప్రసాద్, నరేష్, రజని, రాజ్యలక్ష్మి, సుధాకర్, పూర్ణిమ, పి. ఎల్. నారాయణ, కోట శ్రీనివాసరావు, నర్రా ప్రభృత నటవర్గం. దాసరి కథ, స్క్రీన్‌ప్లేకు కాశీ విశ్వనాథ్ సంభాషణల కర్త, సత్యం సంగీతం, పి. శరత్‌బాబు ఛాయ, మోహన్ శిల్పం, కృష్ణ కూర్పుతో రేలంగి నరసింహారావు దర్శకుడు

సారధ్యం, ఎ. మోహన్‌గాంధి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో విశిష్టంగా తయారైన ఉషాకిరణ్ మూవీస్ "పూజకు పనికి రాని పువ్వు" చిత్రానికి రామోజీరావు నిర్మాత. డిసెంబర్ విడుదల.



"అమెరికా అబ్బాయి"లో అశ్వని, రాధిక

## "పూజకు పనికిరాని పువ్వు"లో శ్రీరంగ నీతులు

చెప్పేవి శ్రీరంగనీతులు, చేసేవి ఘోరకృత్యాలు అన్నట్లు ప్రవర్తిస్తూంటారు కొందరు ఘరానా మనుషులు. ఈ బాపతు శాల్తీలలో ముందుగా చెప్పుకోదగ్గ వ్యక్తి ఆ ఎమ్మెల్యే (కోట శ్రీనివాసరావు). వేదికల మీద మహిళాజనోద్ధరణ గురించి బల్లగుద్ది గొంతు చించుకునే ఈయన చీకటి చాటున చాటు సరసాలకు మాత్రం సిద్ధమవుతూంటాడు. అలాంటి ఎమ్మెల్యే అండగా మగువల రక్త మాంస మాన ప్రాణాలతో వ్యాపారం సాగిస్తున్న గఫూర్ (నూతన్ ప్రసాద్) "ఇదేనండి నేను చెప్పిన లేడీసు సీత." అంటూ సీత (తులసి) వంక తిరిగి, "అయ్యగారికి దణ్ణంపెట్టు" అంటూ చల్లగా జారుకున్నాడు.

అయిన వాళ్ళ వల్ల దగాపడి, బయట ప్రపంచంలోని వంచనకు గురై, ఈ పాప పంకిలంలో కూరుకుపోయిన సీతకు ఎమ్మెల్యేని చూడగానే కారు చీకటిలో

## సినిమా

చిరు ఆశ చిగురించింది. ఎంతయినా ప్రజాసేవ అని గొంతు చించుకునే పెద్ద మనిషి కదా– తనకు సాయం చేయక పోతాడా అనుకుని ఆయన కాళ్ళమీద పడింది.

"నేనిప్పటికే జీవితంలో దగా పడ్డాను. అయినా.... నాతమ్ముడి కోసం .... కేవలం నా తమ్ముడి కోసం బతుకుతున్నాను. నన్ను రక్షించండి." అని మొర పెట్టుకుంది.

"ఒకసారి దగా పడ్డానంటున్నావ్ కదా? చూడు.... చన్నీళ్ళతో స్నానం చేసేటప్పుడు మొదటి చెంబు నీళ్ళకే ఒళ్ళు జలదరిస్తుంది. ఆ తర్వాత సల్లదనానికి బాడీ ఎడ్జస్ట్ అయిపోతాది. యభిచారం కూడా అంతే" అని గొప్ప పోలికను ఉటంకించిన ఆ ప్రజానాయకుడు జాలిగా చూస్తున్న సీతను మంచం మీదికి తోసేశాడు.

కాశీ విశ్వనాధ్ రచన, అట్లూరి రామారావు నిర్మాణ,

"పూజకు పనికిరాని పువ్వు" లో ప్రమీల, నూతన్‌ప్రసాద్, తులసి



## పి. సుబ్రహ్మణ్యం దర్శకత్వంలో "స్వప్న కిరీటం"

"బీభత్స, భయానక రసాలతో పాటు మంత్ర తంత్ర సమన్వితమైన డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ రచన 'స్వప్నకిరీటం' సీరియల్‌గా వెలువడి, పాఠకలోకాన్ని ఆకట్టుకుంది. ఎంతో స్కోప్ ఉన్న ఈ నవలకు దివాకర్‌బాబు రసవత్తరమైన సంభాషణలు రాశారు. డిసెంబర్‌లో పాటలు రికార్డవుతాయి. జనవరి నుంచి హైదరాబాద్ పరిసరాలలో షూటింగ్ జరుగుతుంది. అన్నారు పి. సుబ్రహ్మణ్యం. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే టి. ఎ. ఎస్. పిక్చర్స్ వారి పై చిత్రంలో చంద్రమోహన్, ప్రభాకరరెడ్డి, వేలు, వీరభద్రరావు, రమణ మూర్తి, పురాణం సూర్యం, రంజన్, ఆర్. దొరస్వామితో పాటు కొందరు నవ కళాకారులు కూడా పాల్గొంటారు. సత్యం సంగీతం, హరనాథ్ ఛాయ, రంజన్ సహకార దర్శకత్వంతో ఈ చిత్రాన్ని నిర్మించే టి. ఎ. సుబ్బారావు "మా నెల్లూరీయుడు శంకర్‌ను గాయకుడ్నిగా పరిచయం చేస్తున్నాం," అన్నారు. ఈ చిత్ర దర్శకుడు పి. సుబ్రహ్మణ్యం గతంలో "దొరికితే దొంగలు, పసిడి మనసులు, ఖైదీ కాళిదాసు" చిత్రాలకు ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపిన విషయం ప్రేక్షకులకు విదితమే.



చలికాలం నదిలో స్నానం చేసే సీను ఏమిటండి బాబూ! హాయిగా వేడినీళ్ల స్నానం చేసే సీను పెట్టక!

## కమలహాసన్ "డాన్స్ మాస్టర్"గా కె. బాలచందర్ దర్శకత్వంలో కె. ఎస్. రామారావు సమర్పణ

"డాన్స్ అసిస్టెంట్‌గా సినిమా రంగంలో ప్రవేశించి నేడు అఖిలభారత ఖ్యాతినార్జించిన కమలహాసన్ సరసన రేవతినాయిక. వినోదాత్మకమైన ప్రణయ గాథ", అన్నారు కె. ఎస్. రామారావు. ఈయన సమర్పణలో ప్రమోద్ ఆర్ట్ ఫిలిమ్స్ అధినేత కె. బెనర్జీ నిర్మించిన పై చిత్రంలో రేఖ, శ్రీవిద్య తదితరులు పాల్గొన్నారు. వసంతకుమార్ సంభాషణలు, ఇళయరాజా సంగీతం అదనపు ఆకర్షణలు. కె. బాలచందర్ దర్శకుడు.



"మంత్రాలయ శ్రీ రాఘవేంద్రస్వామి మహాత్మ్యం"లో రజనీకాంత్

## కోడి రామకృష్ణ డైరెక్ట్ చేసే శ్రీ లలిత కళాంజలి ప్రొడక్షన్స్ "ఇంటి దొంగ"

"అత్తగారూ స్వాగతం" అనంతరం "ఇంటి దొంగ" అనే చిత్రాన్ని నిర్మిస్తున్నట్లు వాకాడ అప్పారావు, దాట్ల రామకృష్ణంరాజు తెలిపారు. ఇందులో కల్యాణ చక్రవర్తి, అశ్విని, ప్రియ, వై. విజయ, ఏలేశ్వరం రంగా, జి. కె. రెడ్డితో పాటు ఈ చిత్ర దర్శకుడు కోడి రామకృష్ణ కూడా ఒక విలక్షణమైన పాత్రను నిర్వహిస్తారు. వాకాడ తాతయ్య సారథ్యం, బి. హెచ్. సూర్యచంద్రరాజు నిర్వహణతో కోడి రామకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఈ చిత్రం సూర్యకిరణ్ సమర్పణ.

"బ్రహ్మనాయుడు" లో కృష్ణంరాజు

## ప్రముఖ తారల టి. వి. సీరియల్ "సుప్రభాతం"

"హైదరాబాద్, తిరుపతి పరిసరాల్లో డిసెంబర్ 1 నుంచి 31 లోగా షూటింగ్ పూర్తవుతుంది. థీమ్ సాంగ్‌ను వేటూరి సుందరరామ్మూర్తి రాశారు. దానికి ఉషాకాంత్ బాణీ కూర్చారు. జర్నలిస్ట్ ఎ. హెచ్. వి. సుబ్బారావు రాసిన ఈ సీరియల్ హైదరాబాద్ కేంద్రంనుంచి జనవరి, ఫిబ్రవరి నెలల్లో ప్రదర్శింపబడుతుంది," అన్నారు ముంజులూరి భీమేశ్వరరావు. ఈయన దర్శకత్వంలో ఫ్లాష్ అడ్వర్టయిజింగ్ అండ్ మార్కెటింగ్ (హైదరాబాద్) సారథి కె. పాండురంగారావు సమర్పించే ఈ సీరియల్‌లో మురళీమోహన్‌తో పాటు కాంచన, సంగీత, రావి కొండలరావు, రాధాకుమారి అదిగాగలవారు పాల్గొంటున్నారు. హరనాథ్ ఛాయా గ్రాహకుడు.

## "గురుబ్రహ్మ"లో ఖవాలీ

ఆయన తన వృత్తిని బ్రతుకు తెరువుగా భావించలేదు.

ఏదో కావాలనుకుని మరేదో అయ్యానని విసుగు చెంది వృత్తికి ద్రోహం చేసే అందరి లాంటివాడు కాదాయన. వృత్తికి అంకితం ఆయన జీవితం ఆయనది. అవును ఆయనొక ఉపాధ్యాయుడు. పాత భాషలో చెప్పాలనుకుంటే గురువు. గురువును బ్రహ్మగా భావించే రోజులు పోయినా ఆయనంటే విద్యార్థులకూ, సహచరులకూ అమిత అభిమానం. ఇటువంటి వినూత్నమైన శంకరం మాస్టారి పాత్రలో నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు జీవిస్తున్నారు.

సుప్రసిద్ధ నిర్మాణ సంస్థ సురేష్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "గురుబ్రహ్మ" శరవేగంతో తన షూటింగ్ కార్యక్రమాలు జరుపుకుంటున్నది.

ఇందులో భాగంగా మూడో షెడ్యూలు షూటింగ్ కార్యక్రమం నవంబరు 2వ తారీఖు నుంచి 16వ తారీఖు వరకు హైదరాబాద్‌లో జరిగింది. 2వ తారీఖు హైదరాబాద్ పబ్లిక్ స్కూల్‌లోను, 3, 4 తేదీల్లో కేసరిగుట్టలోని శ్రీ రామలింగేశ్వర స్వామి గుడిలోనూ, 6, 7, 8 తేదీల్లో నగరంలో వివిధ ప్రాంతాల్లో షూటింగ్ జరిగింది.



"జైలు పక్షి"లో బేబీశాలిని, రాధిక



10, 11, 12వ తేదీల్లో అన్నపూర్ణ స్టూడియోలో సినిమాలో తలమానికంగా వుండే ఒక ఖవాలీ అత్యంత ఖరీదు, రమణీయమైన సెట్టులో తులసి, తాతినేని రాజేశ్వరి, నాగేశ్వరరావులపై చిత్రీకరించారు.

బయట జోరున వర్షం... శంకరం మాస్టారు కూతురి పెళ్ళికి కట్నం కొరకు వ్యధ చెందుతూ వర్షం బారినుండి తలదాచుకోవటం కొరకు ఆ యింటికొస్తాడు.

"మన సిచ్చానని చెప్పనా
మాటిస్తానని తప్పనా"

అంటూ ఖవాలీ మొదలవుతుంది.

సురేష్ వారి ఇరవై మూడేళ్ల చలన చిత్ర నిర్మాణ చరిత్రలో, వారి యీ తాజా చిత్రం "గురుబ్రహ్మ"లో తొలిసారిగా చిత్రీకరిస్తున్న ఈ ఖవాలీ ఎంతో హృద్యంగా వచ్చిందని అందరూ ప్రశంసించారు. ఈ పాట శ్రీ వేటూరి సుందరరామమూర్తి వ్రాయగా, చక్రవర్తి సంగీత సారధ్యంలో, శ్రావ్యంగా సుశీల గానం చేసారు.

యిటీవల నటనావకాశం ఉన్న సున్నితమైన పాత్రలలో బాగా గుర్తింపు తెచ్చుకున్న శరత్‌బాబు, ఈ చిత్రంలో ఒక వెరైటీ పాత్ర ధరించాడు. పరిస్థితుల ప్రాబల్యం వల్ల దొంగగా మారిన ఆ పాత్ర శరత్‌బాబుకి ఎంతో మంచి పేరు తెస్తుందని అందరూ అంటున్నారు.

2 పాటలు చిత్రీకరణ మినహా దాదాపు షూటింగ్ కార్యక్రమం పూర్తి చేసుకున్న యీ చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావు, శారద, శరత్‌బాబు, సత్యనారాయణ, చంద్రమోహన్, రాజేష్, వేలు, రమణారెడ్డి, మాడా, త్యాగరాజు, భీమరాజు, శ్రీలక్ష్మి, తాతినేని రాజేశ్వరి, మరియూ నూతన నటుడు రాజా, రజని జంటగా నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు బోయిన సుబ్బారావు, రచన: పరుచూరి బ్రదర్స్, సంగీతం: చక్రవర్తి, కెమెరా: యం. వి. రఘు, ఎడిటర్: మార్తాండ్, నిర్మాత: డి. రామానాయుడు.

## రాఘవేంద్రరావు, బాలకృష్ణలతో చలసాని గోపి చిత్రం

"మార్చినుంచి షూటింగ్," అన్నారు గోపి ఆర్ట్ పిక్చర్స్ అధినేత చలసాని గోపి. ఈయన బాలకృష్ణ హీరోగా కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మించే చిత్రానికి పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు వగైరా సాంకేతిక వర్గం.

## సంయుక్తా మూవీస్ కొత్త చిత్రంలో కోడి రామకృష్ణ, నాగార్జున

"ఉగాది నుంచి కొత్త పిక్చర్ షూటింగ్," అన్నారు డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి. ఈయన నాగార్జున హీరోగా నిర్మించే చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకుడు. □

"డాన్స్ మాస్టర్"లో కమలహాసన్, రేవతి



"ముద్దుల పాప"లో నదియా, రాజేష్, రెహమాన్



### బాంబే ఫ్లాష్ బ్యాక్

# సెంటిమెంట్స్



రమేష్ సిప్పీ

'సెంటిమెంట్' అనేది చాలాకాలంగా వాడుకలో వున్న పదం. ఏ మనిషైనా తాను సాధించిన విజయాలని బట్టి తనకంటూ ప్రత్యేకంగా ఓ సెంటిమెంట్ ఏర్పరచుకుంటాడు. ఆ సెంటిమెంట్‌ని పాటించకపోతే తాను విజయం సాధించలేడేమో అనుకుంటాడు. ఒక్కోసారి అదీ నిజమే అవుతుంది.



జె. ఓంప్రకాష్

కానీ కొందరి సెంటిమెంట్స్ చాలా విచిత్రంగా వుంటాయి. ప్రత్యేకించి చిత్ర పరిశ్రమలో నివారికి ఈ సెంటిమెంట్స్ మరీ ఎక్కువగా వుంటాయి!

నార్త్‌లో సూపర్‌హిట్ డైరెక్టర్ రమేష్ సిప్పీ సెంటిమెంట్ ఏమిటో. తెలుసా? తన ప్రతి చిత్రం టైటిల్‌ని 'ఎస్' అనే అక్షరంతో ప్రారంభిస్తాడు. 'ఎస్' అనే అక్షరం తనకి అదృష్టం తెచ్చింది అంటాడు రమేష్‌సిప్పీ. అందుకే తన ప్రతి చిత్రాన్ని ఎస్. అక్షరంతో ప్రారంభిస్తాడు. శక్తి, షాన్, షోలే, సీతా ఔర్ గీతా, సాగర్, ఇవన్నీ రమేష్ సిప్పీ చిత్రాలే!

అలాగే ప్రముఖ నిర్మాత జె. ఓంప్రకాష్ తను నిర్మించిన చిత్రాల నన్నిటినీ 'ఏ' అక్షరంతో ప్రారంభిస్తాడు. ఆయాసావన్ ఝూమ్‌కె, ఆయీ మిలన్‌కి బేలా, ఆన్‌మిలో– సజనా, అప్నాపన్, అర్పణ్, ఆషా, ఆప్‌కెసాత్, ఆఖిర్‌క్యోం ఇవన్నీ 'ఏ'తో ప్రారంభమయ్యాయి కదా!

వీటికంటే విచిత్రమైన సెంటిమెంట్ భారీ చిత్రాల నిర్మాత "అర్జున్ హింగోరానీ"ది. అతను నిర్మించే ప్రతి చిత్రానికీ "కె. కె. కె." మూడు 'కె' అక్షరాలు వచ్చేటట్లుగా పేరు పెడతాడు. కబ్–క్యోం ఔర్ కహా, కహానీ కిస్మత్‌కీ, కరిష్మాకుద్రత్‌కె, ఖేల్ ఖిలాడీకా, ఖాతిలోంకె ఖాతిర్ ఇవీ.... అతని చిత్రాల పేర్లు. అతను ఇటీవల నిర్మించిన చిత్రం 'సల్తనత్' అయినప్పటికీ ఆ చిత్రానికి ముందుగా పెట్టిన పేరు "కార్‌నామె కమాల్‌కె" కాకపోతే ఈ చిత్రానికి నిర్మాత అతని కొడుకు సునీల్ హింగోరాని అవటం వలన తన సెంటిమెంట్‌ని వదులుకున్నాడు.



అర్జున్ హింగోరాని



నాజిర్ హుస్సేన్

తాను నిర్మాతగా వ్యవహరించే ఏ చిత్రానికైనా మూడు 'కె' అక్షరాలు వచ్చే విధంగా పేరు పెట్టితీరుతాను అని ఇప్పటికీ అంటున్నాడు అర్జున్ హింగోరాని.

ఇవి ఇలా వుండగా..... కొంత మందికి కొన్ని చిన్న చిన్న సెంటిమెంట్స్ వుంటాయి. సుభాష్‌ఘాయ్‌కి తను స్వంతంగా నిర్మించే ప్రతి చిత్రంలో ఏదో ఒక సన్నివేశంలో తను కనిపించాలన్నది ఓ సెంటిమెంట్. ఫిరోజ్‌ఖాన్ కూడా తను నిర్మించే ప్రతి చిత్రంలోనూ– బెంగుళూరులోని తన సొంత ఇంటిని చూపిస్తాడు. అలాగే చిత్రంలోని పాత్రలకు తన పిల్లలపేర్లు పెడతాడు. అలాగే మిధున్ చక్రవర్తి తను నటించే



మిధున్ చక్రవర్తి

ప్రతి చిత్రానికి షూటింగ్ ముహూర్తానికి హాజరు అవడు. తను హాజరైన చిత్రం 'గంగా జమున సరస్వతి' చిత్రం అసలు విడుదలకు నోచుకోక పోవడంతో ఈ సెంటిమెంట్ ఏర్పరచుకున్నాడు. ఇలా చెప్పుకుంటూపోతే ప్రతి హీరోకి– ప్రతి నిర్మాతకీ.... ప్రతిహీరోయిన్‌కి ఏదో ఒక సెంటిమెంట్



సుభాష్ ఘాయ్

వుంటుంది. అందుకే ముగించేలోగా ఆశ్చర్యకరమైన సెంటిమెంట్ ఒకటి చెప్తున్నాను. అది ఏమిటీ... అంటే.... మ్యూజికల్ హిట్ చిత్రాల దర్శక నిర్మాత నాజిర్‌హుస్సేన్ తన ప్రతి చిత్రంలోనూ గాడిదకి ఓ పాత్ర ఇస్తాడు. కావాలంటే..... హమ్ కిసీసే కమ్ నహీ, జమానేకొ దిఖానాహై, మంజిల్ మంజిల్, తీస్రీ మంజిల్, యాదోంకి బారత్ చిత్రాలు మళ్ళీ చూడండి!! అప్పుడు చెప్పండి!!!

–బాలాజీ శ్రీరంగమ్



(గత సంచిక తరువాయి)

నాలుగు రోజులు పాఠం ఏకాగ్రంగా సాగింది.

కల్యాణి పూర్వంకంటె శ్రద్ధగా సాధన చెయ్యసాగింది పాలు, పలహారం తీసుకోకుండా తెల్లవారు ఝామునుంచీ ప్రొద్దున ఎనిమిదివరకూ వీణగాత్రం సాగేవి. మంగ ఆశ్చర్యపోయింది. తనకూతురు పెద్ద విద్వాంసురాలు అయినట్లే మురిసిపోయింది

"చూడు కల్యాణీ! నిన్ను నిద్రలేపి అష్టపది వాయించమన్నా కళ్ళు మూసుకుని వాయించాలి తెలుసా? నీకు బాగా చెప్పకపోతే గురువుగారు నన్ను తిడతారు. ఇంక తరువాత ఏం చెప్పను" అన్నాడు.

"మీకేం చెప్పాలంటే అది."

"అలాకాదు. మొదటిరోజు ఇంకా ఏవో అడిగావు..."

"అష్టపది, జావళి, పదం, తిల్లాన, రాగమాలిక, తరంగం "

గడగడా వల్లించింది కల్యాణి.

"సరే! పదం చెప్పనా? పదం కూడా మోహనరాగం లోనిదే చెబుతాను."

"అలాగే" నన్నట్లు తలూపిందామె.

"చూడు! మోహన పదం పాడేప్పుడు రాగాన్ని, భావాన్ని, స్పష్టంగా తెలపాలి."

"మీరెలా చెప్తే అలాగే చేస్తాను."

"ముందు పదం రచించిన క్షేత్రయ్య గారి గురించి తెలుసుకుంటావా?" అని అడిగాడు.

"సరే! ఈ రోజుకు వారి గురించి చెప్పండి, రేపు పాఠం నేర్చుకుంటాను "

జరిగిన కథ-4 : అక్షరాభ్యాసం రోజున సరస్వతీదేవిని పూజిస్తున్న కళ్యాణి దృష్టి దేవి చేతిలోని వీణపై పడుతుంది. అప్పటి నుండి ఆ అమ్మాయికి వీణ నేర్చుకోవాలనే కోరిక బలపడుతుంది. తల్లిదండ్రులు ఆమెకు ఓ గురువుగారిని కుదిర్చి వీణ నేర్పిస్తుంటారు. పట్టుదలతో సాధన చేస్తూ కళ్యాణి వీణలో నైపుణ్యం సాధిస్తుంది. యుక్త వయస్కురాలవుతుంది. గురువుగారు వృద్ధాప్యంలో పడి తీవ్రంగా జబ్బు పడతారు. గురువుగారు కూర్మయ్య అనే వ్యక్తిని తన స్థానంలో పంపుతారు. మొరటుగా కనబడుతూ, మొరటుగా మాట్లాడే కూర్మయ్య శ్రావ్యంగా పాడుతాడు. అతని ప్రవర్తనలోనూ, అలవాట్లలోనూ ఏమాత్రం సంస్కారం లేదని కళ్యాణి భావిస్తుంది. మంగకి అతనిపట్ల గౌరవం కలుగుతుంది. అతను కళ్యాణికి జయదేవుని అష్టపదులతో గాత్రం నేర్పడం ప్రారంభిస్తాడు.

"నీకు నేను ఎక్కువ సమయం వారి జీవితాలు చెప్తానని కోపగించుకుంటా. అందుకేనా ఈ రోజు పాఠం అవదంటున్నావు?"

"అదికాదు. సిద్ధాంతపరంగా తెలుసుకుంటే అభ్యాసంలో ఇంకా లోతుకు వెళ్ళవచ్చునని అన్నాను. వేరే ఉద్దేశ్యం లేదు."

సంజాయిషీ ఇచ్చుకునేటట్లన్నది.

"కాలం మారుతున్న కొద్దీ మనుషుల అభిరుచుల్లో మార్పు వస్తుంది. పూర్వం మొలలోతు నీటిలో నిలబడి, చేతిలో పాత్ర పట్టుకొని, చలిలో వణుకుతూ స్వరాలు పట్టేవారు. ఇప్పుడిప్పుడు ఆడపిల్లలు కూడా నేర్చుకుంటున్నారు. మీలాంటి సుకుమార శరీరం ఉన్నవారు, నీటిలో నిలబడ్డం మాటలుకాదు. అందుకని సిద్ధాంతపరంగా మీకు బోధిస్తే సంగీతంలోని మెళకువలు తెలుస్తాయి. ఒక్కో లక్షణకారుడు, వాగ్గేయకారుడు, ఎంతశ్రమకోర్చి మనకీ సంగీత విద్యను ప్రసాదించారో తెలుస్తుంది. అందులో సహస్రాంశమైనా శ్రమపడితే కానీ మనకీ విద్య అంటదు అన్న నిజం తెలుస్తుంది. రోజులు తరబడి, నెలల తరబడి బండసాధనే ప్రధానంకాదు దానివలన రాణించలేనివారున్నారు. మనసుకు కొంతపడితే తమలోని లోపం తెలుసుకునే విజ్ఞత వస్తుంది. అందువల్లనే నేనిలా సిద్ధాంతపరంగా బోధించడం చేస్తున్నాను ఇంక క్షేత్రయ్యగారి జీవితం తెలుసుకుందాం "

కల్యాణి తన చెవినీ మనసునీ కూడా క్షేత్రయ్యగారి జీవితం గురించి వినడానికి సిద్ధంచేసి మరీ కూర్చుంది.

"ఈయన (క్షేత్రయ్య) కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామానికి చెందినవారని అంటారు. వారు తెలుగు భాషలో చాలా గట్టివారు. ఆయనకు అలంకారశాస్త్రం, వాత్సాయనుని కామశాస్త్రం మొదలైన గ్రంథాలు కరతలామలకములు. దానికి ముఖ్య ఉదాహరణములు ఆయన గ్రంథాలే. రస నిర్వహణకు, అంగనారూపణకు, సుకుమారములైన భేదాలు వీరి రచనలో స్పష్టంగా కన్పిస్తాయి. కల్పనా రీతిలో మాటల పొందిక, పొందికలో ద్యోతకమయే రాగవిన్యాసము, రాగ స్వరూపము, పరిపూర్ణతను స్ఫురింప చేయడంలో వారికి వారేసాటి. రాగములందు, భావోద్రేకము కలిగింపగల స్వరసంగతులు తెలిసిన ప్రౌఢుడు. స్వానుభవ శృంగారాన్ని అత్యంత శృంగార రసపూరితంగా, రససిద్ధి కలిగించేలా పదములు రచించారు. ఈయన చిన్నతనంలోనే 'గోపాల మంత్రోపదేశం' పొందారట. మొవ్వలోనుండే గోపాలస్వామి గుడిలో మంత్రోపాసన చేసేవారట. గోపాలుడు ఈయనకు దర్శనమిచ్చి అనుగ్రహించారట. వెంటనే 'ఆనంద భైరవి' రాగంలో 'శ్రీపతి మరుబారి కోర్వలేక ఇదు వేడితి మువ్వగోపాల' – అని వాగ్గేయ కారక రూపంగా పదము చెప్పారట.

ఇది విని, రసికాగ్రేసరుడైన విజయరాఘవ భూపాలుడు ఈయనకు వివిధ రీతుల సన్మానించారట. తంజావూరు, మధుర, గోల్కొండ మొదలైన సంస్థానాలలో వివిధ సత్కారాలను పొందారు. వీరి అసలు పేరు వరదయ్య. పలుక్షేత్రాలను దర్శించడంవలన క్షేత్రయ్య అని పిలవబడేవారట గోపాల దర్శనానంతరం, జీవాత్మ, పరమాత్మలనే నాయికీ నాయకులుగా భావించి రచనలు చేశారు. జీవాత్మ, పరమాత్మ మధ్య ఉన్న 'మాయ'ను యువతిగా చిత్రించారు. దానికి చక్కని ఉదాహరణ 'ఇద్దరిసందున పవ్వళించియున్న ఇంతిపేరేమి' అనేపదం. శృంగార రసానికి జీవగఱ్ఱయైన కాంభోజిరాగాన్ని వీరు ఎక్కువగా వాడుకున్నారు. దుఃఖ వస్తువులు గల పదములకు "ముఖారి" "ఘంటా" "నాదనామక్రియ" "పున్నాగవరాళి' వంటి రాగాలు వాడుకున్నారు కల్యాణి, భైరవి, ఆనంద భైరవి రాగాలలో కూడా పదములు రచించారు. ఇలా చెప్పుకుంటూపోతే వారు రచించిన ప్రతీ పదము ఒకొక్క సజీవమైన రాగ, భావ, సమ్మిళితమైన శృంగార పదసోపానాలు స్వకీయ శృంగారాన్ని రచనలో జొప్పింప చేసే వారంటారు



ఇంక ఈ రోజు మోహనలోని "మగువా" అనే పదం పల్లవి చెప్పుకో." అని ప్రారంభించాడు

"మగువా తనకేళికా మందిరము వెడలెన్."

మగువా అని అతను అందుకోగానే కల్యాణికి భయం వేసింది. అష్టపది అంత సులువుగా లేదు. మగువా అన్నచోట వేసిన సంగతి ఎత్తుకోవడ మెలాగా అని ఆలోచిస్తోంది.

'ఏంటో, శ్రద్ధగా వినడంలేదు మోహినంటే ఇష్టంలేదా? హుసేని రాగంలో 'అలిగితే' పదం చెప్పమంటావా."

"లేదండీ! శ్రద్ధగానే వింటున్నాను. పట్టుబడటమే కష్టమనిపిస్తోంది." అంది.

"ఏం ఫర్వాలేదు. నీకు పట్టుబడేట్టు చేసే బాధ్యతనాది." అని-

మళ్ళీ మళ్ళీ పాడి ఎక్కడ గమకము, జారు, రవ ఇవ్వాలో చెప్పి పాడి వాయించాడు. అతను వెళ్ళిపోయినా ఆ రోజంతా కల్యాణి చెవులకు అతను పాడిన పల్లవే విన్పించింది.

రాత్రంతా కూర్చుని అదే వాయించి వాయించి మర్నాడు ఎప్పుడు తెల్లారుతుందా అనుకుంది. అతడెప్పుడొస్తాడో, ఎప్పుడు అనుపల్లవి నేర్చుకుందామా అని ఎదురు చూసింది

ఆరోజు ఉత్సాహంగా ఉన్న ఆమెను చూసి అతడూ సంతోషంగా,

"నేనూ సంగీతం చెప్పడానికి పనికొస్తాను" అన్నాడు.

"మీరు పనికి రారని ఎవరన్నారు?" అంది.

"నువ్వునన్ను చూసి నిరుత్సాహంగా ముఖంపెట్టేదానివి. పైగా అది కన్పించకుండా తలవంచేసే దానివి. ఈ రోజు ఆనందంగా ఉన్నావు" అతడి ధోరణిలోనే అన్నాడు.

"గురువుగారు చిన్నప్పటినుండీ తెలుసు. మీరుకొత్తవారు కదా, భయంగా ఉండేది."

"మరి ఈ రోజేమైంది?"

## రసరాగ వాహిని

"పదం, అనుపల్లవి నేర్చుకోవాలని ఉత్సాహంగా ఉంది." కల్యాణి సమాధానం చెప్పింది.

"సరే! ఇంక మాటలతో కాలం వృధా చేయను. విను, ముందు పల్లవి పాడతాను. నువ్వు నాతో కలిసిపాడు."

ఇద్దరూ కలిసి పల్లవి పాడారు. అతను అనుపల్లవి ఎత్తుకున్నాడు.

అ. వగకాడ మాకంచి వరద తెల్లవారేననుచు

"మగువా"

పల్లవికంటే అనుపల్లవి ఇంకా మనోహరంగా పాడాడనుకొంది కల్యాణి.

అనుపల్లవి వచ్చినవరకూ అతడెన్నిసార్లు పాడాడో ఆమెకీ తెలియలేదు. చరణం పాడడం మొదలైంది.

ч. "విడజారు గొజ్జంగి విరిదంత జడతోను
కడు చిక్కుబడి బిసగు కండసరితోను.
నిదుదా కన్నులదేరు నిమర మబ్బులతోను
తొ దరా పదయుగమునా తడబడెడు నడతోను
సొగసీ సొగసీయని వలపు సొంపు జూపులతోను
వగవగల ఘనసార వాసనలతోను
జిగిమంచు కెమ్మోవి చిగురుకెంపులతోను
సగము కుచముల విదియచందురులతోను
తరిలేపు సేయు సమ సురతబడలికతోను
జిరుత పావడ చెరగు జార్పిటతోను
ఇరుగడల కైదండ లిచ్చు తరుణులతోను
పరమాత్మమువ్వ గోపాల తెల్లవారెననుచు.

పదం పూర్తయింది. ఇంతకు ముందు వీణ నేర్చుకోవాలనీ ఎంతో ఆరాటం ఉండేది గురువుగారి దగ్గర నేర్చుకొనేప్పుడు కల్యాణికి కేవలం భక్తి గౌరవాలే ప్రధానంగా ఉండేవి. అదే ఇతడి దగ్గర నేర్చుకుంటుంటే వేరే విధంగా ఉంది. ఇంకా నేర్చుకోవలసింది చాలా ఉందనీ, ఒక మనిషి జీవితకాలం అంతా శ్రమపడినా చాలదనీ తెలిసింది.

మంగకి ఒకోసారి అదేమిటో అతడంటే చెప్పరాని ఆపేక్ష కలిగేది. ఆమెకు మగపిల్లలు లేరని చింత ఉంది. కల్యాణిని చూసి తృప్తి పడినా, ఏదో బాధ అంతరాంతరాలలో ముల్లులా కలికేది. తమ సాటి వారితో సమానంగా చూడలేదు. ఆప్యాయత వెల్లువలా వచ్చి అతడిని ఆదరంగా చూడమని తొందర పెట్టేది. ఆమె తెల్లారి లేచిన దగ్గర నుంచీ వచ్చే పోయే వారికి వండి వార్చే పక్కా గృహిణి. తన అభిమానాన్ని అతడికి తిండి పెట్టడంలోనే చూపగలదు. కల్యాణి ఇందుకు ససేమిరా అనేది. గురువు స్థానంలో ఉన్న అతడ్ని అంటరాని వాడిలా




చూడమంటే నచ్చదామెకి. కడుపు నింపితేనే ఆపేక్షా అన్నది ఆమె భావం.

ఇలా తర్జన భర్జనలు జరిగిన పిదప మంగ ఒక నిర్ణయానికి వచ్చింది. అతడికి కల్యాణికి పాఠం చెప్పే గదిలోనే భోజనం చేసే ఏర్పాటు చేసింది. అందుకు పని మనిషిని నియమించింది. అతడి గౌరవానికి ఏమాత్రం భంగం కలిగినా కల్యాణి ఎటూ ఊరుకోదు.

"అసలతను ఒప్పుకుంటాడా? నీపిచ్చి నీదే గానీ, ఎదుటి వారి మాట వినవు".

"బాగుందే! అతనికి నేను నచ్చజెపుతాను. పాఠం చెప్పి బండిపై వెళ్ళే సరికి వేళ మించుతుంది. ఎంత వయసులో ఉన్నా వేళ తప్పిన భోజనం అనారోగ్యం. చూడు. నేను వప్పిస్తాను. నీకు తల్లిని. అన్ని విధాలా అనుభవం ఉంది" అంది మంగ.

అలా తల్లీ కూతురూ ఒడంబడి అతడిని ఒక ఉన్నత స్థానంలో ఉంచారు. తల్లి కూడా కల్యాణి అతడికి ఒక గురువుకు చేసినట్లే చేయడం చూసి ఏమనలేదు. పనిమనిషి అతడు వెళ్ళిన తరువాత శుభ్రం చేసి వెళ్ళిపోయేది. ఒక రోజు కాస్త ముందుగా వచ్చింది. అతడి దగ్గరుండీ ఏది కావాలో చూస్తున్న కల్యాణినీ చూసింది. సంభ్రమాశ్చర్యాలు పట్టలేక,

"ఒరోరి కురుమయ్యా. నువ్వంట్రా! ఎవురో అనుకుంటి ని. నీకు విద్య పూర్తిగా వొచ్చిందా?" అని అతి చనువుగా అడిగింది.

అతడు కూడా చేటంత ముఖం చేసుకుని,

"ఓలప్పా నువ్వా! ఈఊరేకదూ నిన్నిచ్చింది. నీ యజమాని (భర్త) బాగున్నాడా?"

ఈమె అతడికి అప్పగారవుతుందా? అనుకుంది కల్యాణి. ఆమెను పట్టించుకునే ధోరణిలో వాళ్ళిద్దరూ లేరు.

"ఔన్రా! మరి, నువ్వు మాట్టరుగారి కాడికి ఎలిపోయినది మొదలు మమ్మల్ని మరిశావనుకున్నాం". అంది ఆపేక్షగా.

"అదేటప్పా! అలా అంటావు? ఏదో ఆరు నాకు విద్య నేర్పించడానికి విజినారం తీసుకెళ్ళినారు. సత్రవులో భోజనం సేసి సదివాను. తరువాత ఇంకా బాగానేర్చు కుందామని మా గురువు గారికాడే కెళ్ళినాను. ఆడుంటే సర్టిఫికేటు అంటే అదుంటే ఏదైనా ఉజ్జోగం వస్తదని మా గురువుగారే సేర్పినారు. సెలవుల్లో గురువు గారి కాడే నేర్సే వోడ్ని. ఇట్టా నాకు అదేలోకమైంది. మిమ్మల్ని మరుస్తానా?" అన్నాడు.

"ఏటో న్రా! మాలా దరిద్రంలో పొర్లాడకుండా, నువ్వయినా గొప్పోడివి కావాల" అప్పుడే గొప్పవాడయినట్లు మురిసి పోయిందామె.

"అప్పా! మనోళ్ళంతా బాగున్నారా? ఇంకేటి ఇశేషాలు"

"ఏం ఉంటయిరా? మనలోంటి వోరికి కట్టపడటం, ఇంతతిని తొంగోదం. ఏదో నీలాంటి అదృష్ట వంతుడు ఇలా బాగుపడితే సంతోషిత్తాం". అలా వదిలేస్తే ఆరోజంతా మాట్లాడుకునేట్టున్నారు.

"మీకు చుట్టమా మా సింహాచలం." ఉండబట్టలేక అడిగింది.

అతడికి అవకాశం ఇవ్వకుండా సింహాచలమే అందుకుంది.

"అవునమ్మాయిగారూ! ఈడు మా పిన్నమ్మ కొడుకు. చిన్నప్పటి నుండీ, ఏవో పాటలు పాడేవోడు. మా ఊర్లో ఉత్సవానికి సంగీతం మాట్టారు ఈడి గొంతు ఇన్నారు. ఈడు లల్లాయి పదాలే ఇంకా బాగా పాడినాడు. ఇంక సంగీతం నేరిత్తే బాగు పడతాడని ఆరితో తీసుకెళ్ళారు." అంది.

"వస్తానప్పా!" అని కల్యాణి వైపుతిరిగి-

"నీకు రేపు కొత్తపాఠం ఏం చెప్పమంటావు?" అని ఏమాత్రం అధికారం తగ్గకుండా అడిగాడు.

గొప్ప సాధకుడు. అందుకే గొంతులో ఇప్పటి వరకూ అప్పగారితో ఆప్యాయత, శిష్యురాలితో ఆజ్ఞాపన వెంట వెంటనే మార్చాడు.

"జావళి, తిల్లాన నేర్చుకోవాలి." అంది.

"సరే!" కొమ్మరో వానికెంత బిగువే". అని ఖమాసు రాగంలో జావళి చెప్తాను." అని మంగకి నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఇలా కొన్ని నెలలు గడిచాయి. కల్యాణికి జావళీ, తిల్లానా యే కాక సంగీతంలో చాలా మెళకువలు చెప్పాడు. అతని పేరు కురుమయ్యనీ, గురువు గారు ఆప్యాయంగా కూర్మయ్యని పిలుస్తారనీ తెలిసింది. మంచి మంచి రచనలు



# పెన్నిధి మీ సన్నిధిలో...



కొనండి!

## 'ఇందిరా వికాసపత్రం'

ముఖ్య లక్షణాలు :

- ఈ సర్టిఫికెట్లు 500 1000 రూపాయల మొత్తాలలో లభిస్తాయి మీరు చెల్లించే మొత్తం కేవలం రూ 250 500 రూపాయలు మాత్రమే
- వీటని ఎటువంటి దరఖాస్తు అవసరం లేకుండానే కొనగోలు చెయ్యొచ్చు
- పోస్టాఫీసుతో పని లేకుండానే వీటిని ఒక వ్యక్తి నుండి వేరొక వ్యక్తికి బదిలీ చేసుకోవచ్చు
- వీట కొనగోలుపై పరిమితి లేదు
- వీటని ఎవరైనా కొనవచ్చు సర్టిఫికెట్లపై కొన్నవారి పేరు వుండదు
- 5 సంవత్సరాల గడువు ముగిసిం తర్వాత అది కొనగోలు చేయబడ్డ పోస్టాఫీసు లోనే నగదు చేసుకోవాలి

**19-11-1986 తేదీ నుండి లభిస్తాయి!**

5 సంవత్సరాలకే మీ పెట్టుబడి రెట్టింపు

మీరు చెయ్యాల్సిందంతా ఇంతే – అవసరమైన నగదు చెల్లిస్తే చాలు సర్టిఫికెట్లు లభిస్తాయి!



వివరాలకు ·

మీ దగ్గరలోని పోస్టాఫీసులోగాని, కలెక్టరు కార్యాలయంలోని ప్రత్యేక తాసిల్దార్ని గాని సంప్రదించండి.








చిన్న మొత్తాల పొదుపు సంస్థ

తిలక్ రోడ్, ఆబిడ్స్, హైదరాబాదు

## రసరాగ వాహిని

కూడా చెప్పాడు

పనిమనిషి సింహాచలానికి కూడా తమచుట్టం అమ్మాయిగారి గురుస్థానంలో ఉండటం గొప్పగా ఉండేది. అతడికి కేవలం అమ్మగారి ఆజ్ఞతో చేసేదికాదు. తమచుట్టం అన్న ఆప్యాయత, అభిమానం ఆమెని అతనికి చేసేట్టు చేసింది.

కల్యాణికి కూడా మొదట్లో లాగ అతని యాసంటే విసుగులేదు. ఎంత విద్య నేర్చినా జన్మతః వచ్చిన భాష ఎక్కడికి పోతుందని సరిపెట్టుకుంది.

అతడు బోధించే పద్ధతి నచ్చింది. అతడి కంఠమాధుర్యం అత్యంత ప్రీతి పాత్రంగా మారింది. తను అతనితో ఎటూ సరితూగలేదు. అతడిలాగే లీనమయి పాడాలి. అది మాత్రం ఆమె గమ్యం అయింది.

గురువుగారు లేచి తిరుగు తున్నట్టు కబురు వచ్చింది.

బండిపై ప్రయాణం శ్రమ ఇస్తోందనీ, తట్టుకో లేరనీ అందరూ చెప్పారుట కూర్మయ్య ఆమెకి చెప్పడం ఆయన ఆదేశమైంది. మధ్య మధ్య అతడి ద్వారానే ఆమెలా నేర్చుకుంటున్నదీ తెలుసుకునే వారు. ఆమెకి అతడు శ్రద్ధగా చెప్తున్నాడంటే తనకెంతో సంతృప్తి అనేవారు ఇంటివద్ద శిష్యులను కూర్మయ్య సహాయంతో చూసుకునేవారు.

అదే సమయంలో కూర్మయ్య స్నేహితునికి విజయనగరం సంగీత కళాశాలలో ఉద్యోగం దొరికింది. ఆ సంవత్సరం ప్రతీ సంవత్సరం లాగానే వినాయక నవరాత్రులు బాగా జరుగుతున్నాయి. కూర్మయ్య కచేరీ ఏర్పాటు చేయబడింది. ఆరోజు పాఠం చెప్తూ కల్యాణితో,

"కల్యాణీ! నువ్వు స్టేజిపై భయం లేకుండా వాయించ గలవా?" అన్నాడు.

అతడి ప్రశ్నకు కల్యాణి ఆనందాశ్చర్యాలతో ఉక్కిరి బిక్కిరి అయింది.

"నేనేమిటి? స్టేజిపై వాయించడమేంటి?" అంది.

"లేదు కల్యాణీ! ఎంతో శ్రమ కోర్చి నేర్చుకున్నావు. కాలు క్రిందపెట్టకుండా సుకుమారంగా పెరిగావు. వేళ్ళు కాయలు కాసేలా, గంటలు, గంటలు సాధన చేశావు. అందరుఆడపిల్లల్లా నీకు ఏ వ్యామోహం లేదు. అంతులేని విద్యా తృష్ణ ఉంది".

అతని గొంతులో ఆజ్ఞాపన స్థానే మార్దవం చోటు చేసుకొంది.

"ఏమిటీ రోజు ఎన్నడూ లేంది పొగుడుతున్నారు?"

ఆశ్చర్యంగా అన్నది కల్యాణి.

"ఏం లేదు కల్యాణీ! నా స్నేహితునికి మహారాజా గారి దయవల్ల విజయనగరం కళాశాలలో ఉద్యోగం దొరికింది. అందరిలా హోదా పెరగగానే స్నేహితులను మరువలేదు. నాకచేరీ ఏర్పాటు చేయించాడు. నా గాత్ర కచేరీ రద్దు చేసి దాని బదులు మనిద్దరి వీణ యుగళం పెట్టించాలను కుంటున్నాను".

"వద్దు! మీ కంఠ మాధుర్యం ఒక్కనాకే పరిమితం చేయకండి. నాకు అవకాశం ఇవ్వడానికి, మీ గాత్ర కచేరీ రద్దు చేయవద్దు". అంది.

"భలేదానివి కల్యాణీ! నేను కచేరీలు చేయాలంటే మరి అవకాశాలే రావా? నువ్వంటే ఆడపిల్లవు. ముందు ముందు పెళ్ళవుతుంది. నీ అత్తవారు చేయనివ్వక పోవచ్చు. మీ నాన్న గారు ఎంత మంచి వారో నాకు తెలుసు నేను అడుగుతాను".

"ఛాంది! నేనసలు పెళ్ళి చేసుకోను. నా వీణే నాకన్నీను. ఇంకెప్పుడూ నాదగ్గర పెళ్ళి అని అనకండి".

"సరే! నాతో వాయించు. ఇంకెప్పుడూ నీ పెళ్ళి ప్రసక్తి తేను."

"మీ ఇష్టం".

అతడు కల్యాణి తండ్రికి ఏం చెప్పి ఒప్పించాడో ఆమెకైతే తెలియదు. ఆయన అంగీకరించారు. తల్లి కూతురికి సహాయంగా ప్రయాణమైంది. రెండు రోజుల ముందుగానే వెళ్ళారు.

మంగ బంధువులు విజయనగరంలో ఉన్నారు. వారింట్లో తల్లీ కూతుర్లకు భోజన వసతి సదుపాయాలు బాగా అమిరాయి. కల్యాణికి సాధన చేసుకోడానికి వారి డాబాపై గది ఇచ్చారు. ఆమెకు ప్రశాంతంగా ఉండేట్టు ఏర్పాటు చేశారు.

(ఇంకాఉంది)

# సీక్రెట్ ఏజెంట్ విక్రమ్

మోహన్ * దిలీప్ కదమ్

16

































(ఇంకా ఉంది)




సంధ్య వెలుగు, కార్పొరేషన్ వాళ్ళ వీధి దీపాల కలయిక ఆ ప్రదేశానికి వింత అందాన్ని తెచ్చింది

మాధవరావు, జానకి ఆ సిమెంట్ బెంచి మీద అరగంట నుండి ప్రక్క, ప్రక్కనే కూర్చొన్నా ఇద్దరి మధ్య మౌనరాగమే రాజ్యమేలుతుంది

హుస్సేన్ సాగర్ మీదుగా వీచే చల్లని గాలి మాధవరావు మనసుని ఏ మాత్రం చల్లబరచటం లేదు

ఆయన భార్యకు గత ముప్పై అయిదు సంవత్సరాల అనుభవం తెలిపింది, ఆయన మౌనానికి అర్థం తీవ్రమైన మానసిక సంఘర్షణ అని అందుకే తానుగా ఇంత వరకు మాట్లాడలేదు

దూరంగా నౌబత్ పహాడ్ మీదనున్న బిర్లా మందిర్ వైపు చూసింది నియాన్ లైట్ల కాంతి పాలరాతి మందిరానికి మరింత అందాన్ని తెచ్చింది శరత్‌కాలపు వెన్నెల దానికి తోడైనది

కోవెలకు వెళ్ళి వద్దాం రండి అన్నది జానకి

'లేదు జానకి, మైలబడిన వాళ్ళు దేవుని మందిరంలోనికి వెళ్ళగూడదంటారు" ఆయన మాటలలోని అంతరంగం, ఆమెకు అర్థం కాలేదు వివరణ అతనే చెప్పుతాడని ఆగిపోయింది

టాంక్‌బండ్ మీద జనం రద్దీ పెరిగింది ఓ జంట ఐదేళ్ళ పాపతో నడుస్తూ దగ్గర నుండి వెళ్ళటం జానకి చూసింది తనకు కొడుకు, కోడలు, మనమడు గుర్తుకొచ్చారు

మాధవరావు ఉద్యోగం నుండి రిటైర్ అయి రెండు సంవత్సరాలు అయ్యింది స్వంత ఊళ్ళో పొలాలు, ఇల్లు ఉన్నా కూతురైనా, కొడుకైనా శేఖర్ ఒక్కడే అవటం వలన, రిటైర్ అవగానే భార్యాభర్తలిద్దరు హైదరాబాద్ వచ్చేసారు

రాత్రి 8 గంటలయ్యింది పున్నమి వెన్నెల హుస్సేన్ సాగర్ నీటిపై బడగానే నీళ్ళు వెండిలా మెరుస్తున్నాయి

"జానకీ నీతో ఒంటరిగా మాట్లాడాలనే, కోడలు లక్ష్మితో కోవెలకు వెళ్ళి వస్తామని చెప్పి నిన్ను ఇక్కడకు తీసుకొచ్చాను మాట్లాడే ముందు నీకో ఉత్తరం ఇస్తాను చదువు' అంటూ జేబులోంచి ఉత్తరం తీసి ఇచ్చాడు మాధవరావు.

ఉత్తరంలో వ్రాత జానకికి చిరపరిచితమైనదే ఎందుకంటే అది వ్రాసింది తన కొడుకు శేఖర్ కాబట్టి, శేఖర్ పది రోజుల క్రితం ఢిల్లీలో ఆఫీసు పని ఉన్నదని చెప్పి వెళ్ళాడు

ఆమె వీధి దీపాల వెలుగు, వెన్నెల వెలుగు సహాయంతో ఉత్తరంలోని ఒక్కో పదం చదువటం ప్రారంభించింది కళ్ళజోడు లేకుండా చదవలేక పోతుంది అయినా కష్టపడి చదువుతుంది ఆమె

మాధవరావు మనసు గతంలోనికి పోయింది జానకి ప్రసవ వేదన, మాధవరావుని కదిలించి వేసింది ఇష్ట దైవానికి ఈ గండం గట్టెక్కాలని మనసులో మొక్కుకున్నాడు.

కొడుకు పుట్టాడని తెలియగానే ఆనందంతో పాటు, గర్వం కలిగింది, తాను తండ్రి అయినందుకు.

"అంతా మీ పోలికే అని అంటున్నారు అబ్బాయిని చూసారా?" అన్నది జానకి

తనకు పోలికలు గుర్తుపట్టటం కష్టమే అయ్యింది మరీ అంత చిన్న పాపాయితో పోలికలు దొరకటం కష్టమే మరి ఈ పెద్దవాళ్ళు ఏ విధంగా పోలికలు పసికట్టి చెప్పుతారో మాధవరావుకు అర్థం కాలేదు

"నీ బాధ చూసిన తర్వాత పిల్లలే వద్దనుకొన్నాను అన్నాడు మాధవరావు.

ఏ ముహూర్తంలో ఆ మాట అన్నాడో – ఆ తర్వాత వాళ్ళకు ఎల్లలు పుట్టలేదు

శేఖర్ అపురూపంగా పెరిగాడు ప్రతి క్లాసులోను మొదటి నలుగురి లో ఒకడిగా వచ్చాడు. అందుకే ఇంజనీరింగ్‌లో సీటు రావటం కష్టం కాలేదు ఇంజనీరింగ్ పూర్తి అవగానే కంప్యూటర్ టెక్నాలజీలలో రిసెర్చ్ కమ్ స్టడీ కోసం శేఖర్ టెక్సాస్‌కు వెళ్ళాడు స్టేట్స్ నుండి రాగానే శేఖర్‌కు వెంటనే ఉద్యోగం దొరికింది

లక్ష్మి ఎస్ ఎస్ సి వరకు చదివింది రూపంతో పాటు సుగుణాల రాశి మాధవరావు బాల్య స్నేహితుని కూతురు కూడ అవటం వలన ఆ సంబంధం, తాను, జానకి మరింత ఇష్టపడి శేఖర్‌కు పెళ్ళి చేశారు

లక్ష్మి అవటానికి కోడలే అయినా వాళ్ళిద్దరు కూతురుగానే చూసారు లక్ష్మి కూడ వాళ్ళను అత్త–మామల్లా గాక తల్లి దండ్రులుగానే చూసింది

మాధవరావుకు అరవై సంవత్సరాలు ఈ వయసు ఏ సంఘర్షణలను తట్టుకో లేనిది. ప్రశాంతంగా గడప వలసిన కాలమిది

ప్రశాంతంగా ఉన్న కొలనులో రాయి విసిరినట్లయింది ఈ రోజు వచ్చిన ఉత్తరం శేఖర్ పది రోజుల క్రితం ఢిల్లీకి వెళ్ళుతున్నానని చెప్పటం, ఇంత వరకు రాలేదు

ఆవిధంగా టూర్సు మీద వెళ్ళడం అలవాటే కాబట్టి ఆయనకు ఏమాత్రం అనుమానం రాలేదు

ఈ రోజు వచ్చిన ఉత్తరం శేఖర్ ఢిల్లీ వెళ్ళలేదని పది రోజులుగా హైదరాబాద్‌లోనే ఉన్నట్లు, మరో ఇంట్లో మరో భార్యతో, సంసారం చేస్తున్నట్లు తెలిసింది.

జానకి ఉత్తరం చదవటం పూర్తి అయ్యింది జోడు లేకుండా చదవటం వలన, ఆమె కళ్ళు నెప్పి చేసాయి కళ్ళలో నీరు నిండుకొన్నది

ఆమె మనసులో ఆ ఉత్తరం లోని వాక్యాలే పదే, పదే గుర్తుకొస్తున్నాయి

లక్ష్మి తనకు సరైన భార్య కాదంట తన చదువు స్టేటస్‌కు తగని దంట మరి ఈ విషయం పెళ్ళికాక ముందు ఎందుకు గుర్తుకు రాలేదో ఆమెకు అర్థం కాలేదు

శేఖర్ తనతో పాటు ఉద్యోగం చేస్తున్న పోస్టు గ్రాడ్యుయేట్‌ని సొసైటీ, స్టేటస్ నిలబెట్టు కోవటానికి పెళ్ళి చేసుకొన్నాడంట లక్ష్మికి ఇష్టమైతే మరో పెళ్ళి చేసుకోవచ్చుని తాను విడాకుల కాగితాలు పంపనున్నట్లు వ్రాసాడు

పుత్రోత్సాహం, పుత్రుడు పుట్టినందుకు కాదు పెరిగి ప్రయోజకుడు అయినప్పుడని పెద్దవాళ్ళు అన్నది నిజమే అని జానకి అనుకొన్నది

పొరపాటు ఎక్కడ జరిగింది తన పెంపకంలో ఏ లోటు లేదే. మరి శేఖర్ అలా ప్రవర్తించటానికి కారణం ఏమిటి? అమెరికాలో చదువు కొన్నంత మాత్రాన, అమెరికా పద్ధతులు అలవాటు పరుచుకోవాలని ఉన్నదా? ఎంత మంది వెళ్ళి రావటం లేదు అందరు ఇలాగే మారి పోతున్నారా" లేదే– ఇది మేము చేసుకొన్న కర్మకు ఫలితమా" ఆమె మనసు వాపోయింది

మాధవరావు– మైల పడిన వాళ్ళు కోవెలకు వెళ్ళకూడదని ఎందుకన్నాడో అర్థం అయ్యింది–

ఆ ఉత్తరం చదివిన క్షణానే శేఖర్ చనిపోయినట్లుగా భావించాడని ఆమెకు అర్థం అయింది మాధవరావు నిర్ణయం, జానకికి వింత అనిపించలేదు.

'జానకి! ఈ పరిస్థితిని లక్ష్మి తట్టుకోగలదా?'

'అసలీ విషయం తెలపటం ఎలా"' ఆమె ఆవేదన.

అప్పుడే రాత్రి 9 గంటలు దాటింది. లక్ష్మి గడియారం వైపు మరోసారి చూసింది. కోవెలకు వెళ్ళిన అత్త మామలు ఇంకా ఎందుకు తిరిగి రాలేదో అర్థం కాలేదు ఆదుర్దాగా ఎదురు చూస్తోంది.

బాబుకు నిద్రవస్తుంది ఆవులిస్తున్నాడు అయినా బలవంతంగా మేలు కొనే ఉన్నాడు, తాతయ్య కోసం, ఆయన చెప్పబోయే క్రొత్త




కథకోసం.

'బామ్మ, తాతయ్య ఇంకా రాలేదేమ్మా?" బాబు ప్రశ్నించాడు "వస్తారు. బాబు నీవు నిద్రపో చాల ప్రొద్దు పోయింది' అంటూ వాడిని నిద్ర బుచ్చింది.

వరండాలోకి వచ్చి వీధి వైపుకు చూస్తూ ఉండి పోయింది లక్ష్మి ఇంటి ముందున్న నందివర్ధనం విరగ బూసింది. వెన్నెలలో వాటి అందం మరింత హెచ్చింది

ఈ పదిరోజులుగా తన మనసులోని సంఘర్షణ ఇంత వరకు బయట పెట్టలేదు పది రోజుల క్రితం శేఖర్ ఇల్లు వదిలి వెళ్లేటప్పుడు అన్న మాటలే ఆమెకు, పదే, పదే గుర్తుకొస్తున్నాయి.

'లక్ష్మి' నా నిర్ణయం మారదు. నీవు కోర్టు కెళ్లితే నీకు న్యాయం నీవైపే తీర్పు చెప్పుతుంది. న్యాయం. చట్టం మనసుని బలవంతంగా కట్టి ఉంచలేవు. మనసు లేని నాతో గడపటం నీకు కష్టమని. నీకూ తెలుసు నా లాయరు విడాకులు కాగితాలు పంపిస్తాడు సంతకం చేసి పంపుతావని ఆశిస్తాను అమ్మ, నాన్నలకు ఈ విషయం ఉత్తరం ద్వారా తెలియ జేస్తాను అంటూ వెళ్లి పోయాడు శేఖర్

అత్త ఎప్పుడు అత్తలా ప్రవర్తించలేదు. అమ్మలా కడుపులో పెట్టుకుంది. అలాంటి వాళ్లకు వాళ్ల కొడుకు గురించి తానుగా చెప్పి మనస్తాపానికి గురి చేయటం, ఇష్టం లేక మౌనం వహించింది ఆమె

ఈ రోజు పోస్టులో ఏదో ఉత్తరం మామయ్య పేరు మీద వచ్చింది. పోస్టు మాన్ వరండాలో ఉన్న ఆయనకు ఇచ్చి వెళ్లాడా? ఒక వేళ ఆ ఉత్తరం శేఖర్ నుండి వచ్చింది కాదు కదా' ఆమెకు అనుమానం వచ్చింది. అదే నిజమైతే వాళ్ల మానసిక పరిస్థితి ఎలా ఉన్నదో కదా? లక్ష్మి ఆందోళన చెందింది.

ఇంటి ముందు ఆటో ఆగిన చప్పుడు. మరో నిముషంలో మాధవరావు, జానకి ఇంట్లోకి అడుగు పెట్టడం చూసింది లక్ష్మి. వాళ్ల మొహాలలో ఆవేదనను కప్పి పుచ్చటానికి వాళ్ళు చేసే ప్రయత్నం గమనించిన లక్ష్మి, తాను అనుకొన్నది నిజమేనని ఎంచింది ఆ ఉత్తరం శేఖర్ నుండి వచ్చిందే. అందుకే వాళ్ల పరిస్థితి అలా ఉన్నదని అనుకొన్నది.

రాత్రి 12 గంటలు దాటింది జానకి నెమ్మదిగా లక్ష్మి గదిలోకి వచ్చింది. లక్ష్మి, బాబు నిద్రపోతున్నారు. కిటికీలో నుండి వెన్నెల మంచంపై పడుతుంది. వెన్నెల వెలుగులో బాబు మొహం ఎంతో అమాయకంగా కనపడింది జానకికి, ఇదే వయస్సులో అంటే ఐదేళ్ళ వయస్సులో శేఖర్ మొహం కూడ ఇంతే అమాయకంగా ఉండేదికదూ' జానకి మనసులో అనుకొన్నది మరి ఇప్పుడు జరిగినదేమిటి? జానకి నెమ్మదిగా లక్ష్మి ప్రక్కన కూర్చొంది కురులపై చేయి వేసింది. లక్ష్మి కలత నిద్ర చెదిరింది అత్త చేయిని తన చేతిలోనికి తీసుకొన్నది లక్ష్మి.

"నిద్రరావటం లేదా? తల్లీ" జానకి అడిగింది.

"పడుతుంది అమ్మా? నీకు రావటం లేదా?" లక్ష్మి ప్రశ్నించింది.

"లక్ష్మి! శేఖర్..." అంటూ చెప్పబోయింది.

# ధర్మపథం



## విధి నిర్వహణ

"చంక దుడ్డు – శరణార్థి" అనే సామెత ఉన్నది. ఇది దుష్టులను ఉద్దేశించి చెప్పబడింది. వారు, ఇతరులకు తీరని అపకారం చేయదలస్తూనే వారి వల్ల ఉపకారాన్ని కోరుతారు. అది, తల పగులగొట్టడానికి చంకలో దుడ్డు కఱ్ఱ పెట్టుకొని, అతన్నే శరణు జొచ్చి నట్లుంటుందన్నమాట! కొన్ని సందర్భాల్లో ఇది ఉత్తముల పట్ల కూడా వర్తిస్తుంది. స్వధర్మ నిర్వహణలో వారు అలా చెయ్యవలసి వస్తుంది.

శశిధ్వజుడనే రాజు గొప్ప విష్ణుభక్తుడు. అతని భార్య సుశాంతాదేవి కూడా భక్తురాలే! ఆ రాజు మీదికి శ్రీవిష్ణువు అవతారమూర్తి అయిన కల్కి, తన సహచరులతోనూ, సేనలతోనూ యుద్ధానికి వెళ్ళాడు. శశిధ్వజుడు ఉత్తమ క్షత్రియుడు. క్షత్రియ ధర్మాన్ని తప్పక నిర్వహించే వాడు. అందువల్ల యుద్ధానికి సంసిద్ధుడైనాడు. ఆయన దేవి కల్కి రూపమైన శ్రీహరితో యుద్ధం తగదని చెప్పుతుంది. శశిధ్వజుడు "దేవీ! శ్రీకృష్ణ భగవానుడే, యుద్ధానికి వెనుదీసిన అర్జునుడికి "నీవు క్షత్రియుడవు. వెనుదీయక యుద్ధం చెయ్యడం నీ ధర్మం. క్షత్రియ ధర్మం విడువరాదు" అని హితాన్ని ఉపదేశించాడు. నేను నా ధర్మాన్ని నెరవేర్చక తప్పదు. త్రిమూర్తులెదిరించినా, వారిని ఎదుర్కోవలసినదే! యుద్ధంలో మరణించానా, ఆయన చేతిలో మృతి చెందడం వల్ల మోక్షం తప్పక లభిస్తుంది. జయించేనా, కీర్తి లభిస్తుంది. ఏదయినా నాకు మేలే" అని చెప్పి తన కుమారులతోనూ, సైన్యంతోనూ యుద్ధరంగంలోకి దూకుతాడు. రెండు పక్షాలకూ యుద్ధం ఘోరంగా జరిగింది. చివరకు శశిధ్వజుని దెబ్బకి కల్కి మూర్ఛ పోవడం జరిగింది. మూర్ఛిల్లిన కల్కిని రాజు తన నగరానికి తీసుకొని పోయి, అంతఃపురంలో పాన్పుపై పరుండ బెట్టి, సుశాంతాదేవితో కూడా సేవ చేసి, తెలివి తెప్పించాడు. రణరంగంలో ఉండిన తాను రాజాంతఃపురంలో ఉండడం కల్కికి ఆశ్చర్యం కలిగించింది. అతని యెదుట శశిధ్వజుడు నిలిచి చేతులు జోడించి "దేవా! నేను నీ పట్ల మహాపరాధం చేశాను. దండనార్హుడను. తగిన శిక్ష విధించు" అన్నాడు. కల్కి చిరునవ్వు నవ్వుతూ "రాజా! నీవు నన్ను ఓడించావు. ఓడినవాడు విజేతకు శిక్ష విధించడమేమిటి? నీవు క్షత్రియుడవు కాబట్టి నీ ధర్మాన్ని నీవు నిర్వహించావు. నీవు నాకు భక్తుడవు కాబట్టి, భక్తురాలైన నీ దేవితో కూడా నాకు సేవలు చేస్తూ, భక్తుడుగా నీ ధర్మాన్ని పాటించావు. ఇదీ నీ విధిని నీవు నిర్వహించినట్లే కదా!" అని పలికి, ఆ దంపతులకు ఎంతో సంతృప్తినీ, సంతోషాన్నీ కలిగించాడు.

తర్వాత ఆ రాజ దంపతుల కోరిక పయి రాజకుమారి అయిన రమాదేవిని కల్కి వివాహం చేసుకున్నాడు.

ఇట్లు శశిధ్వజుడు క్షత్రియుడుగానూ, విష్ణుభక్తుడుగానూ కూడా తన విధులను నిర్వహించాడు.

-బులుసు వేంకట రమణయ్య

---

నాకు అంతా తెలుసమ్మా!" చూపులు మరల్చింది లక్ష్మి ప్రక్క గదిలో ఉన్న మాధవరావుకు తలుపు తీసే ఉండటం వలన వాళ్ళిద్దరి మాటలు వినబడుతూనే ఉన్నాయి ఎందుకంటే అతను నిద్రపోవటం లేదు కనుక

"లక్ష్మి! ఇక నుండి కూతురైనా, కొడుకైనా, కోడలైనా అన్నీ నీవే నమ్మా మాకు రేపె మనం మన ఊరు వెళ్ళిపోదాం

వాడికి సరైన శిక్ష పడాలి నీలో లేని దేనికోసం వాడు ఆరాట పడుతున్నాడో అర్థం కావడం లేదు ఆమె కంఠం దుఃఖం తో పూడుకు పోయి బొంగురుగా వినబడుతుంది

'న్యాయం, చట్టం అతకని, మనసుల్ని అతకవు కదమ్మా! అతను పంపె కాగితాల మీద సంతకం

## ఉషోదయం

చేయటానికి నేను సిద్ధంగా ఉన్నాను నీవు అన్నట్లు మనం మన ఊరు వెళ్ళిపోదాం బాబుని పెంచటం లోనే ఆనందాన్ని వెదుక్కొంటాను ఇన్నాళ్ళూ మీరిద్దరు అమ్మ– నాన్నలకన్నా మిన్నగా చూసారు ఈ ప్రేమే కలకాలం ఉంటే అదే నాకు శ్రీరామరక్ష" అంటూ చేతులు జోడించింది లక్ష్మి

లక్ష్మి రెండు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొన్నది జానకి

'లక్ష్మి! నా కొడుకు! అంటే నీ భర్త ఎలాగు చనిపోయాడు మిగిలిన నీవు, బాబు మాకు భారం కారమ్మా! ఆస్తి అంతా బాబు పేరే వ్రాసేద్దాం మరో విషయం తల్లీ! భర్త చనిపోయిన ఆడది మంగళ సూత్రం ఉంచుకో గూడదు." అంటూ ఆమె మెడలోని సూత్రాన్ని తీసి వేసింది జానకి.

లక్ష్మి ఆమెకు అడ్డు చెప్పలేదు.

"పసుపు, కుంకుమ, గాజులు మొగుడు కన్నా ముందుగానే ఆడదాని జీవితంలోకి వచ్చాయి. మొగుడుతో పోవాల్సింది. అతను కట్టిన ఆ తాళి బొట్టే- కుంకుమ, గాజులు కావు" అంటూ గదిలో నుండి బయటకు నడిచింది జానకి

రేపు తాను– మనుమడు శిరోముండనం చేయించు కోవాలి. తండ్రి పోయినందుకు శ్రాద్ధ కర్మలు చేయటానికి బాబు చిన్నవాడు తనే కొడుకు పోయినందుకు చేయాలి అనుకొన్నాడు మాధవరావు మనసులో. రేపటి ఉషోదయం కోసం ఎదురు చూస్తున్నాడాయన. □




### ఎస్. పి. ఆర్. కాల్వలపల్లి

★ ఆడవారికి ఆడవారే శత్రువులు అంటార. ఎందుకు?

● వాళ్ళు కామన్‌గా పోట్లాడుకునేది ఒక మగవాడి కోసం కనుక క్షణం ఆలోచించుకునే ఆడవాళ్ళు సాటి ఆడదానికి – శత్రువు గా మారరు.

★ జీవితంలో మరువరానిది ఏమిటి?

● జీవించడం!

★ మంత్రులు టోపీలు ఎందుకు పెడతారు?

● బుర్రలో ఆలోచనలు మనకి తెలియకుండా అనుకుంటారు గాని . అవి వారి ముఖాల్లో తెలిసి పోతూనే వుంటాయని తెలియక!

### ఆర్. ఎమ్. ఆర్. గుంటూరు.

★ మా ప్రశ్నల కింత మంచిగా జవాబులిస్తున్నారు. ఇంతగా చాతుర్యం వున్న మీరు రాజకీయాల్లోకి వెళ్ళి వుండ వలసింది. ..

● అక్కడ చాతుర్యంతో పనిలేదు. చేతులు కట్టుకు నిలబడ్డం తెలియాలి. అది నాకు రాదు

### డి. హెచ్. ఆర్. సికింద్రాబాదు

★ మీకు స్నేహితులంటే చాలా ఖచ్చితమైన అభిప్రాయా లున్నాయనిపిస్తుంది మీ ప్రశ్నావళి చదువుతూంటే. ఏమంటారు కె. రా. గారు?

● నేను నా స్నేహితులని భద్రంగా ఎన్నుకుంటాను. చెప్పుడు మాటలు వినను. విన్నా– అడిగేసి నిజా నిజాలు తెల్సుకుని స్నేహం మిగుల్చుకుంటాను. మీకు తెలుసో లేదో– తెలివి తక్కువ స్నేహితులంత డేంజర్ యింకోటి వుండదు!

### ఎన్. ఎస్. బి. కోటబొమ్మాళి

★ ఏ కార్యానికైనా ఆడవారు లేకపోతే అక్కడ అంతా శూన్యంగా కనబడుతుంది కదా? అలాంటిది ఆడవారు ఏ కార్యానికైనా శుభమా అని పిలుస్తే మురిపించుకుంటారెందుకు?

● లేకపోతే– పట్టుచీర కట్టుకుని రడీ అయిపోమంటారా? అలా చేస్తే "యీవిద గారిని పిలవడం ఆలస్యం రడీ అయిపోతోంది" అనీ మీరే అంటారు!

### ఎస్. ఎస్. బొబ్బిలి

★ నేటి సమాజంలో సినిమాల ప్రభావం యువతీ యువకులపై ఎంతవరకు వుంటుంది?

● ఎంతవరకేమిటి మహాత్మా! వున్నదే అది కద!!

★ కుల మత భేధం లేదంటూనే ఎఫ్.సి, బి.సి శాఖాలు అంటుందెందుకు ప్రభుత్వం?

● ఇప్పుడు ఓరల్‌గా ఎస్.సివా అని అడుగుతున్నారని వినికిడి! అంటే సేమ్ కాస్టా? అనిట!

### పి. వి. ఎస్. కె. హనుమాన్ జంక్షన్

★ స్వీట్స్ తింటే లావెక్కుతారా?

● నేను తినకుండానే ఎక్కాను? అంచేత నమ్మకండి లావు సన్నం చాలా భాగం శరీర తత్వాన్నిపట్టి వుంటుందన్నారు డాక్టరుని అడగక మన నిర్ణయాలు మనం చేసేసుకో కూడదు!

### ఎస్. వి. జక్కల్

★ అక్కా కొంత మంది స్త్రీలు అందం పోతుందని పసి పాపలకు పాలివ్వరు కొంత మంది మార్కెట్‌కి పోతూ నడవడం రాని పసి పాపలను కూడా నడిపిస్తూ పోతారు. ఎందుకు?

● మీ ఎందుకుకి అర్థం లేదు. తల్లి ఒక్క అందం పోతుందనే పాలివ్వదనుకో కూడదు. ఈ రోజుల్లో చాలా మంది ఉద్యోగాల వల్ల కుదరక డబ్బాపాలు అలవాటు చేస్తారు మీ రెప్పుడేనా ఆస్పత్రిలో వాకబు చేయండి– చాలా మంది బాలింతలు "మా వారి కిష్టం లేదు. పోత పాలు అలవాటు చేస్తా"ననే చెప్తారు. ఇక నడిపించడం– పిల్ల నెత్తుకుని బజారు పని చేసుకోలేని వాళ్ళేం చేయాలి? ఒక్క తెలుగు స్త్రీలే యిలా పిల్లల్ని పట్టి లాక్కుంటూ ఓ చేతో సంచీలో సామాన్లు మోస్తూ పోతూంటారు. భర్తలు తమదా పని కానట్టు కాస్త ముందుగా నడిచేస్తూంటారు. తల్లులు గమనించ వలసిన దొక్కటే– పసివాళ్ళని నడిపించేప్పుడు– తమ స్పీడు తగ్గించుకోడం. మరీ త్వరగా నడిపించేస్తే కాళ్ళు దొడ్డి కాళ్ళు అయే– ప్రమాదం కూడా వుందంటారు!

### కె. ఎస్. ఆర్. ఆర్. తెనాలి

★ నా దృష్టిలో దేవుడు లేడు అంటాను. మీ దృష్టిలో ఉన్నాడా లేడా?

● దేవుడి వునికికి సాక్ష్యం దొరకదు అంచేత వున్న వాళ్ళకి వున్నాడు– లేడనుకున్న వాళ్ళకి లేడు!

★ పత్రిక కొనగానే మీ శీర్షిక చదవాలనిపిస్తుంది. ఎందుకంటారు?

● తరవాత ఆ "అరుచి పోడానికి" మిగిలిన వన్నీ చదవచ్చునని! చేదు మాత్ర ముందు మింగాలి కద!

### పి. సిహెచ్. చిలకలూరిపేట

★ మారుతున్న సమాజంలో స్త్రీ పురుషులు సమానం కదా? అప్పుడు స్త్రీ పురుషుని దగ్గిర నుండి కట్నం పుచ్చుకునే రోజులు వస్తాయా?

● చూడండి– మార్పు అనే చక్రం తిరుగుతూనే వుంటుంది– కాలాన్ని పట్టి కట్నాలు మారుతూ వస్తూనే వున్నాయి కదా? ఒకప్పటి ఓలి పోయి నేడు కట్నం వచ్చింది– మళ్ళీ అది రాదని ఎవరు గ్యారంటీ చెయ్యకలరు?

### ఎ. పి. హైదరాబాదు

★ మీ ప్రశ్నావళి చదువుతాను కొన్ని సమాధానాలు చాలా ఇంటరెస్టింగు గానూ, కొన్ని చాలా భావగర్భితంగానూ వుంటాయి నిరక్ష రాస్యత తొలగిపోతే దేశంలో మూఢ నమ్మకాలు నశిస్తాయని నా నమ్మకం.

● గ్యారంటీ లేదని– నేడు చదువుకున్న వారు అక్షరాస్యుల కోసం రాస్తున్న రచనలు వాటికి లభిస్తున్న విపరీతమైన ప్రచారం– సాటి చెప్పడం లేదా? అక్షరాలు రావడం కంటే మంచి చెడులు తెలిపే విద్య విస్తరిస్తే– మీరన్నట్టు జరిగే అవకాశం వుంది.

### ఎ. పి. కె. వేములవాక

★ మా ప్రశ్నలకు మీరు సముచితమైన సమాధానాలు యిస్తున్నారు కదా! మీరిస్తున్నారా? ఎవరేనా యిస్తున్నారా?

● ఏం? అనుమానంగా వుందా– ఆడదానికి యింత అక్షర జ్ఞానం ఏమిటని! నేనేం సినిమా తారనా! ఎవరేం రాసినా "నేనే" రాశానని తలూపడానికి?! □





# దూరదర్శనం

లత

## మై ఫెయిరీ మై స్ట్రింగ్స్ :-

ఈ పిల్లల కార్యక్రమం గొప్ప ఐక్యూతో ఉంది ప్రతి పిల్లకీ ఫెయిరీ ఉంటే అన్న ఊహ పిల్లలకుంటుంది చక్కని ఊహాచిత్రం అప్నాఉత్సవ్ సౌతిండియా సాంస్కృతిక ఉత్సవాలు క్రిష్ణా-గోదావరీ, తుంగభద్రా నదులలో పవిత్రమయిన ఆంధ్రప్రదేశ్ బారతీయ సంస్కృతికి మూలం అని ఎనౌన్స్ చేసి చిందుభాగవతం అని లాంగ్ షాట్‌లో లైట్ లేకుండా ఏదో చూపించారు కొన్ని సెకన్లు - తమిళనాడుకి చాలా ప్రాధాన్యత ఇచ్చి వాళ్ల నాటియకుధిరై- ఎగిరే ఎద్దు మొదలైన జాతీయ క్రీడలు చూపించారు అగ్నిచక్రం వాళ్ల జాతీయ క్రీడ, అదీ చూపించారు- పాండిచేరి తమిళనాడులో బాగంట నోటితో కర్ర పుచ్చుకోవటం చూపించారు- కర్నాటకలో పుష్ప నృత్యం 9 శతాబ్దంనాటి శివ శాసనం, వీరభద్ర విజయం చూపించారు- ఒక్క ఆంధ్రులే అన్యాయం అయారు పేరిణీ శివ తాండవం, భామాకలాపం- లాటివి చూపించలేదు.

కేరళ అంటే కొబ్బరి తోటల మయం- కథకళి. ఏమిటో గా ఉంది బహుశా కృష్ణ కుచేల నృత్య నాటిక అనుకుంటాను సంగీత కార్యక్రమం హిందూస్థానీ గాయకుడు పేరు వెయ్యటం గాని ఎనౌన్స్ చేయటం గాని లేదు. ఇద్దరు ఎనౌన్సర్లు కూర్చుని ఏదో మాట్లాడుతారు అది రాగం పేరో, రాగిణి పేరో గాయకుడి పేరో దేముడికి తెలియాలి - గురువు విలంచిత్‌లో ఉండగానే పక్క గాయకుడు తెగ మెచ్చుకుంటున్నాడు విలంచిత్‌లో ఉండగా తబ్లా మీదికి అదే పనిగా కెమెరావెడుతోంది. సంగీత సూర్యపరిక్రమ- అని ఇప్పుడే అక్షతాలుపడ్డాయి. అది సంగీత ప్రకాశికలాటి పుస్తకమో, గాయకుడి కాల నిర్ణయమో, నామమో తాన్‌సేన్‌కీ అయన అనుయాయులకీ తెలియాలి ఎందుకంటే అది తాన్‌సేన్‌లో రానా అనుకుంటాను విలంచిత్‌లో ఏ రాగం ఆంధ్రులకి రుచించదు ధృత్‌లో అయితే ఆనందిస్తారు హిందూస్తానీలో విలంచిత్ రోజులు రోజులు పాడతారట

రాగమాల్య శ్రీ భైరాజమిశ్రాట

ప్రపంచ నేతల సమావేశం బెంగుళూరులో జరిగింది. ఆర్థిక వినిమయం వీరి ధ్యేయం రాజీవ్ గాంధీ- జయవర్ధనే- ఎర్షాద్, కింగ్ ఆఫ్ భూటాన్, నేపాల్ కింగ్ అబ్దుల్ గయూబ్- జునేజో వగైరాలు వచ్చారు రామకృష్ణహెగ్డే అందరికీ ఇంటలెక్చువల్ స్వాగతం ఇస్తూ అదర్శ సుందరమైన బెంగుళూరు ఈ చర్చలకు అనుకూలం అన్నారు నందీహిల్స్ లోనూ, కబ్బిన్ హవుస్‌లోనూ విడిదిఇచ్చారు దూరదర్శన్ అకాశవాణిలు కార్యక్రమాల్ని ప్రసారం చేసినయ్ ఆ రాత్రి "ముసాఫిర్" అనే పాత సినిమా చూపించారు. 10.30కు మొదలయింది సగంమంది నిద్రపోయి ఉంటారు సినిమా బాగుంది ఆదివారం మధ్యాహ్నం ఒక పోస్టుమాస్టరు అనే కన్నడ కథా చిత్రం చూపించారు డైరెక్టరు లక్ష్మీనారాయణ మానవుడి అనుభూతులకు చిన్న కారణాలు చాలు అన్నది ఇతివృత్తం సాయంత్రం ఏలూరులో లైబ్రరీ వారోత్సవాల్లో ప్రసంగించవలసిరావటం వలన తెల్ల ఏనుగు అనే చిత్రం చూడలేదు. అదృష్టం ఈ సినిమాలేవీ ఆర్ట్ ఫిలింలు కావు. వాటిని గురించి విడిగా ఒక ఆర్టు ఫిలిం చూసే దురదృష్టం పట్టినప్పుడు వ్రాస్తాను

అంటన్ చెకోవ్ వ్రాసిన కథ- నందూకా చిట్టీ- కథాసాగర్‌లో వచ్చింది- డైరెక్షన్ శ్యాంబెనెగల్- ఆంటన్ చెకోవ్ ప్రఖ్యాత రష్యన్ రచయిత- నందూ అనే కుర్రవాడు తల్లిని పోగొట్టుకుని పట్టణంలో బ్రతకడానికి పోయి చదువుకోటానికి అవకాశం లేక ఆ కొంపలో చాకిరీ చేయలేక ప్రేమ రాహిత్యంతో పల్లెటూర్లో ఉన్న తాతకి ఉత్తరం వ్రాసి స్టాంపులు అతికించకుండా పోస్టులో వేస్తాడు కథంతా ఇంతే అయితే ఈ కథ డెడ్‌లెటర్ అని కాబోలు ఇంగ్లీషులో చదివిన గుర్తు ఇంకోపేరేమో జ్ఞాపకంలేదు అయితే కథాసాగర్ పేరున ప్రపంచ మహారచయితల కథలు ఇస్తున్నారు బాగానే ఉంది రష్యాలో దీపావళిలేదు ఇంగ్లీషు అనువాదకుడు కూడా పేరు గుర్తులేదు గాని బాగా చేశాడు 'అయితే కథాసాగర్‌లో భారతీయుల దీపావళి చూపించారు అలాటప్పుడు వారివారి దేశాచారాలు తెలియటం కష్టం కథాసాగర్‌లో' ఎవరి దేశాచారాలయినా చూపించి న్యాయం చేయాలి ఈ కథ అలాలేదు గానీ పసివాడు బాగా నటించాడు అలాగే 'మర్చంట్ ఆఫ్ వెనీస్' చివరి భాగం దృశ్యమయింది షేక్స్‌పియర్ నాటకంలో చివరి సీన్లు ఎడిట్ అయినాయి టైము సరిపెట్టడానికే కావచ్చును అయినా మహా రచయితలకు న్యాయం చెయ్యటం దర్మం షైలాక్ బాగా నటించాడు ఆంటోనియో బెసానియో, పోర్షియా పాత్రదారులు కూడా, నటించాలేదు కథ అందరికీ తెలుసుగనక చెప్ప నవసరంలేదేమో?

ఆదివారం 'అప్పూ, ఔర్ పప్పూ' పిల్లల సీరియల్‌లో ఏనుగు బాగా నటించింది- కోతి కూడా పరవాలేదు- పిల్లవాడు సుపర్బ్- ఒక ఫారెస్ట్ ఆఫీసర్ కొడుకు ఆ పిల్లవాడు- ఏనుగుతోనూ, కోతితోనూ స్నేహం చేస్తాడు అడవి జంతువులను ఎత్తుకుపోయేందుకు విదేశీయులు వస్తారు- వాళ్లకీ పారెస్టు ఆఫీసరుకీ సహజంగానే పడదు పారెస్ట్ ఆఫీసర్ని కట్టివేసి జంతువుల్ని వేటాడడానికి ప్రయత్నిస్తారు ఏనుగు రక్షిస్తుంది పిల్లల సీరియల్స్‌లో 'ఫేమస్ ఫైవ్' తరువాత ఈ సీరియల్ బాగుంది- అన్నట్లు శనివారం నుంచి విజయవాడ హైపవర్ ట్రాన్స్‌మిటర్ పని చేస్తున్నది ప్రోగ్రామ్స్ కూడా వస్తే అదృష్టమే

లలిత సంగీతం కూడా బాగుంది అశోక్ ఖోస్లా పాట బాగుంది- లలిత సంగీతానికి చ జన్ యాత్రి పేరు బాగులేదు- బక్తి రసానికైనా లలిత సంగీతం అనటమే కరెక్టు భగవంతుడిని ఆర్ద్రతతో పిలిచిన ఏ పాట అయినా రక్తి కడుతుందని శ్రీ అశోక్‌ఖోస్లా ఋజువు చేశాడు తరువాత గిరిజాదేవి పాడిన బజన్ వచ్చింది ఖజరీ బాణీలో చివరికన్నీ శాస్త్రీయ సంగీతం పోకడలుండి- లలిత సంగీతంలో ఉన్న హాయీ- శాస్త్రీయ సంగీతంలో ఉన్న నిబద్ధతా లో పిస్తాయి కాని ఖజరీ ఉత్తర హిందూస్తానంలో ప్రసిద్ధి అందులో గిరిజాదేవికి మంచి కంఠముంది- అయితే మొదట పాడిన అందగత్తె కంఠంతో పోలిస్తే కొంచెం ముదురుగా ఉంది (పేరు వెంటనే తీసేశాడు) రెండో పాట చౌతీ పాడింది గిరిజాదేవి- ఇది ఒలేటి వెంకటేశ్వర్లుగారు బాగా పాడతారు రజనీకాంతరావుగారు ఇందులో తెలుగు పాటలు పాడినట్లు గుర్తు

ఆర్థర్ కానన్‌డాయిల్ సృష్టించిన షెర్లాక్ హోమ్స్ పాత్ర ఈ నాటికీ ఇంగ్లీషు సాహిత్యంలో గొప్పది దీన్ని డిటెక్టివ్ గోల అనేవాళ్ళు లేకపోలేదుగాని వాళ్ల మాట పట్టించుకో నవసరంలేదు- షెర్లాక్ హోమ్స్ కార్టూన్ పాత్రలు మేధావంతులకు చాలా ఇష్టం ఈ వారం 'రెడ్ హెడెడ్ లీగ్' అనే కథ చూపించారు- టి వి లో, టైటిల్స్ మహావేగంగా వేస్తున్నారు రివ్యూ చేసేందుకు కొంచెం కష్టం అవుతున్నది సిల్వర్ బ్లేజ్- హౌండ్ ఆఫ్ బాస్కర్ విల్లీ లాటివి ఇంకా ఇవ్వటంలేదు ఏమయినా 'రెడ్ హెడెడ్ లీగ్'లో రాజకుటుంబీకుల్ని వాళ్ల గుంపుల్ని, తప్పుల్ని, కానన్ డాయిల్ బాంక్ దొంగలుగా చిత్రించి. ఎవరూ ఆఖరికి హోమ్ కూడా ఏమీ చేయలేని దుస్థితిని- లండన్‌లో ఎలా ఉండేదో చూపించాడు- ఇంగ్లండ్‌లో డ్యూక్‌లూ, డచెస్‌లూ, ఇష్ట ప్రకారం జీవించటం మనం చదివే వున్నాం ఇందులో కొన్ని సెకన్లు వయొలిన్ బిట్స్ వినిపించారు బాగుంది □

# సీరియల్

# ఒకటి ఒకటి మూడు

## తేజోవతి



Bali

(గత సంచిక తరువాయి)

సీత ఇంటికి వచ్చిందన్న మాటే గానీ మనసు మనసులో లేదు అన్నం సయించటం లేదు, నిద్రపట్టటం లేదు

మాటి మాటికీ భాగవతంలో పద్యం గుర్తొస్తోంది

భూసురుడేగెనో ఏగడో నడుమ మార్గ శ్రాంతుడై చిక్కెనో .

కృష్ణవేణమ్మగారు డాక్టరుగారితో మాట్లాడి వుంటుందా? ఆయనెలాంటి వాడో ఏమంటాడో

ఒక్క ఆడపిల్లకు సాయం చెయ్యడం కోసం చిన్న అబద్ధం చెప్పడానికి వొప్పుకోడా

ఏమో, ఒకరి బాధలు ఒకరికి ఎలా అర్ధమవుతాయి

సీత పరిస్థితి చూసి వాళ్ళ వదిన నవ్వింది

ఏమిటి సీతా మీ అన్నయ్యను వదిలి వెళ్ళడానికి బెంగ పెట్టుకున్నావా? మీ అన్నయ్య పాలూ నెయ్యీ పోసి పెట్ట మంటూంటే నువ్వేమో అసలు అన్నమే మానేసి చిక్కి సగమవుతున్నావు ' అంటూ పరాచికాలాడింది

ఇంట్లో సరుకుల లిస్టులు తయారవుతున్నాయి అప్పడాలు, వడియల్లాంటివి పెట్టడమయి పోయింది

చుట్టుపక్కల ముత్తయిదువులను పిలిచి పసుపు కొట్టి పెళ్ళి పన్లు మొదలెట్టిన రోజున సీతకు ఏం చెప్పడానికీ తోచలేదు

రోజులు దొర్లుతున్నాయి బుధ, గురు, శుక్ర, శని సీతకు ఆశ చచ్చిపోయింది ఇంకా ఆవిడ ప్రాపు దొరికితే పనిలేని వేళల్లో ఆమెను బ్రతిమిలాడి చదువుకోవచ్చనుకుంద ఏదో ఒక విధంగా బ్రతుకు తెరువు చూసుకోవచ్చను కుంది కానీ యిప్పుడేం చెయ్యాలి?

ఈ పెళ్ళి ఆపడం ఎలా? .

ఈ లోపల ప్రసాద్ గారి దగ్గర నుండీ వుత్తరం కూడా వచ్చింది త్వరగా డబ్బు సర్దుబాటు చేస్తే పెళ్ళి పనులు మొదలు పెడతామని

సీత మనసు ఏ పనిలోనూ లగ్నం కావటం లేదు

ఎక్కడో ఆలోచన ఏదో పరధ్యాస

ఆదివారం వచ్చింది భోజనాలయ్యాక మధ్యాహ్నం వేళ పక్క వాళ్ళను కూడా పిలిచి బియ్యం బాగు చెయ్యడానికి కూర్చోపెట్టింది వదిన జానకి

సీత కూడా చేటలో బియ్యం పోసుకు కూర్చుంది .

ఈలోపల యింటి ముందు కారాగింది

రంగారావు గారి యిల్లు యిదేనా? "

వాకిట్లో నిలబడ్డ డ్రైవర్ని చూస నిర్ఘాంత పోయింది సీత అతడే అతడే కృష్ణవేణమ్మ గాగి కారు డ్రైవరు!

కళ్ళల్లో ఒక్క సారి కోటి కాంతులు వెలిగాయి

అం యిదే ఎవరొచ్చారు?'

పెద్దమ్మగారొచ్చారు మీకోసం

సీత సంభ్రమంగా లేచింది

జానకి నివ్వెర పోయి చూస్తోంది!

డ్రైవరు తలుపు తెరిచి పట్టుకోగా కారు దిగింది కృష్ణవేణమ్మగారు పెద్ద పట్టు చీర చేతులకు నాలుగు జతల బంగారు గాజులు.

బియ్యం బాగు చేస్తున్న ఆడ వాళ్ళంతా బియ్యం పక్కకు నెరపి లేచి నిలబడ్డారు కళ్ళప్పగించి చూస్తూ.

"రండి లోపలికి రండి ' ఎదురెళ్ళి ఆవిడ చేయి పట్టుకుని లోపలకు తెచ్చింది సీత

ఈ లోపల యినుప వూచల చెక్క కుర్చీ సిద్ధం చేసింది జానకి

'వదినా కృష్ణవేణమ్మ గారని. మొన్న తెనాలి వెళ్ళినప్పుడు అనుకోకుండా కలుసుకున్నాం " అంటూ పరిచయం చేసింది సీత

పక్కింటి ఆడవాళ్ళు వెళ్ళి పొయ్యారు మళ్ళొస్తామని చెప్పి

జానకి వంటింట్లో కాఫీ పెడ్తోంది

'సీతా, నీతో మాట్లాడాలి ఇక్కడ కాదు ఎక్కడైనా ఒంటరిగా నెమ్మదిగా చెప్పింది సీత యిచ్చిన మంచినీళ్ళు అందుకుంటూ .

సీత పై ప్రాణాలు పైనే పోయినవి

వాళ్ళబ్బాయి వద్దని అనకపోతె తనతో వంటరిగా మాట్లాడాల్సన

జరిగిన కథ-5 : తన అన్నయ్య కుదిర్చిన బ్యాంకు ఉద్యోగి ప్రసాద్‌ను అతనడిగిన కట్నం మూలంగా చేసుకోనంటుంది సీత ఉన్న ఇల్లు తాకట్టు పెట్టి డబ్బు సంపాదించడానికి ప్రయత్నిస్తానంటాడు అన్న రంగారావు తమ పరిస్థితి ప్రసాద్‌కు స్వయంగా వివరించడానికి సీత పూనుకుంటుంది ఇద్దరూ ప్రసాద్ స్నేహితుని ఫోటో స్టుడియోకు వెళ్ళి మాట్లాడుకుంటారు ప్రసాద్ తన చెల్లెలి పెళ్ళి అవసరం కోసం కట్నం ముందే ఇవ్వాలంటాడు సీత ఆశలన్నీ కూలి పోతాయి వరకట్నపు దురాచారం గురించి సీతకూ విశాలకూ మధ్య చర్చ జరుగుతుంది అన్నయ్యకు కష్టం తప్పించే ఉద్దేశ్యంతో సీత చెయ్యదలచుకున్న ప్రయత్నాలు ఏ దుష్ఫలితాల నిస్తాయో విశాల వివరిస్తుంది తిరిగి ఊరికి బయల్దేరినసీత కృష్ణవేణమ్మ గారి కారుకింద్రపడి ఆవిడ ఆదరణను చూరగొంటుంది ఆవిడ ద్వారా ఉద్యోగం సంపాదించే ప్రయత్నం మొదలు పెడుతుంది

పనేముంది! మొఖం చిన్న బోయింది

అయినా నిల దొక్కుకుని, వదినా నువ్వు కాఫీ పెడ్తుండు ఆవిడ మన రామాలయం చూస్తారట అక్కడి దాకా వెళ్ళొస్తాం అన్నది

ఈవేళప్పుడు గుడి ఎందుకు తీస్తారు సీతా అంటున్న వదిన మాట విన్పించుకోకుండానే బయలు దేరింది సీత కృష్ణ వేణమ్మగారి వెనకాల

జానకికి అంతా వింతగా వుంది అయోమయంగా వుంది అయినా చేసేదేం లేక డ్రైవర్ను ఏవూరూ ఏమిటని వివరాలడుగుతూ వుండి పోయింది

కృష్ణవేణమ్మ గారు సీతతో బాటు రామాలయం మెట్లెక్కుతూ

సీతా నేను నువ్వడిగినట్లు యింట్లో పని మనిషిగా కాకుండా నా •కోడలుగా చేసుకోవాలను కుంటున్నాను నిన్ను ఏమంటావ్? అంది

సీత తన చెవులను తను నమ్మనట్లు నిలబడి పోయింది

కోడలా! అన్నది నోరు తెరిచి

అవును మా పెద్దబ్బాయి డాక్టరని చెప్పాను గదూ మరీ పెద్దవాడేమీ కాదు ముప్పయి నాలుగు వచ్చింది అంతే

పెళ్ళయిన రెండేళ్ళు కాపురం చేశాక భార్య పోయి రెండేళ్ళ పైనే అయింది

సీతకు కలయో వైష్ణవ మాయయో అన్నట్లు భూమి గిర్రున తిరుగు తున్నట్లు అన్పించింది

ఆలయం అరుగుల మీద కూర్చుంటూ,

వారు . వారు వొప్పుకుంటారా? అన్నది వెడల్పైన కళ్ళతో

ఏదో చెప్పి వప్పించాలే ఎందుకంటే నువ్వేమో సాయం కావాలన్నావు నేను ఎంత వుద్యోగమని చెప్పినా పెళ్ళి ముహూర్తాలు పెట్టుకున్న తర్వాత మానేసి వుద్యోగం పేరుతో పరాయి వాళ్ళతో పంపరు మీ వాళ్ళు

అది మర్యాదగా కూడా వుండదు గదా అందుకని మా అబ్బాయికి ఏదో చెప్పి వప్పించాను కానీ . అంటూ ఆగి పోయింది

సీతకు యిప్పటికీ తల తిరుగు తున్నట్లుంది

ఏదో అదృశ్య శక్తి తనను, తన వాళ్ళను రక్షించడం కోసం యీ రూపంలో ప్రత్యక్షమైనట్లుంది!

కృతజ్ఞతతో ఆ కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా, ఏమిటో చెప్పండి నా కింత సాయం చేశారు మా పరువు కాపాడ్డానికి యీ పెళ్ళికూడా వప్పించారు . మీ ఋణం ఎలా తీర్చుకోవాలో నాకు తెలియటం లేదు. మీరు సందేహించ కుండా చెప్పండి'



# ఒకటి ఒకటి మూడు

కృష్ణవేణమ్మగారు ఒక్క క్షణం ఆగారు ఆ నీళ్ళు నిండిన కళ్ళల్లోకి చూస్తూ.

అయితే అబ్బాయి ఒక్క కండిషను మాత్రం పెట్టాడు – అన్నది

సీత చప్పున అన్నది-

చెప్పండి ఎలాంటి కండిషను అయినా వొప్పుకుంటాను మీరు నా మంచి కోరే వారు నాకు దేముడే మీ రూపంలో వచ్చి సాయం చేస్తున్నట్లుగా అనిపిస్తోంది చెప్పండి అన్నయ్య కుటుంబం నా మూలంగా చితికి పోకుండా వుండడానికి ఏం చెయ్యమన్నా చేస్తాను' చాలా ఆవేశంగా అంది

ఏం లేదు అప్పుడు ఆ అమ్మాయిని యిష్టపడి చేసుకున్నాడులే ఆ భార్య పోయినప్పటి నుండీ మళ్ళీ పెళ్ళికే యిష్టపడలేదు ఇప్పుడు కూడా నా బలవంతాన, నా పోరు పడలేక కేవలం తాళి కట్టడానికి మాత్రమే వొప్పుకున్నాడు

అంటే నువ్వు నువ్వు భర్త దగ్గర నుండీ ఏమీ ఆశించడానికి లేదు కేవలం కేవలం

సీత నిశ్చేష్టురాలయింది కాసేపు

ఆవిడ చెప్పిన మాటల సారాంశం తాళి కట్టడం కేవలం నలుగురిలో తన పరువు, అన్నయ్య పరువూ కాపాడ్డానికి

కాని తను మాత్రం కలకాలం ఆ యింట్లో పని మనిషిగానే మిగిలి పోతుంది'

భర్త, బిడ్డలూ, తనయిల్లూ సంసారం కేవలం ఒక కలగా మాత్రమే మిగిలి పోతాయి

ఇంకా తను ఆ యింట్లో పని పాటలు చేసుకుంటూ చదువుకోవచ్చుని, ఏదో విధంగా తన కాళ్ళ మీద నిలబడి తర్వాత తర్వాత

అలాంటి ఆశలు యిక ఏమీ వుండవు.

'అంటే యీ పెళ్ళి చేసుకోడం తన భవిష్యత్తును ఎడారి చేసుకోడం'

తన ఆశలను మొదలంటా నరికేసుకోడం'

కానీ తను చెయ్యగలిగిందేముంది?

ఈ ఒక్క అవకాశం పోతే రేపు యిల్లు రిజిస్టరు అవుతుంది అన్నయ్యా వాళ్ళు ఆ పూరి గుడిసెలోకి మారక తప్పదు, అప్పులతో పస్తులతో వాళ్ళు అవస్థలు పడకుండా తప్పించాలంటే యిదొక్కటే మార్గం

సీత యింకేమీ ఆలోచించ లేదు

భార్య భర్త దగ్గర నుండీ ఏమీ ఆశించ కుండా ఎలా వుంటుందని కానీ, యిది ఎంత అసహజం అని కానీ అడిగే పరిస్థితిలో లేదు సీత అందుకే అన్నది

అమ్మా యిలాంటి పరిస్థితుల్లో మీరు నన్ను కోడలుగా చేసుకుంటా ననడమే మీ ఔదార్యం తాళి కట్టించి మా వాళ్ళ బరువు తప్పించండి








ఆలయంలో స్వామి మీద వొట్టేసి చెబుతున్నాను నేను మీదగ్గర నుండీ ఏమీ ఆశించను

మీరు యింత నీడ యివ్వండి పట్టెడు మెతుకులు పెట్టండి మీ యింట్లో కేవలం పని మనిషిలానే

అలా అంటుంటే సీత కళ్ళల్లో నీళ్ళు తిరిగినయి గొంతు బొంగురు పోయింది

అది కన్పడకుండా ఆమె కాళ్ళకు నమస్కారం చెయ్యడానికి వంగి కళ్ళు తుడుచుకుంది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

సీత దొడ్లో కూర్చుని సన్న జాజులు మాల కడ్తోంది విచ్చు కుంటున్న సన్న జాజు ... పరిమళాలు వెదజల్లుతూ ఏవేవో వూహలకు వూపిరి పోస్తున్నాయి

సీత ఆ యింటికి కొత్త కోడలుగా వచ్చి యింకా వారం కాలేదు తను యీ యింటి కోడలంటే నమ్మశక్యం కావటం లేదు

అవును ఆ అమ్మాయి వారం క్రితం కొత్త కోడలుగా ఆ పెద్ద యింటి ముందు కారు దిగినప్పుడు ఏ మంగళ వాయిద్యాలు ఆహ్వానించ లేదు

ఏ దీపాల వెలుగులూ తోవ చూపలేదు

ఏ ముత్తయిదువులు హారతులు పట్టలేదు

కనీసం యింటికి మామిడాకుల తోరణాలు కూడా లేని యింట్లో అడుగు పెట్టినప్పుడు అనుకుంది సీత తన ఆశలన్నీ పూర్తిగా సమాధి చేసుకు వచ్చిన కోడలికి, భవిష్యత్తులో నువ్వు ఆశించడానికీ, ఆశించ గలిగేదీ ఏమీ లేదని తెల్పి వచ్చిన కోడలికి ఆహ్వానం యిలా కాక వేరే ఎలా వుంటుందని సరిపెట్టుకుంది

ఆ అమ్మాయి దాన్ని గురించి ఎక్కువగా బాధ పడలేదు కూడా తను కేవలం పేరుకు మాత్రమే కోడలు

ఆ యింట్లో నిలిచే స్థానం కల్పించడానికి ఆడిన నాటకం పెళ్ళి నాటకపు పెళ్ళికి బాజాలు తక్కువయ్యాయని బాధ పడడం తెలివి తక్కువకదూ

సీత పూలు కట్టడం పూర్తి చేసి తల్లో పెట్టుకుంటుండగా వచ్చాడు డ్రైవరు, అయ్యగారు పిలుస్తున్నారు మిమ్మల్ని

ఆ డ్రైవరుకున్నాడో సీత అంటే పెద్ద గౌరవం లేదని తెలుసు ఆ అమ్మాయికి ఆత్మహత్య చేసుకోవాలంటే మా కారే దొరికిందా తల్లీ అని అనుకున్న యిరవై రోజుల్లోపలే ఆ అమ్మాయి యింటి యజమానురాలుగా రావడం అతడెలా హర్షించ గలడు?

సీత ఆశ్చర్యంగా అయ్యగారా' ఏ అయ్యగారు? అని అడిగింది

ఏ అయ్యగారేమిటమ్మా డాక్టరు గారు అన్నాడు ఆ అనడంలో నీ కోసం చాలా మంది అయ్యగార్లంధరూ వచ్చి పోతున్నట్టు ఏమిటా అడగడం అన్న మందలింపు వుంది

సీత చప్పున లేచింది

ఈ వారంలో డాక్టరు గారు తనను పిలవడం గానీ పలకరించడం గానీ యిదే మొదటి సారి

తొట్రు పడుతున్న అడుగులతో గబగబా హాల్లోకి వచ్చింది

హాల్లో నిలబడి వున్నారు డాక్టరుగారు

ఆయనది ఆజానుబాహు విగ్రహం టక్ చేసుకుని ఎప్పుడూ బూటు వేసుకునే కనబడ్తాడు ఆయన

బెదిరె కళ్ళతో ఏమిటన్నట్లు చూసింది సీత

అమ్మేది?

ఆమె ఆమె విశాఖపట్టణం వెళ్ళారు

ఎందుకూ?

అక్కడ ఆమె . ప్రసవించారుట

నళిని ప్రసవించిందా?

సీతకు మాటలు రానట్టు, వచ్చినా నత్తి వున్నట్టు నట్టు నట్టుగా వస్తున్నాయి ఆయన ముందు నిలబడి అలా మాట్లాడాలంటే దానికి తోడు ఆయనక్కా ప వెనకగా డ్రైవరు ని... ...డు

అందుకే మరి మరి తత్తర బిత్తర అయితోంది

నళిని డాక్టరు గారి పెద్ద చెల్లెలు ఇది మూడో కాన్పు పుట్టింటి వాళ్ళు పొయ్యకూడదుట అందుకని అత్తింట్లోనే వున్నది అయితే అనుకో కుండా పురుడు రావడంతో వాళ్ళు వెంటనే బయలు దేరి రమ్మని రాశారు కృష్ణవేణమ్మ గారికి బయలు దేరక తప్పలేదు

ఆవిషయం విన్న తర్వాత డాక్టరు గారు అన్నారు-

సరే నేను మొహం కడుక్కు వస్తాను నువ్వు వడ్డించు నేను మళ్ళీ వెళ్ళాలి అని సీతకు చెప్పి డ్రైవరు వైపు తిరిగి, 'నువ్వెళ్ళిపో డ్రైవర్' అన్నారు

'మళ్ళీ హాస్పిటలుకు వెళ్ళాలన్నారు కదయ్యా!'

ఫర్వాలేదులే నేను తీసుకెళ్తాను మళ్ళీ యింటి కొచ్చే సరికి ఎంతవుతుందో చెప్పలేను నువ్వెళ్ళు

డ్రైవరు వెళ్ళి పొయ్యాడు సీత టేబిల్ మీద అన్నం సర్దుతుండగా మొహం కడుక్కుని టవలుతో తుడుచుకుంటూ వచ్చారు డాక్టరు గారు

భర్తకు అతి సమీపంలో నిలబడి వడ్డిస్తున్న సీతకు ఏదో తృప్తి, ఏదో ఆనందం

కృష్ణవేణమ్మ గారు టిపినుగానీ, భోజనం గానీ ఆవిడే దగ్గరుండి వడ్డన చేసేవారు కొడుక్కు సీత అన్నీ టేబిల్ మీద సర్దేసి వెళ్ళి పోవాల్సిందే

వడ్డిస్తుంటే అడిగారు డాక్టరు గారు-

నువ్వు పెట్టుకో లేదేం?

నేను నేను తర్వాత తింటాను

సీత తెగ కంగారుపడి పోయింది అసలు కృష్ణవేణమ్మ గారు సీతను తనతో బాటు కూడా కూర్చోనిచ్చేది కాదు వంట మనిషితో బాటు వంటింట్లో భోంచేసేది తను

పక్కన నిలబడి వడ్డిస్తున్న సీతతో -

కనీసం ఆ కుర్చీ మీద కూర్చో ఎంత సేపని నిలబడ్తావ్?' అన్నారు నవ్వుతూ

ఆ నవ్వు సీత వంటి మీద పన్నీరు చల్లినట్లయింది అదేమిటో ఆయన పేరు చెప్పినా సరే అది అభిమానమో, అనురాగమో, ఆరాధనో తెలియదు కానీ ఒక విధమైన పరవశత్వం

ఇది యిప్పుడే కాదు పెళ్ళికాకముందు నుండీ పెళ్ళి కాక ముందు సీత ఆయన్ను చూడనే లేదు కానీ ఒక సారి అన్నయ్య వదినతో అంటుండగా విన్నది

అది కృష్ణవేణమ్మగారు వచ్చి వెళ్ళిన మర్నాడు రాత్రి తనకెందుకో నిద్రపట్టటంలేదు కృష్ణవేణమ్మగారు వచ్చి మీ చెల్లెల్ని మా అబ్బాయికి చేసుకుంటాను కానీ కట్నం అక్కర్లేదు అన్నప్పుడే అసలు అన్నయ్యావాళ్ళు నమ్మలేదు అందుకే రెండు రోజుల్లో చెబుతామని చెప్పారు ఆ మర్నాడు వెళ్ళి ఆ వూర్లో వాకబు చేసి వచ్చాడు కాబోలు వదినతో అంటున్నాడు

జానీ నాకెందుకో నమ్మబుద్ధి పుట్టటంలేదు వాళ్ళ అంతస్థేమిటి మన పిల్లను చేసుకుంటామనడమేమిటి? అంతా చిత్రంగా వుందికదూ

పిల్లను చూశాను బుద్ధిమంతురాలు నాకు నచ్చింది అందుకనే కోడల్ని చేసుకోవాలనుకుంటున్నానని ఆవిడ చెప్పారు గదా అయినా యీ రోజు మీరెళ్ళి కనుక్కొస్తామన్నారుగా వెళ్ళలేదా?

వెళ్ళాను అన్నీ వాకబు చేసే వచ్చాను అప్పటినుంచీ అసలు అయోమయంగా వుంది

డాక్టరుగారంటే చాలా పెద్దవాడేమో అనుకున్నామా? లేదు నిజంగానే ముప్ఫయి అయిదేళ్ళలోపే అసలు అంత వయసే కనపడటంలేదు ఆయనలో

అంటే - మీరెళ్ళి చూసి కూడా వచ్చారా?'

ఆఁ లేకపోతే ఏ అవుడో ఏదో అని భయం కదూ ఏ ముప్ఫయేళ్ళ వాడిలానో వున్నాడు

మనిషి బాగున్నాడా?'

బాగుండడం ఏమిటి దొరబాబులా వున్నాడు అసలు ఆ ప్రసాద్‌కంటే బాగున్నాడు మంచి పొడుగు పెద్ద నొసలు

అది సరే యిల్లూ ఆస్పత్రికూడా చూసొచ్చారా?

ఆఁ మా స్నేహితుడొకడున్నాడు వాడితో చెప్పాను వాడసలు

# ఒకటి ఒకటి మూడు

ఒక్కసారి ఎగిరి గంతేసాడు

డాక్టర్ శ్యామసుందర్ అంటే ఈ వూళ్లో చాలా మంచి పేరున్న సర్జను మంచివాడు హస్తవాసి మంచిది ఆయన ఆపరేషను చేస్తే ఎలాంటి కేసు కాంప్లికేషన్సు వుండవని ఎక్కడెక్కడి నుండో వస్తారుట ఆయన భార్య పోయిన తర్వాత మళ్లీ పెళ్లి చేసుకునే వుద్దేశంలోనే లేరు అలాంటివాడు చేసుకోవటం ఆశ్చర్యం అసలు కళ్లు మూసుకుని కన్యాదానం చేసెయ్యి అని ఒకటే సంబరపడిపోయినన్నా నర్సింగ్‌హోమ్ క్కూడా తీసుకెళ్లి చూపించాడు

మరయితే ఆ శ్యామసుందర్‌గారితో మీరు మాట్లాడారా?

లేదు చాలామంది పేషెంట్లు వెయిట్ చేస్తుంటే నేను ఫలానా, మీకు చెల్లెల్ని ఇవ్వబోతున్నవాడిని మిమ్మల్ని 'చూసిపోదామని వచ్చానంటే అంతమంది ముందు ఏమన్నా బాగుంటుందేమిటి

*   *   *   *   *

సీత ఆలోచనల్లోనే ఆయన భోజనం అయిపోయింది వాష్‌బేసిన్‌లో చెయ్యి కడుక్కుని నేప్‌కిన్‌తో తుడుచుకుంటున్న భర్తకు ఫ్రిజ్‌మీద పెట్టి వుంచిన వక్కపొడి డబ్బా తెచ్చి అందించింది సీత

వక్కపొడి తీసుకుంటూ-

నేను మళ్లీ నర్సింగ్‌హోమ్‌కు వెళ్తున్నాను యీ తలుపు తీసి వుంచు బయట గేటు తాళానికి నా దగ్గర డూప్లికేటు వుంది ఒక గంటా గంటన్నరలో వచ్చేస్తాను కొంచెం ఆలస్యమయినా నిన్ను లేపాల్సిన పనుండదు

కానీ తలుపు తీసి వుంచితే .

ఏం ఫర్వాలేదు , . యిప్పుడే వచ్చేస్తాగా

డాక్టరుగారు వెళ్లిపొయ్యారు సీత భోజనం చేసి వచ్చి హాల్లోనే ఒక సోఫాలో కూర్చుంది ఆయన ఎంత ధైర్యం చెప్పినా తలుపులు తీసిపెట్టి లోపలికి వెళ్లి పడుకోడానికి మనసొప్పలేదు కృష్ణవేణమ్మగారు యిల్లు జాగ్రత్తని పదిమాట్లు చెప్పి వెళ్లారు

సీత ఈ వారం రోజుల నుంచీ డైనింగ్ హాల్లో ఫ్రిజ్ పక్కగా ఒక చాప వేసుకుని పడుకుంటుంది కృష్ణవేణమ్మగారికి వాకిట పంచలో ప్రత్యేకంగా గది వుంది

సీత సోఫాలో కూర్చుంది, నిద్ర రాకుండానని ఒక వారపత్రిక తీసింది కానీ మనసు దానిమీద లగ్నం కావటంలేదు

అసలు కృష్ణవేణమ్మగారొచ్చి మీ చెల్లెల్ని మా అబ్బాయికివ్వండి అని అడిగినా ఈ పెళ్లి జరుగుతుందని తను అనుకోలేదు అన్నయ్య సుతరామూ




వొప్పుకోలేదు

రెండో పెళ్లివాడయితే చాలా పెద్దవాడయి వుండాలి అన్నయ్యవాదన

ఏం కాదుట ముప్ఫయి మూడు నిండిందట నేను మాత్రం చిన్న పాపననుకున్నావా యిరవైఆరేళ్లు నాకు

పిల్లను కూడా చూడకుండా పెళ్లికొప్పుకున్నాడంటే ఏదో తిరకాసుండాలి అన్నయ్య సందేహం

వాళ్లమ్మ గారి మీద గౌరవం కాకూడదా నువ్వెళ్లి ఎక్కడన్నా సంబంధం చూసి కుదుర్చుకొస్తే నేను చేసుకోనా కుర్రాడు నీకు నచ్చితే నాకు నచ్చినట్లే అననా

అందరూ మనిషిని చూశాక తొలి చూపులోనో, మలి చూపులోనో ప్రేమలో పడతారు నువ్వు డాక్టరుగారిని చూడకుండానే ప్రేమలో పడ్డట్టున్నావే అని పరిహాసం కూడా చేశాడు

నిజంగానే తను ప్రేమలో పడింది ఆయన మంచిమనసును చూసి ఇబ్బందుల్లో వున్న ఒక ఆడపిల్లకు ఆశ్రయం ఇవ్వడానికి, ఆడపిల్ల పరువు మర్యాదలు కాపాడ్డానికి ఇష్టంలేక పోయినా తాళికట్టి గౌరవస్థానం కల్పించడానికి తల్లి మాట మేరకు సిద్ధపడిన ఆయన మంచితనాన్ని చూసి ప్రేమించింది అయితే ఆ విషయం అన్నయ్యతో అనకుండా-

ఏం ఎందుకు పడకూడదు? 'దమయంతి నలుడ్ని చూడకుండానే ప్రేమించింది రుక్మిణి కూడా కృష్ణుడ్ని చూడకుండానే ప్రేమించింది

సీతా, ఏమైనాసరే యీ పెళ్లి నాకిష్టంలేదు

ఎంధుకని?

ఎందుకంటే అవతల ముహూర్తాలు పెట్టుకున్నాం ప్రసాద్‌గారికి ఏమని చెప్పమంటావ్?

నాకతడ్ని చేసుకోవడం యిష్టంలేదని చెప్పు .నేను ఒప్పుకోలేదని చెప్పు

పెళ్లిచూపులు కాంగానే ఎందుకు చెప్పలేదా మాట అని అడిగితే నా తలకాయను ఎక్కడ పెట్టుకోమంటావ్

అన్నయ్యా అవుతుందా , డాక్టరుగారితో పెళ్లవుతుంది లేదా యిలాగే వుండిపోతాను అంతేగానీ నా యిష్టం లేకుండా నా పెళ్లి ప్రసాద్‌గారితో జరిపించాలనుకుంటే నా శవానికే కట్టిస్తావు తాళి అని బెదిరించింది

అంతేకాదు ఆఖరి అస్త్రంలా అనకూడని మాట కూడా అన్నది

అసలు నేను గొప్ప యింటి కోడల్నవడం నీకిష్టంలేదు కదూ ' అని

వదిన వులిక్కిపడింది అన్నయ్య మండిపడ్డాడు అరగంటాదాకా మాట్లాడలేదు కూడా . తర్వాత అన్నాడు-

'నువ్వెందుకిలా అంటున్నావో నాకు తెలుసు యీ యిల్లు అమ్మి పెళ్లిచెయ్యడం నీకిష్టంలేదు

అయినా ఒక్కటి చెప్తున్నాను రేపు నేను వెళ్లి వాకబు చేస్తాను ఆ డాక్టరుగారి విషయం నాకు సంతృప్తి కలక్కపోతే నువ్వు అరిచి గీపెట్టినా నువ్వు ఎన్ని మాటలు అన్నాసరే నేనీ పెళ్లి చెయ్యను

నేను అప్పులపాలయినా అడుక్కుతిన్నాసరే నాకు ఫర్వాలేదు నిన్ను మాత్రం ఎవడికోకడికిచ్చి వదిలించుకుంటానని మాత్రం అనుకోకు అని ఖరాఖండీగా చెప్పేశాడు

అన్నయ్యకు డాక్టరుగారు పెట్టిన కండిషను తెలిస్తే బహుశా ప్రాణం పోయినా కూడా వొప్పుకొనేవాడు కాదేమో యీ పెళ్లికి

ఆ పెళ్లికి కూడా మొత్తం కలిసి పదిమంది రాలేదు వాళ్లు కేవలం యింట్లో పండుగ చేసుకున్నంత సింపుల్‌గా అయిపోయింది తండ్రి ప్రావిడెంట్ ఫండులో మిగిలిన రెండు వేలూ, మరో వెయ్యి మాత్రం అప్పుచేసి, ఆయనకొక జత బట్టలు, అత్తగారికి అడబడుచులకు చీరలు తీసుకున్నాడు అన్నయ్య .

పెళ్లిలో ఆయన పక్కన కూర్చున్నప్పుడు గానీ, తాళిబొట్టు కట్టేటప్పుడు గానీ, సుతారంగా ఆయన వేళ్లు మెడను తాకినప్పుడు గానీ తనకెందుకో ఒళ్లు పులకరించింది భక్తితో ఆ పాదాలు కళ్లకద్దుకోవాలనిపిస్తుంది

సీత ఆలోచిస్తూనే ఎప్పుడో నిద్రలో కొరిగిపోయింది . .

(ఇంకావుంది)

## మూగపిల్లపై అత్యాచారం

మూణారు మయిలాడుంపారై అనే వూరికి చెందన 18 ఏళ్ళ కుమారి అనే ఆమె మూగపిల్లట ఆ ఫిల్మమీద కన్నేసిన అదేవూరుకు చెందిన పెరుమాళ్ అనే అతను ఒక రోజునామె వంటరిగా యింట్లో వుంఢడం చూసి అమెను బలాత్కరించి తన కామదాహం తీర్చుకున్నాడట ఈతన్ని ఆ పని అయ్యాక సాంతనపారై పోలీసులు అరెస్టు చేశారట

## రక్షించన వక్షోజాలు

బ్రిటన్ యార్క్ నగరానికి చెందిన విక్కి నికొలస్ అనే ఆమె తన కారులో పోతుండగా అమె కారును మరో వాహనం ఘోరంగా ఢీ కొందట ఆ అఘాతానికి అమె స్టీరింగుమీద పడిపోయినా, గుండెకు దెబ్బతగలకుండా ఆమె వక్షోజాలు అమె ప్రాణాలను రక్షించాయట ఈమెకు అతి పెద్దవైన స్థనాలుండడం వల్ల బ్రిటన్‌లో చూపరులకు యీామె వో పెద్ద హాయినిస్తోందట ఇహ ఆ స్థనములు ఆమె ప్రాణాలు కాపాడాయని తెలియడంతో నే ఆమె రసికులు ఆనందంతో పేట్రేగి పోతున్నారుట- నాచురల్లీ!

## ప్రేమా? మజాకానా?

తమిళనాడు ఎల్త్లీగుండు అనే వూరిక చెందన సికందర్ అనే వో యువకుడు ఎదురింటి సారాబేగం అనే 20 ఏళ్ళ అమ్మాయిని ప్రేమించి గ్రంథం నఢిపి చివరి దశలో యిహ చేసేదేమిలేక ఆ పిల్ల తలి దండ్రులు ఆమెను పెళ్ళి చేసుకోమని అతన్ని బ్రతిమాలితే నాకు 20 కాసుల బంగారం, ఐదు వేలు రొఖ్ఖం కట్నంగా యిస్తేనే మీ అమ్మాయిని చేసు కుంటాను అన్నాడట ఈ కథ విన్న సారాబేగానికి




ఒళ్ళుమండి పోలీసు రిపోర్టిచ్చి ఆ సికందర్ తనకు రాసిన ప్రేమ లేఖలూ వగైరా వగైరా దాఖలు చేసిందట. దాంతో పోలీసు సికందర్‌ను అరెస్టు చేశారట- వెల్‌డన్ సారాబేగం!



## చోరీకి కూడా "కళ్ళు మూసుకున్న న్యాయదేవత

మద్రాసు ఎగ్మూర్ చీఫ్ మెట్రొపాలిటన్ మేజిస్ట్రేటు కోర్టు ఆధీనంలో వున్న రాగి తీగెలను వో ముగ్గురు యువకులు అతిలాఘవంగా తస్కరించారట వీరి ముగ్గుర్నీ రైల్వే పోలీసులు పట్టుకున్నారట- బాగు బాగు.. కోర్టులో దొంగతనం పోలీసు స్టేషనులో దొంగతనం ఇహనేం కావాలి!

## కోర్టు ఒప్పుకున్న మాతృత్వం!

1972లొ భారత దేశంలో ఓ యిద్దరు విదేశీయులు అరవింద్ ధిన్‌షా అనే అతను, ఎలిజబత్ అనే ఆమె వివాహం చేసుకున్నారట ఇద్దరూ కూడా మన దేశంలో పుట్టిన అమెరికా దేశస్థులట, అనక వారికి ఓ మగపిల్లాడు కలిగాడట, ఆ తరువాత వారికి అబిప్రాయ బేధాలు వచ్చి ఇరువురూ విడాకులు తీసుకుంటే కోర్టువారు పిల్లాడిని తల్లికి చెందేలా తీర్పు నిచ్చారట వీరు మిచిగాన్‌లో వుండగా తండ్రి ఆ పిల్లాడిని స్కూలు నుంచి ఎత్తుకు పారిపోయి భారతదేశం వచ్చి ఆ పిల్లాడిని పూనాలోని వో స్కూల్లో జేర్చాడట ఈ సంగతి తలస ఎలజబెత్ భారత సుప్రీమ్ కోర్టులో హెబియస్ కార్పస్ పిటిషను పెట్టుకున్నదట అమె మొర అమరికా కోర్టులు వినలేదట మన సుప్రీం కోర్టు యీ కేసు పరిశీలించి, పిల్లాడు మైనారిటీ తీరేవరకూ తల్లివద్దే వుండాలని తీర్పునిచ్చి, ఆ మేరకు ఆ పిల్లాడి తండ్రికి ఆజ్ఞ జారీ చేసిందట

## కంచే చేను మేసింది!

బెంగళూరు సదాశివనగర్‌కు చెందిన పోలీసులు తుమ్కూరు నుంచి దొంగతనం చేసి పట్టుకొచ్చిన సొమ్ములను ఆ దొంగల నుంచి స్వాధీనపరచుకుని అనక ఆ సొమ్మును తామే వాటాలు వేసుకుని పంచుకున్నారట ఆ స్టేషను సబ్‌ఇనస్పెక్టరు, అక్కడి మరో ముగ్గురు కానిస్టేబుల్సూ చేరి యీ సొమ్మును పంచుకోవడంతో తనకు వాటారాని మరో పోలీసీ విషయం పెద్ద పోలీస్టేషనుకు ఫిర్యాదు చేశాడట- అహో భారతదేశపు రాజ్యాంగ యంత్రమా!

## పోలీసు అధికారె వేశ్యాగృహాధిపతి!

ఢిల్లీ విమానాశ్రయం రిజనల్ రిజిస్ట్రేషన్ ఆఫీసుకు చెందిన పోలీస్ ఇనస్పెక్టరు జగ్‌దేవ్‌సింగ్ రాణాగారు ఢిల్లీలో జహంగీర్‌పురి హెచ్ బ్లాక్ 1550వ నెంబరు ఇంటిలో అతి సామర్థ్యంగా వేశ్యా గృహాన్ని, వేశ్యా వ్యాపారాన్ని నడుపుతున్నారట ఈ విషయం ఎవరో ఫోను చేసి కింగ్స్‌వే కామ్ప్ పోలీసు స్టేషనుకు తెలిపితే ఎ సి పి ఉజ్వల్ మిస్రా హుటాహుటి అక్కడికి వెళితే జగ్‌దేవ్‌సింగ్ గారె అక్కడ వున్నారట రంబా వూర్వశి వగైరాలు హాయిగా నిషాలో వున్నారట కామం తీర్చుకోడానికి వచ్చిన కామరాజులు అలాటి పనుల్లో వున్నారట ఈ వ్యవహారాన్నంతా రోజూ నిర్వహించే నాయకి 'మాయా' అనే ఆమె వున్నదట అక్కడేగాక బయటకు కూడా కాస్త హెచ్చు రేట్లమీద అమ్మాయిలను పంపే ఏర్పాటుందట అరెస్టయ్యాక ఆ జగ్‌దేవ్‌సింగ్ రాణాగారు లఘుశంకకని బయటికి వెళ్ళి, అంతర్ధానమై పోయారట

## ప్రాణం తీసిన ఉప్పు!

కోయంబత్తూరు తెలుంగుపాలయంలో 19 ఏళ్ళ మల్లిక అనే అమ్మాయి తన తల్లి అనారోగ్యంవల్ల నవంబరు 16వ తేదీన వంట తానొండుతానని సరదాపడి మొదటి ప్రయత్నంగా యూమ్మని ఉప్మా తయారు చేసిందట దాంట్లో ఉప్పు వేయడం మరచిపోయినందువల్ల అమె తల్లి టోకున వో అర్థగంట నానా తిట్లు తిట్టిందట లేనిపోపిక తెచ్చుకుని మధ్యాహ్నం వంటలో మల్లిక కాస్త మెలకువతో ఉప్పు ఉపయోగించిందట. అమె తయారు చేసిన కూటు ఉప్పుకషాయమై పోయిందని అమె తండ్రి వీరభద్రుడిలా ఆవేశపడి,




నటరాజులా నాట్యంచేసి, నారదుడిలా పాటపాడి చిందులు వేశాడట. దాంతో మనస్సు విరిగిపోయిన మల్లిక విషం త్రాగి యీ విషయం వో ఉత్తరంలో రాసి, నిండు ప్రాణాన్ని తీసుకున్నదట ☐

# ఆ ఇంటి దీపం

## విశ్వనాథ రమ

వాలు కుర్చీలో కూర్చున్న సత్యం మాస్టారు అసహనంగా అటూ ఇటూ కదిలారు గుర్రుగా మనవడి వంక చూసారు ఆ చూపులు లక్ష్యం లేనట్టు రాము ఊతకర్ర తాతగారి చేతిలోంచి లాగుతున్నాడు '

ఎబ్బే ఎబ్ ఈ, ఈ ! అంటూ పకపక నవ్వుతున్నాడు

ఒసేయ్ సుందరం! ఇలా రా! నా ప్రాణాలు వీడు తినేసేటట్టున్నాడు కోపంగా భార్యని కేకేసారు

ఆ పిలుపుకి కూర కలుపుతున్న గరిటితో నే హాల్లోకి వచ్చింది సుందరమ్మ

వీడల్లరి రోజు రోజుకీ మితిమీరిపోతోంది నే భరించలేక పోతున్నాను గబుక్కున వెళ్ళి రాము చెయ్యిపట్టుకొని వంటింట్లోకి తీసుకుపోవడానికి ప్రయత్నించిం దావిడ వాడు ససేమిరా రాకుండా నేలమీద వెల్లకిలా పడ్డాడు

నే ఛస్తే గాని నీకు బుద్ధిరాదు నా ప్రాణాలు తియ్యడానికో పుట్టావ్ వెధవా!" వాడి జబ్బమీద రెండు చరిచింది వాడు ఏడుపు లంకించుకున్నాడు

అది చూసేసరికి సత్యం మాస్టారి కోపమంతా హరించిపోయింది మాటలు రాకుండా వెర్రివాడిలా బతుకుతున్న మనవడ్ని చూసి బరువుగా నిట్టూర్చారు

రాము పుట్టిన దగ్గర్నుంచీ ఇదే వరుస ఎంతమంది డాక్టర్లకి చూపించినా ఫలితం లేకపోయింది.

తమ పెళ్ళయిన పదేళ్ళకి అపురూపంగా పుట్టింది లలిత ఎంతో గొప్ప సంబంధం అని చెల్లెలి కొడుకు ఇంజనీర్ అవడంవలన ప్రాతికవేలు కట్నం ఇచ్చి పెళ్ళిచేసాడు

తమ ఖర్మో, మేనరికంవల్లో తెలీదు కాని లలితకి పుట్టిన ఇద్దరు మగపిల్లలు మూగతనంతో వెకిలి చేష్టలుతో ఉంటారు ఆ పిల్లలు పుట్టిన దగ్గర్నుంచీ లలితకి సుఖంలేదు లోలోపలే మదనపడుతూ వాళ్ళపనే చేస్తూ ఉంటుంది

కూతురు బతుకు చూసిన సుందరమ్మ పెద్దవాడు రవిని కూతురు దగ్గరుంచి చిన్నవాడైన రాముని తన దగ్గరపెట్టుకొంది

తెల్లవారిన దగ్గర్నుండీ వెర్రివాడైనా రాముతో యాతనపడుతూనే ఉంది సుందరమ్మ ఎప్పుడైనా రోడ్డుమీద కెళ్ళాడంటే వాడి వెనకాలే ఉంటుంది ఏమూల సందులోకి వెళిపోతాడేమోనని వేయి కళ్ళతో వాడి చర్యల్ని కనిపెడుతూనే ఉంటుంది

ఇంట్లో ఏ వస్తువు కళ్ళకి సూటిగా కనిపించినా గబుక్కున తీసి నేలమీదకి విసిరేస్తుంటాడు అందుకే సాధ్యమైనంతవరకు వాడికందకుండా అన్ని వస్తువులు పై అల్మారాలో ఉంచుతుంది

రిటైర్ అయిన సత్యం మాస్టారు అప్పుడప్పుడు వాడల్లరికి తాళలేక సుందరమ్మమీద కేకలేస్తూ ంటారు ఆ కోపం మీద సుందరమ్మ పిల్లాడిమీద చెయ్యిచేసుకుంటే అతను బాధపడటం ఆ ఇంట్లో పరిపాటైంది అప్పటికీ సుందరమ్మ మనవడ్ని ఎంతో జాగ్రత్తగా చూసుకొంటుంది వాడు తింటున్నవి గమనించి అవే ఏదేపదే చేసిపెడుతూ కొసరి కొసరి తినిపిస్తుంది

సాయంకాలం వేళ వీధిగుమ్మంలో కూర్చోపెట్టుకొని అన్నీ చూపిస్తూ వాడ్ని నవ్విస్తుంది

మనవడు తన మాట వినకపోవడంతో సహనం కోల్పోయిన సుందరమ్మ భర్తమీద విరుచుకు పడింది

'వాడు, మీరు ఇంట్లో ఉండి నా ప్రాణాలు తియ్యకపోతే అలా వీధిలోకి వాడ్ని తీసుకెళ్ళ కూడదూ! ఇద్దరికీ ఊసుపోతుంది! చివరికి తనమీదే విరుచుకు పడిన భార్యని క్రీగంట చూసి వాలు కుర్చీలోంచి లేచారు సత్యం మాస్టారు

తర్వాత మళ్ళా గుర్రుగా మనవడి వంక చూసారు అప్పటికే వాడు ఏడుపుమాని దెబ్బలాడుతున్న దంపతుల వంక అర్థంకానట్టు చూస్తూ వెర్రిగా నవ్వుతున్నాడు నవ్వుతున్న రాము వైపు సాలోచనగా చూసి ఓ మూలగా ఉన్న చెప్పులు తొడుక్కున్నారు

అది చూసిన వెంటనే ఒక్కపరుగుతో తాత దగ్గరకొచ్చి ఆయన పంచె పట్టుకొని లాగసాగేడు

ఎవరు చెప్పులు తొడుక్కుని బయటి కెళ్ళ బోతున్నా తనని కూడా తీసుకెళ్ళమని మారాం చేస్తాడు అప్పుడప్పుడు సత్యం మాస్టారు పనిమీద వీధిలో కెళ్ళినప్పుడు రాము అడ్డుపడకుండా గట్టిగా పట్టుకుంటుంది అలా అడ్డుచేస్తే ఆ రోజల్లా ఏడుస్తాడు పనిలేని వేళల్లో మంచి డ్రస్సువేసి చెప్పులు తొడిగి అతని వెంట పంపిస్తుంది

రాము పంచె లాగడం చూసి చిరాగ్గా మొహం పెట్టారు సత్యం మాస్టారు

సుందరం! వీడిక్కూడా చెప్పులు తొడుగు! గట్టిగా అరిచారు సుందరమ్మ గబుక్కున వెళ్ళి వంటింట్లో పొయ్యిమీద ఉడుకుతున్న కూరని మరో సారు కలియబెట్టి చెయ్యికడుక్కుని హాల్లోకి వచ్చింది

మూల నున్న ఎర్ర చెప్పులు బయటికి తీస్తూంటే రాము కళ్ళల్లో కోటి దీపాలకాంతి ప్రస్ఫుటించింది.

ఉత్సాహంగా చెప్పులు తొడుక్కున్నాడు వెర్రి ఆనందంతో అరుస్తూ తాత చెయ్యిపట్టుకొని ప్రపంచాన్ని జయించిన వీరుడిలా వీధిలోకి నడిచాడు

* * *

మాష్టారు వీధి మలుపుదాటి మెయిన్‌రోడ్డుమీదకి వచ్చారు రోడ్డుమీద పోయే బస్సుల్ని, లారీల్ని వింతగా చూస్తున్నాడు రాము

పైడితల్లి కిళ్ళీ కొట్టుదగ్గర ఆగి వక్కపొడి పేకెట్టు తీసుకొని ఇంటివైపు నడిచారు మాష్టారు సరిగ్గా అప్పుడే విజయనగరంనుండి వాల్తేరు వెళ్ళే నాన్‌స్టాప్ బస్సు వచ్చి కిళ్ళీ కొట్టు దగ్గర ఆగింది

బస్సుకోసం వెయిట్ చేస్తున్న పాసింజర్లు ఆదుర్దాగా బస్సెక్కడంతో అక్కడున్న రాము కూడా వాళ్ళతో పాటు బస్సెక్కాడు వెంటనే బస్సు కదిలింది

రెప్పపాటులో జరిగిపోయిన దృశ్యం చూసి పైడితల్లి షాక్‌నుండి తేరుకొని కండక్టర్ నుద్దేశించి గట్టిగా కేకలు పెట్టేడు అతని కేకలు గాల్లోనే కలిసిపోయాయి

మనవడు వెనకాలే వస్తున్నాడనుకుని మాష్టారు ఏదో గొణుక్కుంటూ నడుస్తున్నారు

వెంటనే పైడితల్లి పరిగెట్టుకుంటూ వచ్చి రొప్పుతూ చెప్పేడు బాబు! మీ మనవడు వైజాగ్ బస్సెక్కి వెళ్ళిపోయాడు" ఆ మాటలకి మాష్టారు అర్థంకానట్టు చూసారు చుట్టుపక్క లెక్కడా రాము జాడ కనిపించలేదు

ఏవిఁట్రా నువ్వంటున్నది !

అవును బాబు! పరాగ్గా మీరెళ్ళిపోతూంటే ఆగిన బస్సులో మీ మనవడెక్కేసాడు!"

అంతే! మాష్టారి గుండె ఆగినంతపనైంది. మాటలేని రాము బస్సులో హు ఇంక ఊహించలేక పోయారు

ఆ బస్టాండులో దిగి ఎటు వెళ్ళిపోతాడో! ఏం చెయ్యాలో తెలీక భార్యకీ విషయం చెప్పాలని గబగబా ఇంటివైపు నడిచారు

ఒంటరిగా ఇంట్లో అడుగుపెడుతున్న భర్తని చూసి కంగారుగా అడిగింది సుందరమ్మ

రాము ఏడి!"

జరిగినదంతా పూసగ్రుచ్చినట్టు చెప్పి కుర్చీలో కూలబడిపోయారు మాష్టారు

అతని మాటలకి గుండె ఆగినంత పనైంది సుందరమ్మకి రెండు నిమిషాలపాటు శిలా ప్రతిమలా ఉండిపోయింది ఆ పట్నంలో దిగి ఎక్కడికి పోతాడో వెర్రి నాగన్న! ఫలానా అని చెప్పుకోవడాన్కి భగవంతుడు నోరు కూడా ఇవ్వలేదు

ఎంత జాగ్రత్తగానో పెంచుతామని చెబితే కళ్ళనిండా నీళ్ళుపెట్టుకొని తన వెంట పంపించింది లలిత ఇప్పుడు దానికేం సమాధానం చెబుతుంది

మూగైనా, గ్రుడ్డైనా దాని పిల్లలు దానికి భారం కాదుకదా! ఒక్కనాడు కూడా పిల్లలిలా అయ్యారని బాధపడదు ఒక్కొక్కప్పుడు తను బాధపడుతూంటే వెకిలిగా నవ్వుతుంది

"పిల్లలులేని వాళ్ళకంటే నయం కదమ్మా! అంటూ తనని ఓదారుస్తుంది

ఒక్కసారిగా ఉప్పెనలాంటి దుఃఖం ముంచుకొచ్చింది

రాముా! ఎంత పని చేసావురా! బాధగా ఆక్రోశించిందామె హృదయం

తర్వాత గంటముందు జరిగిన సంఘటన తలుచుకొని బాదగా అంది

ఇంతకు ముందే వాళ్ళు తిట్టారుగా! ఇంక హాయిగా ఉంటే సరి పాడు నోరుతో నేను కూడా అనరాని మాటలన్నాను వాడినోటికి మాట లేదు కాని మనసు కుండదా ? మీ కింతే కావాలి అన్నట్టు వెళ్ళిపోయాడు

వెర్రో మొర్రో కొంపలో తిరుగుతూంటే ఊసుపోయేది వాడులేకపోవడం వల్లకాటిలా అయింది కొంప ఆమె ఆవేదన అంచులు దాటింది

ఇంక మాస్టారి పరిస్థితి వర్ణనాతీతం బరువెక్కిన గుండెతో కుర్చీకంటుకుపోయారు

ఇలా అవుతుందనొ తను మాత్రం కల గన్నాడా! ఏడు పదులు దాటటంవల్ల సహనం నశించిపోయింది తన బలహీనత అసహాయతవల్ల అందరి మీద చికాకు కోపం అధికం కాసాగాయి అయినా రాము ఎంతల్లరి చేసినా తప్పనిసరిగా భరించటం నేర్చుకున్నాడు మనసు బాగులేనప్పుడు వాడల్లరి భరించలేక చికాకు పడతాడు తప్ప వాడిమీద తనకి ప్రేమ లేదా! బాధగా కణతలు రుద్దుకొన్నాడు

* * *

నాన్‌స్టాప్ బస్సు ఉరకలు పరుగులతో విశాఖపట్నం చేరుకుంది పాసింజర్సందరి తో పాటు కండక్టర్ కూడా బస్సు దిగాడు డ్రైవర్ సింహాచలం అలసటగా రెండు క్షణాలపాటు కళ్ళు మూసుకొన్నాడు తర్వాత ఒక్క ఉదుటన లేచి బస్సులోకి చూసాడు

అంతే! షాక్ తిన్నట్టుగా ఉండిపోయాడు తర్వాత తేరుకొని అటువైపు అడుగులు వేసాడు

బస్సు చివరి సీట్లు నోట్లో వేలువెట్టుకొని వెకిలిగా నవ్వుతూ కనిపించాడో పిల్లడు

నువ్వు దిగలేదేం! మీ వాళ్ళు లేరా!

మళ్ళా అదే నవ్వు

నీ పేరేంటి? ఏ ఊరు మీది

ఎబ్ ఎబ్బ్ ఈ ఈ !

జరిగిన దేవిటో క్రమంగా అర్థమైంది సింహాచలానికి

వేంకటేషు ! అంటూ గట్టిగా కండక్టర్ని కేకపెట్టేడు ఆ అరుపుకి ఉలిక్కిపడుతూ బస్సులోకి వచ్చేడు కండక్టరు కొంప మునిగిందిరా! వెర్రి పిల్లడు మన బస్సెక్కేసాడు వెంకటేషు తేరిపారా ఆ పిల్లడ్ని చూసాడు క్రమంగా ఎక్కడ ఆ పిల్లడు ఎక్కాడో అర్థమైంది పాసింజర్లతో ఎక్కుతూంటే వాళ్ళ తాలుకా అనుకున్నాడు

పైడితల్లి కిళ్ళీకొట్టుదగ్గర ఎక్కాడు ఆ పిల్లడు మళ్ళా అక్కడికే అప్ప చెప్పేస్తాను

గమ్మున ఆ పని చేసుకురా! ఈ పిల్లడి గలోళ్ళు



ఎంత గాబరాపడుతున్నారో!

అప్పుడే ఇంకో బస్సు బయలుదేరబోతూంటే రాము చెయ్యిపట్టుకొని ముందుకి నడిచాడు కండక్టర్

ఇంకో బస్సులోకి ఎక్కుతూంటే ఉత్సాహంగా కేకలు పెట్టాడు రాము అది చూసి సింహాచలం బాదగా తనలో తాను నవ్వుకున్నాడు

ఓరి వెర్రి నాగన్నా! కష్టసుఖలనేవి తెలియకుండా ఎక్కడికి పడితే అక్కడికిపోతూ నవ్వే ధ్యేయంగా "పెట్టుకున్నావ్" ఈ కుళ్ళు ప్రపంచంతో సంబందం లేకుండా ఆ నవ్వుతో నే హాయిగా బతుకు

బస్సు బరువుగా ముందుకి కలిదింది

* * *

పైడి తల్లి కళ్ళు నక్షత్రాల్లా మెరిసాయి ఎదురుగా కండక్టర్ చెయ్యిపట్టుకుని రాము నవ్వుతూ కొపించాడు

ఒరేయ్! ఈ పిల్లడు మా బస్సులో ఎక్కేసాడు ఎవరి తాలుకో నీకు తెలుసునా!

తెలుసు పాపం ఆ ముసిలి మాస్టారు మనవడు ఆళ్ళు తెగబాద – పడిపోతున్నారు నేనింటికి అప్పచెబతాలే!" అంటూ కిళ్ళీకొట్టు పని కుర్రాడికి అప్పచెప్పి రాము చెయ్యందుకున్నాడు పైడితల్లి

ఆ మాటకి కండక్టర్ హృదయం తేలికపడి రాము బుజం ఆప్యాయంగా తట్టాడు

హలో! —గీతా




## ఆ ఇంటి దీపం

నిస్త్రాణంగా నేలమీద పడుకున్న సుందరమ్మ గుమ్మంలో అలికిడవడంతో నీరసంగా తలెత్తి చూసింది ఎదురుగా నవ్వుతూ రాము

అంతే! ఒక్కసారిగా వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది

రామూ! అంటూ గబుక్కున వెళ్ళి వాటేసుకుంది కుర్చీలో మగతగా కళ్ళు మూసుకున్న మాస్టారు ఆ పిలుపుకి ఓంకార నాదం విన్నట్టుగా కళ్ళు తెరిచి చూసారు

ఆ ఇంటి దీపంలా వెర్రి నవ్వులు నవ్వుతున్నాడు అలవాటైన పరిసరాలు గమనించి గంతులు వేస్తున్నాడు రాము

పైడితల్లి జరిగినది చెబుతూంటే వినిపించుకునే స్థితిలో లేరా దంపతులు

మాస్టారు ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచి మనవడి దగ్గరకెళ్ళి వళ్ళంతా నిమిరారు అతని కళ్ళనుండి జాలువారుతున్న అశ్రుధారలు రాము శరీరాన్ని తడిపేసాయి

పైడితల్లి వెళ్ళిపోబోతూంటే సుందరమ్మ ఆగమని చెప్పి రెండు సున్నుండలు తెచ్చి అతడి చేతిలో ఉంచింది

నీ రుణం తీర్చుకోలేం రా! అంటూ

తర్వాత భర్తనుద్దేశించి అంది

ఉదయంనుండీ రాముతో సహా ఆహారం ఎంగిలి పడలేదు వండిన వంట అలాగే ఉంది త్వరగా మడికట్టుకోండి! అంటూ రాముని వంటింట్లోకి తీసుకెళ్ళింది □




బసవయ్య గారికి విజయువాడలో కాలు మోపటం అదే జీవితం. బెజవాడ బెజవాడ అని అనుకోవటమే కాని అది సరిగ్గా ఎక్కడుందో దాని పొలిమేర ఎంతో అయన ఏనాడూ ఊహించుకోలేదు. తెలుసుకోలేదు. అసలు ఆ అవసరమే ఆయన కింతవరకు కలుగలేదు ఆ బెజవాడకు ఎనభై మైళ్ళ దూరంలో ఉన్న తన ఊళ్ళో గల కొద్ది పాటి కొంచెమను ఆరుగాలం కనిపెట్టుకొని ఉండటం, దాన్ని తన చెమట నీటితో తడుపుతూ ఫలసాయాన్ని తింటూ తను నేర్చుకొన్న నాలుగు పదాలు పాడుకొంటూ తృప్తిగా తన ప్రపంచంలో తను బ్రతకటమే గాని బయటి ప్రపంచ విషయాలను జొత్తిగా పట్టించుకోని వారాయన. ఊరు రెండు ముఠాలుగా చీలి కొట్టుకొని కోర్టుకెక్కినప్పుడు, ఎలక్షన్ల తుఫానులో ఊరు అల్లాడి పోతున్నప్పుడు బసవయ్య గారి ప్రాణం విలవిల లాడేది. తను చెప్పదలుచుకొన్న వాళ్ళందరికీ తగాదాలు వద్దని, ఊళ్ళో చిచ్చు రగిలించ వద్దని చెప్పేవాడు. విన్నవాళ్ళందరూ 'నీకు తెలియదు నువ్వూరుకో' అనేవాళ్ళు గాని ఆయనమాట వినేవాళ్ళు కాదు. తన కున్న దాంట్లోనే ఓ పిడికెడు ఇంకొకరికి పెట్టాలనే ధర్మ బుద్ధి ఆయనది. ఎప్పుడైనా ఆయన భార్య 'మన కెంతుందని మనం ఈ ధర్మాలు చేయటం' అని విసుక్కుంటే 'ఉన్నదాంట్లోనే .... అయినా ఒకళ్ళకి పెట్టిందే మన పాలు మనం తిన్నది మట్టి పాలే అని మా నాయనమ్మ చెప్పేది' అనేవాడు. ఆమాట కాదు 'నాయనమ్మ రోజులు పోయాయి. పైసాకి పైసా ముడేస్తే గాని ఈ రోజుల్లో నెట్టుకు రాలేం' అనేది. ఆ మాటలకు ముసి ముసి నవ్వులు నవ్వుకోవటం తప్ప వాదన పెంచే వారు కాదు. అన్న మాటకు కట్టుబడి ఉండటం, నీతిగా నిజాయితీగా బ్రతకటం ఇంకొకరి పైసాకు ఆశపడకుండా ఉండటం ఆయనకు తాత తండ్రుల నుండి సంక్రమించిన బుద్ధులు. అవే ఆ ఊళ్ళో ఆయన నొక మంచి మనిషిగా నిలబెట్టాయి. ఆకుటుంబం మీద గల సదభిప్రాయాన్ని పెంపు చేశాయి.

బసవయ్య గారికి ఇద్దరే పిల్లలు. ఒక కొడుకు - ఒక కూతురు. కూతుర్ని దగ్గరలో ఉన్న హైస్కూల్లో ఎనిమిదో తరగతి వరకు చదివించి ఆ తర్వాత తగిన సంబంధం చూసి పెళ్ళి చేశాడు. కొడుకును మాత్రం బాగా చదివించాలనే. కోరికతో పై చదువులు చదివించాడు. 'మాకెట్లాగూ ఈ మట్టిలో కొట్టుకోవ రాత తప్పదు. నువ్వయినా బాగా చదువుకొని ఉద్యోగం చేసుకో' అని తరచు కొడుకుని హెచ్చరిస్తూ ఉండేవాడు. ఆయన అనుకొన్నట్టుగానే కొడుకు బాగా చదువుకొని మంచి ఉద్యోగస్తుడయ్యాడు. అతడికి ఉద్యోగం వచ్చినపుడు ఊళ్ళో వాళ్ళు "నీకింకా దిగులేముంది బసవయ్య గారూ. నీ కొడుకు ఉద్యోగస్తుడయ్యాడు. ఊ....' అని అంటుంటే 'ఆ! నాదేముంది. అంతా వాడి కష్టార్జితం: అదృష్టం' అనేవాడు. ఆ నాడే ఆమాటే అన్నాడు. అతడ్ని గూర్చి ఎందరో అంటున్నారు.

ఉద్యోగం రాగానే కొడుకుకు ఎన్నో సంబంధాలు వచ్చాయి. అయితే పెళ్ళి విషయంలో నిర్ణయాన్ని అతడికే వదిలివేశాడు. మంచి కట్నంతో డిగ్రీచదివిన కలవారి పిల్లనే భార్యగా తెచ్చుకున్నాడు కొడుకు. పెళ్ళయిన క్రొత్తలో ఏ పది రోజులు ఉన్నదో అంతే. మళ్ళీ తన ఇంట్లో ఆ పిల్ల నిద్ర చేసినట్టు గుర్తులేదు బసవయ్య గారికి. ఎప్పుడైనా వచ్చినా చుట్టంల్లా చూపుగా ఉదయమే వచ్చి రాత్రికి వెళ్ళిపోయేది. కోడలు వచ్చి పది ఏళ్ళయినా ఆమెకి తనకి మధ్య ఒక్క పలకరింపు కూడలేదు. ఎప్పుడైనా కొడుకు వచ్చి 'నా దగ్గరకు వచ్చి నాలుగ

రోజులుండరాదా నాన్నా' అంటే ఏదో పనుల సాకు చెప్పి 'ఇప్పుడు కాదులే' అని వాయిదా వేసే వాడు కాని ఇవాళ అతని ఇల్లు వెతుక్కుంటూ తనే బయలు దేర వలసి వచ్చింది

మూడు రోజులనాడు కొడుకు వచ్చి నాన్నా మెం, బెజవాడలో కట్టిన ఇల్లు పూర్తయింది శనివారం నాడు గృహప్రవేశం ఇవాళ సాయంత్రం వెళదాం' అని అన్నాడు కొడుకు ఇల్లు కట్టు కొన్నందుకు సంతోషంగానే ఉన్నా మూడు రోజుల ముందు వెళ్ళి అక్కడ ఉండటం బసవయ్య గారికి ఇష్టం లేక 'ఇప్పట్నుంచే ఎందుకురా! నేనా రోజుకు వస్తాలే ఇన్నాళ్ళు ఇల్లు వదిలేస్తే ఎలా? అంతగా అయితే నీ వెంబడి మీ అమ్మను తీసుకు వెళ్ళు' అని భార్యను ప్రయాణం చేయించి పంపించాడు ఆవిడకు కొడుకు దగ్గర ఉండిపోవాలని ఎంతో కోరిక. ఆ మాట తన దగ్గర అంటే బసవయ్య గారూరుకొనే వాళ్ళు కాదు 'ఎవరి కాపురాలు వాళ్ళ వయ్యాక ఒక కుటుంబం మీదకు ఇంకో కుటుంబం వెళ్ళి పడటం చాల తప్పు' అని మందలించేవాడు ఆమె మరి మాట్లాడేది కాదు.

బసవయ్య గారు విజయవాడ బస్స్టాండులో బస్ దిగగానే ఎదురుగా నవ్వుతూ కన్పించాడు అల్లుడు రామారావు 'నేను రెండు గంటల నుంచి నీకోసం చూస్తున్నాను ఇంత ఆలస్యమయిందేం మామయ్యా' అని అడుగుతూ ఆయన సమాధానం కోసం ఎదురు చూడకుండా 'రా వెళదాం' అని బయటకు దారి తీసి ఆటో మాట్లాడుకొని మామగారితో కలిసి బయలుదేరాడు ఆటో బందరు రోడ్డు మీదుగా ఏలూరు వైపుకు మలుపుతిరిగి కొంత దూరం పరుగెత్తి కుడివైపు రోడ్డు వెంబడి పోతూ మలుపులు తిరుగుతూ రామారావు చూపిన ఇంటి ముందు ఆగింది

అంతసేపూ బెజవాడ మహానగరాన్ని నోరు తెరుచుకొని చూస్తూ 'అల్లుడు కనబడక పోతే ఏం చేసేవాడినో' అని ఆలోచనలో ఉన్న బసవయ్యగారు ఆటో ఆగిన కుదుపుతో ఆలోచనలు కట్టిపెట్టి అల్లుడితో పాటు ఆటో దిగి ఎదురుగా ఉన్న రెండంతస్థుల మేడను ఎగాదిగా చూడసాగాడు. ప్రహరీ గేటు తీసుకొని లోపలకు వెళ్తున్న రామారావు 'రామామయ్యా' అన్న మాట ఆయన చెవి కెక్కనే లేదు. ఆ మేడ వైపే చూస్తూ సడలిన పంచ కట్టును బిగించుకున్నాడు నాలుగడుగులు వేసి వెనక్కి తిరిగిన రామారావు మామగారు వెంటరాకపోయే సరికి మళ్ళీ ఒక కేక వేశాడు దాంతో బసవయ్యగారు అల్లుడిని అనుసరించారు

చుట్టూ ప్రహరీ గోడతో తగినంత కాంపౌండుతో నెత్తి మీద నీళ్ళ టేంకుతో నాలుగు పోర్షన్లుగా అధునాతనంగా అందంగా కట్టబడిన రెండంతస్థుల మేడ అది కాంపౌండు నిండా రకరకాల పూల మొక్కలతో పాటు ఒక మామిడి చెట్టు, ఓ అరడజను కొబ్బరి చెట్లు పెరుగుతున్నాయి. ఆ కాంపౌండు షామియానాలతో నిండి ఉంది.

అల్లుడితో పాటు కాంపౌండు దాటి ఒక పోర్షను

## విరోధాభాసం!

మల్లె
మందారం
నందివర్ధనాలు
నానా జాతుల పుష్పమాలల
తోరణాలు కట్టినా
ఆ పందిరి కింద
పెళ్ళాడే జంటది మాత్రం
ఒకే కులం!

–కాపువీధి బాలరమేష్

## పున్నామ నరకం

వరండాలోకి అడుగు పెట్టిన బసవయ్య గారికి అక్కడ ఏడెనిమిది మందిలో కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్న కొడుకు కనిపించాడు తనకన్న రెండడుగులు ముందు అక్కడికి వెళ్ళిన రామారావును 'ఏం బావా ఇంత ఆలస్యమయింది' అని అడిగి, అతడు చెప్పిన సమాధానం విని 'సరే! పైకి వెళ్ళండి' అని కబుర్లలో పడి పోయిన కొడుకు ముఖంలోకి విస్తుపోయి చూచారు బసవయ్య గారు

'రండి పైకి వెళదాం' అన్న అల్లుడిని అనుసరిస్తూ మెట్లు ఎక్కబోతుంటే ఆ పక్కనే ఆడుకొంటున్న రామారావు ఇద్దరు కూతుళ్ళు 'తాతయ్యొచ్చాడు తాతయ్యొచ్చాడు' అంటూ బసవయ్య గారిని చుట్టేశారు 'మీరెప్పుడొచ్చా రమ్మా' అని వాళ్ళని పలకరించి 'పైకి వెళదాం రండి' అన్నాడు.

'మేం నిన్న వచ్చాం తాతయ్యా! మేము పైకి రాము ఇదుగో మామయ్య ' వాళ్ళ చిట్టితో ఆడు కొంటున్నాం' అన్నారు పక్కనేఉన్న ఆరేళ్ళమ్మా యిని చూపిస్తూ. పట్టు లంగా, జాకెట్టు వేసుకొని మెడలో లాకెట్టు, చేతులకి గాజులు, చెవులకి జూకాలు, పాపటి సేరు, చెంపసరాలు పెట్టు కొన్న ఆ బంగారు బొమ్మను చూస్తూ 'నేనెవరో తెలుసాతల్లీ' అన్నారు బసవయ్య గారు. ఆ పిల్ల తల అడ్డంగా ఊపింది

'మా తాతయ్య! నీకూ తాతయ్యే లే' అంది రామారావు చిన్న కూతురు.

ఇంతలో 'చిట్టీ! నిన్నొచ్చి ఇంట్లో కూర్చో మనలా! ఒంటి నిండా అవన్నీ పెట్టుకొని బయట గంతు లేస్తున్నావా? దరిద్రపు దానా! రా లోపలికి . ఇదుగో వాసూ! అమ్మాయిని లోపలకు తీసుకురా' అన్న మాటలు విన్పించాయి.

అది కోడలి గొంతని బసవయ్య గారు గ్రహించి చిట్టితో మరో మాట మాట్లాడే లోపే వాసు వచ్చి ఆ పిల్లను లోపలికి తీసుకు వెళ్ళాడు. రామారావు కూతుళ్ళు కూడ 'మీ అమ్మ కేకలేస్తుందమ్మ! లోపలే ఆడుకొందాంలే చిట్టీ!' అని ఆ పాపతో పాటు లోపలికి వెళ్ళారు బసవయ్య గారు పైకి వెళ్ళి ఒక కుర్చీలో కూర్చున్నారు

తను కొడుకు ఇంటికి వెళ్ళగానే అతడు ఎదురు వచ్చి తనను లోపలకు తీసుకు వెళతాడని, బసవయ్యగారు ఆశపడలేదు కాని కనీసం 'ఇప్పుడేనా నాన్నా రావటం' అని పలకరించక పోడనే ధైర్యం ఉండేది తను అనుకొన్న దొకటి ఎదురైన అనుభవం మరొకటి తను బడికి వెళ్ళి చదువుకొన్న వాడుకాదు. చదివిన వాళ్ళతో కలిసి తిరిగిన వాడూ కాదు ఆరుగాలం చాకిరీ చేసుకొనే తన మోటు శరీరం ఇళ్ళల్లోను, ఆఫీసుల్లోను నిరంతరం పంకాల క్రింద కూర్చుంటూ ఒళ్ళలవనీయని బస్తీ సుకుమారు లను ఆకర్షించేది కాదు తన తండ్రి ఇంత మోటు మనిషి అని తెలిపితే ఆ సుకుమారులు భరించలేరేమో. అలా చెప్పటం తన హోదాకి, గౌరవానికి అడ్డు కాక పోతే, మొట్ట మొదటి సారి తన ఇంటికి వచ్చిన కన్న తండ్రిని పలకరించకపోవటానికి కారణం ఏముంటుంది? కొడుకు మీద తన కెంతటి వాత్సల్యం ఉందో ఆ కొడుకుకు తెలియనిదికాదు. తన మనసులో అతడిమీదఉన్న తపనకు అతని నుండి తను ఆశించేది 'నాన్నా' అనే ఆప్యాయపు పిలుపు తప్ప ఇంకేదీ లేదు ఆ పిలుపె కరువైనప్పుడు, ఆ ఆప్యాయతే దూరమై నప్పుడు తండ్రి – కొడుకు అనే అనుబంధం మాత్రం ఎక్కడ నిలిచి ఉంటుంది?

'నాన్నా! కాఫీ తీసుకో' అన్న మాటతో తలెత్తి చూచాడు బసవయ్యగారు 'ఇప్పుడు [illegible] ఉన్నావేం' అంటూ కప్పు అందిస్తోంది కూ[illegible] జానకి పేలవంగా నవ్వుతూ కప్పంది[illegible] నువ్వెప్పుడొచ్చావ్' అన్నారు

'నిన్న'

'గృహప్రవేశం ఎన్నింటికి?'

'తెల్లవారు ఝామున మూడింటికి'

'సరే కాని అమ్మాయ్ ! ఈ ఇల్లు [illegible]ంత అయ్యిందంటావ్'

'కనీసం నాలుగు లక్షలయినా అయ్యుంటుంది ఇళ్ళ స్థలమే అరవై వేలు పెట్టి కొన్నాడట.'

'మరి ఇంత ఇల్లు కట్టటానికి వీడి కంత డబ్బెక్కడిదే? అత్తగారిచ్చారా?'

'ఏమో నాన్నా! కొంత సర్దారేమో! ... అయినా వీడు రెండు చేతులా సంపాదిస్తున్నాడటలే' రహస్యం చెపుతున్నట్లు గొంతు తగ్గించి అంది

'అంటే .'

'ఏముంది! చేసేది ఇంజినీరు ఉద్యోగం గదా! పై రాబడి బాగానే ఉంటుంది.'

"అంటే లంచాలా?'

అవునన్నట్లు తలూపింది జానకి.

'నా కొడుకు లంచాలకు మరిగాడా?' ము[illegible] మీద వేలేసుకుంటూ చిన్నగా అన్నారు

'లేకపోతే జీతం డబ్బుల్లో మిగిల్చి ఇం[illegible]ంత బిల్డింగులు కట్టగలడేంటి! అయినా అవన్నీ మనకెందుకు గాని నువ్వుస్నానం చేస్తావా?' అంది

జానకి ఖాళీ కాఫీ కప్పు అందుకొంటూ

తల అడ్డంగా తిప్పారు బసవయ్యగారు

జానకి క్రిందకు వెళ్ళి పోయింది

'తన కొడుకు లంచాలు తీసుకొంటున్నాడా? పరాయి సొమ్ముకు పాల్పడు తున్నాడా?' బసవయ్య గారికి నమ్మ బుద్ధి కాలేదు ఒకనాటి సంఘటన కళ్ళముందు కదిలింది

తనకు పదిహేను పదహారు సంవత్సరాల వయసులో ఒక వేసవి కాలంలో గొడ్లను పొలాన కట్టేసే రోజుల్లో పొలాన ఉంచిన గడ్డి అయిపోతే, ఇంటి దగ్గర నుంచి తెచ్చేదానికి బద్ధకం వేసి పొద్దు కూకే దాకా పొలానే ఉండి చీకటి పడిన తర్వాత దగ్గర్లో ఉన్న మునసబు గారి వామిలో నుంచి గడ్డి తెచ్చి గొడ్లకు వేశాడు పొద్దున్నే తండ్రి అడిగాడు నిన్న ఇంటి దగ్గర నుంచి గడ్డి తీసుకు వెళ్ళినట్టు లేదు. చేలో గొడ్లకి గడ్డేం వేశావురా రాత్రి?' అని తను చేసిన పని చెప్పాడు తండ్రికి. అప్పుడాయన అన్న మాటలు తనకింకా గుర్తున్నాయి

'ఒరేయ్ దేవుడు మనకేదో ఇంత ఇచ్చాడు. ఊళ్ళో చాలా మంది కన్నా మనం బాగానే బ్రతుకు తున్నాం. మన పెద్ద వాళ్ళు ఎంతో కష్టపడి ఉన్నప్పుడు తిని లేనప్పుడు పస్తులుండి ఈ మాత్రం ఆస్తి సంపాదించి మనకు ఇచ్చి వెళ్ళారు. వాళ్ళకి ఉన్ననాడు ఇంకొకరికి కూడ పెట్టారు లేనప్పుడు ఇంకొకరి పచ్చి గడ్డి పరకకు కూడ ఆశ పడలేదు. ఇవాళనువ్వు గడ్డి మోపు దొంగతనం చేశావు. రేపు ఇంకొకటి చేస్తావు అలవాటు పడ్డ మనసు ఆపుకోలేవు నీ కొడుకిలా చేస్తున్నాడని నా చెవుల పడ్డనాడు నా ప్రాణం మాత్రం ఉండదు కట్టెల్లో టుంది గుర్తుంచుకో'.

నిప్పులాంటి కుటుంబం తనది. అటువంటి కుటుంబంలో పుట్టినవాడు లంచగొండి తమ్ముడంటే నమ్మకం కుదరటం లేదు బసవయ్య గారికి అయితే అమ్మాయి చెప్పినట్లు కేవలం జీతం డబ్బుల్లో మిగిల్చి ఈ పదేళ్ళలో ఇంత ఇల్లు కట్టటం వాడ అసాధ్యమే. అయితే వాడి అత్తగారు ఉన్నవాళ్ళు వాళ్ళు సహాయం చేసి ఉండవచ్చు. నిజమేమిటో ఎలా తెలుస్తుంది? బసవయ్య గారు అన్వేషణలో పడ్డారు ఆయనకు సరైన సమాధానం దొరకలేదు నిజమేమిటో చెప్పమని కొడుకు నడగటానికి మనసొప్పటం లేదు

గృహప్రవేశ కార్యక్రమం చక్కగా జరిగిపోయింది. మధ్యాహ్న భోజనానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి బసవయ్య గారు ... ఆటూ ఇటూ పచార్లు చేస్తున్నారు గేటు బయట కుర్చీలు, డైనింగ్ టేబుల్స్ తీసుకొని ఒక లారీ వచ్చి ఆగింది బసవయ్య గారక్కడికి వెళ్ళారు నలుగురు మనుషులు ఆ సామాను దించి లోపల పెట్టే ప్రయత్నంలో ఉన్నారు

లారీ డ్రైవరు లారీ దిగి వెనక్కి వచ్చి బిల్డింగ్ వంక చూస్తూ సామాను దించుతున్న ఒక వ్యక్తితో 'మీ ఇంజినీరు గారు మంచి బిల్డింగే కట్టాడ్రా సుబ్బారావ్' అన్నాడు

'ఆయనకేం రా బాబూ! లక్షల్లక్షలు సంపాయిం చేస్తున్నాడు కంట్రాక్టర్లతో కుమ్మక్కైపోయాడు. అంత సంపాయిస్తాడా! రేయింబవళ్ళు చాకిరీ చేసే నా బోటోడికి పది రూపాయ తీయటానికి ప్రాణం మీది కొస్తదనుకో ఏ అమ్మా బాబు కడుపున పుట్టాడో గాని ..'

ఆ తర్వాత అతడు మాట్లాడిన మాటలు బసవయ్య గారికి వినబడలేదు ఆయనకు కళ్ళు తిరిగి మైకం కమ్మినట్లయి ప్రహరీ గోడకు ఆనుకొని కళ్ళు గట్టిగా మూసుకొని తలను అటూ ఇటూ నాలుగు సార్లు విదిలించాడు. కొంచెం ఫరవా లేదనిపించింది. కళ్ళు తెరిచాడు. ఇందాక ఆ మాటలు మాట్లాడిన మనిషి నెత్తి మీద కుర్చీలు పెట్టుకొని లోపలికి వెళుతున్నాడు. ఒక్క నిమిషం అలాగే నిలబడి స్థిమిత పడ్డాక షామియానా లోకి వెళ్ళాడు అక్కడ ఆడుకొంటున్న జానకి కూతురును పిలిచి 'మీ అమ్మను పిలుచుకురా' అని పంపాడు

'ఏమిటి నాన్నా' అంటూ వచ్చింది జానకి

'నేను ఇంటికి వెళుతున్నాను.'

'ఇప్పుడా? భోజనం చేయకుండానా? ఏం అంత తొందర?'

'ఏం లేదు' అని నాలుగడుగులు వేసి 'నా భోజనం నాకు వడ్డించారులే' అంటూ గేటు దగ్గరకు వచ్చాడు

మీ మాటలు నాకర్థం కావటం లేదు ఏమైంది నాన్నా' వెంట పడింది జానకి

'నిన్నటి నీ మాట నిజమైంది' అంటూ అడుగు లేస్తూ సాగిపోయాడు.

జానకి తండ్రి వెళ్ళిన వైపే చూస్తూ నిలబడింది ఆయన మాటల కర్థం ఆమెకు క్రమంగా బోధ పడింది

అయిదారిళ్ళ అవతల బసవయ్య గారిని దాటుకొంటూ స్కూటర్ మీద అప్పుడే ఇంటి కొచ్చిన యజమాని గేటు దగ్గరే నిలబడి ఉన్న జానకితో 'ఎక్కడికే నాన్న వెళుతున్నాడు' అన్నాడు

'ఇంటికి వెళుతున్నాడట. ఆయనిక రాడు' దృఢంగా అంది జానకి.

'ఎందుకు? ఏమైంది?'

'ఏమో! వెళ్ళి ఆయన్నే అడుగు'

స్కూటర్ వెనక్కి తిప్పి బయలుదేరాడు ఈలోగా బసవయ్య గారు రోడ్ పాయింట్‌కు చేరారు

తన ప్రక్కనే స్కూటర్ ఆపి 'ఎక్కడికి నాన్నా! భోజనం కూడా చెయ్యకుండా బయలుదేరు తున్నావ్' అన్న కొడుకుతో 'భోజనమా! ఇంకా నీ ఇంట్లోనా! ఆ పాపపు కూడు నాకరగదు నీతి

నిజాయితీలే కూడు నీళ్ళుగా బతికిన వంశానికి నీబోటి లంచగొండిని వారసుడిగా చేసిన పాపాత్ముడ్ని నిన్ను కూడ నాలాగే మట్టిలో కొట్టుకోనీయకుండా ఇంతింత చదువులు చదివించి పొరపాటు చేశాను

ఈ పాపిష్టోడికి కొడుకూ లేడు గిడుకూ లేడు వాడిని ఇప్పుడే చంపేసుకొని పాపాన్ని కడుక్కున్నాను. నా వంశానికిక వారసుడు లేడు' అంటూ అప్పుడే ఆగి బయలుదేరబోతున్న సిటీ బస్‌లోకి ఎక్కేశారు బసవయ్య గారు. □





# క్రీడారంగంలో అపజయాలకి బాధ్యత సమాజానిదే!

అంతర్జాతీయ పోటీలలో మన క్రీడాజట్లు పాల్గొని, ఓటమి పొందినపుడు విమర్శించటం మనకు అలవాటు. కాని యీ విమర్శకులు ఎప్పుడైన తన కుటుంబములో ఎంతమంది క్రీడలలో పాల్గొంటున్నారు? తాము క్రీడారంగమునకు అందించిన చేయూత ఏమిటి? అని ఆలోచించారా? క్రీడాకారునిగా రూపొందుటకు మన సమాజం అందించిన సహాయము, ప్రోత్సాహము ఏమిటి? మన పిల్లలు ఆటలు ఆడుకొనుటకు ఎంతవరకు మనము ఆటస్థలాలు ఆటల సామగ్రీ యివ్వ కలిగాము? యవ్వనములో తమ సుఖసౌఖ్యాలన్నీ వదలుకొని ఎంతో కృషిచేసి మనదేశ జట్ల విజయాలకు కృషిచేసిన మేటి ఆటగాళ్ళు వృద్ధాప్యములో గుర్తింపులేక, సరియైన ఆహారము, నివాసములేక ఉసూరుమని జీవిస్తుంటే మన



జోఫిలిప్స్.

సమాజం వారికి ఏమిచేసినది? విదేశములలో క్రీడారంగములో అందరు పాల్గొంటారు. క్రీడాకారులకు అన్ని సదుపాయములు లభిస్తాయి. వృద్ధాప్యములో వారి సుఖజీవనానికి సహాయము లభిస్తున్నది. మరి మన కనీస సౌకర్యములు యివ్వక, ప్రోత్సాహము అందించక పతకములు సాధించలేదని క్రీడాకారులను విమర్శించటం ఎంతవరకు సమంజసము అనేది ఆలోచించాలి.

జోఫిలిప్స్ 1936 బెర్లిన్ ఒలింపిక్స్‌లో హాకీ మాంత్రికుడుగా ఖ్యాతినొందిన ధ్యాన్‌చంద్ సారధ్యమున బంగారు పతకము గెల్చిన మనదేశ హాకీ జట్టులో 'రైట్‌ఫుల్ బ్యాక్' 1916 మార్చి 24న పాతఖడ్కి బజారు ప్రాంతములో పేద యింట జన్మించాడు. ఏడుగురు మగబిడ్డలు కలిగిన కుటుంబములో మూడవవాడు. పేదరికంవలన చదువుయందు ఆసక్తి ఉన్నా అభ్యసించలేక పోయాడు. తన నివాస స్థానము సమీపమునగల మైదానంలో హాకీ ఆడేవాడు. 14 వ ఏటనే 'ఖడ్కి యునైటెడ్ క్లబ్'లో ఆడాడు. బొంబాయిలో రాష్ట్ర జట్టుకు ఎంపిక అయి జాతీయ పోటీలలో పాల్గొన్నాడు. ఇతనిలోని ప్రతిభను గుర్తించి మన జాతీయ జట్టులో ఎంపిక చేసారు. అప్పుడు జోఫిలిప్స్ పూనాలోగల బ్రిటిష్‌వారి మందుగుండు ఫ్యాక్టరీలో రోజుకు తొమ్మిది అణాల కూలీగా పని చేస్తున్నాడు. బెర్లిన్ ఒలింపిక్స్‌కు వెళ్ళేఖర్చు ఆటగాళ్లు కొంత భరించవలసి వచ్చినది. మనదేశం బ్రిటిష్‌వారి పరిపాలనలో యుండుటవలన, ఆర్థిక సహాయము అందలేదు. పూనా ప్రజలు విరాళాలు యిచ్చి సహకరించారు. బెర్లిన్ ఒలింపిక్స్‌లో మన జట్టు అద్భుతముగా ఆడింది. ఫైనల్సులో జర్మనీను 8–1 స్కోరుతో ఓడించి బంగారు పతకము గెల్చినది. ఆ తర్వాత రెండవ ప్రపంచ యుద్ధము వలన 1948 వరకు ఒలింపిక్ పోటీలు జరగలేదు. స్వదేశంలో అగ్రగామి హాకీ పోటీలలో జోఫిలిప్స్ పాల్గొన్నాడు. విజయాలు సాధించాడు. కాని అతని పరిస్థితిలో మార్పురాలేదు. 1956 లో ఆటనుండి విరమించుకున్నాడు 70 ఏళ్ల జోఫిలిప్స్ నేడు పూనాలో 'ఖడ్కి బజారు'లో చెక్కలతో కట్టిన ఒక చిన్న యింటిలో ఉంటున్నాడు. యిప్పటికి రోజు కూలీచేసి కుటుంబాన్ని పోషించుకుంటున్నాడు. ఒకరిని చేయిచాచి సహాయము అడగటానికి యిష్టపడడు.

జోఫిలిప్స్ యింటికి కొంతదూరములో అతనితో పాటు బెర్లిన్ ఒలింపిక్స్‌లో ఆడిన మరొక ఆటగాడు బాబు నిమల్ నివాసం. 82 ఏళ్ల బాబు నిమల్ ఏ ఆధారములేక కొడుకువద్ద ఉంటున్నాడు. చిన్నప్పుడు ఖడ్కి జట్లలో హాకీ ఆడేవాడు. జోఫిలిప్స్‌లాగే ఆయుధ కర్మాగారములో 'హెల్పర్'గా పని చేసాడు. బొంబాయి రాష్ట్ర జట్టు ఆటగానిగా జాతీయ పోటీలలో ఆడాడు. బెర్లిన్ ఒలింపిక్స్‌లో పాల్గొనుటకు ఎన్నో కష్టాలు ఎదుర్కొన్నాడు. తర్వాత బెర్లిన్‌లో యితని ప్రతిభను పత్రికలు కొనియాడాయి. బెర్లిన్ ఒలింపిక్స్ హాకీ ఫైనల్సు ఇండియా – జర్మనీ ఆడినప్పుడు ఆ ఆటని అడాల్ఫ్ హిట్లర్ తిలకించాడు.

ఈ యిద్దరు వృద్ధ క్రీడాకారులను సమాజం మరచిపోయినది. అంతేకాదు హాకీ సమాఖ్యకు వీరి దీన పరిస్థితి తెలిసికూడా సహాయము చేయగల స్థితిలో లేదు. హాకీ సమాఖ్యకు క్రికెట్ సమాఖ్యవలె ఆర్థిక బలములేదు; మరొక హాకీ ఆటగాడు కలకత్తా రేవులో బస్తాలు మోస్తున్నాడు. ఒలింపియన్ తంగరాజ్ ఊటీలో పేదరికములో జీవిస్తున్నాడు. కలకత్తా మైదానములో తెలుగువారి కీర్తి ప్రకాశించినట్లు చేసిన మేటి ఫుట్‌బాల్ ఆటగాడు కాకినాడ రాములు నేడు అనకాపల్లిలో 82 వ ఏట పేదరికమువలన ఎన్నో కష్టాలు అనుభవించుచున్నాడు.

మనదేశము పతకములు సాధించినప్పుడు ప్రశంసించి, ఓటమి పొందినప్పుడు విమర్శించే మన సమాజం ఒకప్పుడు మనదేశ కీర్తికోసం తమ సర్వస్వము అర్పించిన మేటి క్రీడాకారుల గురించి ఎప్పుడైన ఆలోచించినదా. అదే పాశ్చాత్య దేశాలలో అయితే విజేతలకు వృద్ధాప్యములో సుఖ సౌకర్యములు లభిస్తున్నాయి. సంఘములో గౌరవము అందుచున్నది.

ఇక తమ పిల్లలు ఆడుకొనుటకు సమాజం ఎంతవరకు ఆటస్థలములు సమకూరుస్తున్నది. అనేక పాఠశాలలకు ఆటస్థలములు లేవు. పట్టణములలో ఆటలయందు ఆసక్తి కలిగిన బాలబాలికలు రోడ్డు ప్రక్కన వాహనముల రద్దీ స్థలము దుమ్ములో ఆటలు ఆడుకొనుట మన సమాజంలో గల పెద్దలు చూస్తుయుంటారు కాని వారికి ఆటస్థలములు సమకూర్చు ఆలోచన మాత్రం వారికి ఉండదు. నగరములలో ఆధునిక సదుపాయములుగల క్రీడాంగణములు లేవు. అతి చిన్న దేశములు అయిన మలేషియా, కొరియా, జపాన్, ఫిలిపైన్స్, శ్రీలంకలలో సహితము ఆధునిక సదుపాయములుగల క్రీడాంగణములు అనేకము ఉండగా మనహాకీ, ఎథ్‌లెట్స్ యితర క్రీడాకారులు 'ఆస్ట్రోటర్ఫ్'పై ఆడుటకు ఢిల్లీ నెహ్రూ స్టేడియం పాటియాల ఎన్. ఐ. ఎస్. కు వెళ్లాలి. సువిశాల దేశములో కనీస ఆటసదుపాయములు కూడా



బాబు నిమల్

కరువైనవి. అడవులు, సముద్ర తీరాలు మన ఆటస్థలాలుగా యున్నవి.

ఇక మన సమాజంలో ఆటలలో పాల్గొనుటకు ఎంతమంది తమ పిల్లలను పంపుచున్నారు అనేది ముఖ్యప్రశ్న. పిల్లలలో ఆటలయందు ఆసక్తి యున్నను, తల్లితండ్రులు తమ పిల్లలు ఆటలు ఆడుటవలన భవిష్యత్తులో ఉన్నత విద్య అభ్యసించేస్థాయికి రాలేరని పంపరు. తమ పిల్లలు డాక్టర్లు, ఇంజనీరులు, ఐ. ఎ. ఎస్‌లు అవాలని ఆశిస్తారే కాని మంచి క్రీడాకారునిగా రూపొందాలని ఏ తల్లీ తండ్రి కోరడు. ఇది మన దురదృష్టం.

ఇక ఆడపిల్ల అయితే అసలు యిష్టపడరు. పి. టి. ఉష, షైనీ అబ్రహం. వలసమ్మలాంటి అగ్రగామి క్రీడాకారిణులు తయారు అగుటకు కారణము వారి తల్లి తండ్రుల ధైర్యము. వారు సమాజ పరిస్థితి తెలిసియు ధైర్యముగా ఆడపిల్లలను ఆటలకు పంపియుండుటవలననే నేడు మనకు పతకములు లభించాయి. క్రీడాకారిణులను తమ కోడళ్లుగా చేసుకొనుటకు ఎంతమంది తల్లితండ్రులు యిష్టపడ్తారు. ఎంతమంది విద్యార్థులు ముందుకు వస్తారు.

అన్నింటికన్న ముఖ్యము మన క్రీడారంగ సమాఖ్యల ప్రవర్తన, అధినేతలకు పదవుల యందు యున్న ఆసక్తి క్రీడాభివృద్ధియందు లేదు.

నేడు మన ఓటమిలకు కారణము మన సమాజమే అంటాను!

–ముకరమ్

## వీర మహిళ మల్లాది సుబ్బమ్మ :-

నా సాహిత్యానికి కేంద్రం స్త్రీ, నా ఉపన్యాసానికి మకుటం మహిళ నా కార్యరంగానికి మూలం అబల ధ్యేయం స్త్రీ విమోచనం అది సంఘ సంస్కరణ కాని, మత సంస్కరణ కాని, కుల నిర్మూలన సమస్యకాని, స్త్రీ విముక్త్యోద్యమంకాని మరేదయిన కాని నా ఆదర్శం, లక్ష్యం స్త్రీ జనాభ్యుదయం ఏదే ఉంటుంది స్త్రీలు మారితేనే సమాజంలో మార్పు వస్తుందని, దేశ సౌభాగ్యం వర్ధిల్లుతుందని నా భావం దానికి కారణం నా గత జీవితంతో ముడిపడి ఉంది అంటారు సంఘ సంస్కరణోద్యమ రణరంగంలో మన విజయాలు పొందిన వీరనారిమణి సోదరి శ్రీమతి మల్లాది సుబ్బమ్మ సుబ్బమ్మ అనే పేరులోనే సమర దుందుభులున్నాయేమో అనుకుంటాను స్వాతంత్ర్య సమరంలో దువ్వూరి సుబ్బమ్మగారి నిప్పులు కురిసే దేశభక్తి ప్రసంగాలు విన్నవాడిని ఎందరు పోటీకి వచ్చినా తలవంచేట్టు చేసే కడప రామ సుబ్బమ్మగారి సమరశంఖారావాలూ విన్నవాడిని కనుక సుబ్బమ్మ అన్న పేరులోనే ధైర్య సాహసాలు ఉన్నాయని భావిస్తున్నాను నిజానికి సుబ్బుడు- సుబ్రహ్మణ్యుడు దేవసేనాని, అమరదేవతకదా! పూర్తిగా వైదికమైన కుటుంబంలో జన్మించిన ఈమె ఇంతటి సంఘ సంస్కర్త్రి కావడానికి ఏదో బలమైన కారణం ఉండాలికదా ఉంది, పదేళ్ళు నిండీ నిండక ముందే, బాల్య వివాహపు రోజుల్లో, ఐదవ తరగతి చదివిన ఈమెకు పెద్దలు వివాహం కుదిర్చారు మంచీ చెడూ తెలియని ఆ నుంచే కుటుంబ బాధ్యత పడి వెనుదిరిగి , 24 సంవత్సరాల వయస్సుకే నలుగురు పిల్లల తల్లి అయింది కాని జిజ్ఞాస హృదయంలో కుంభగత ప్రదీప కళికలా వెలుగుతూనే వుంది భర్త శ్రీ రామవ సంస్కార ప్రియుడు, న్యాయవాది ప్రజాసేవ సనాతనాచార నిమ్మలైన అత్త మామలు ధ్వన్నా తెగించి, భర్త ప్రోత్సాహంతో 38వ ఏట మెట్రిక్ ప్యాసయి క్రమంగా ముగించింది పిదప ఒక సంవత్సరం హైదరాబాద్‌లో హాస్టలులో ఉండి కుటుంబ సంక్షేమ శిక్షణ పొందింది దానివల్ల వెలుపలి ప్రపంచంతో వివిధ వర్గాల వారితో పరిచయం కలిగింది మనస్సులోని పెక్కు అడ్డు గోడలు కూలిపోయాయి విశిష్ట విశాల దృక్పథం ఏర్పడింది నవచైతన్యం కలిగింది ఈ దృక్పథం చైతన్యం తోటి మహిళలలో కూడ కలిగించాలనే తపన తీవ్రమైంది, ఆరాటం అంచులు దాటింది జీవితమంతా దానికోసం మీదుకట్టింది ఆమె బాధ్యతగల స్థానాల్లో ఉండి సంఘాలను నడప గలననే ఆత్మస్థైర్యం కలిగింది 1957లో బాపట్లలో స్త్రీ పోషకాహార మండలి కార్యదర్శినిగా కండెన్స్‌డ్ కోర్సు నడపగలిగింది సహకార మహిళా కుటీర పరిశ్రమ సంఘానికి 14 సంవత్సరాలు కార్యదర్శినిగా దాదాపు వేయిమంది స్త్రీలకు కుట్లు, అల్లికలు చేతిపనులు నేర్పింది శారదా మహిళా విజ్ఞాన

# హైదరాబాద్ నోట్‌బుక్

సమితి ప్రెసిడెంటుగా పెక్కు సభలు, సమావేశాలు నిర్వహించింది గుంటూరు జిల్లా గౌరవ కుటుంబ నియంత్రణ ప్రచారకురాలుగా పల్లె పల్లె తిరిగింది ప్రకాశంజిల్లా ప్రొబేషన్ ఎడ్వయిజరీ కమిటీ సభ్యురాలుగా ఖైదీలలో నైతిక దృక్పథం కలిగించింది విజయవాడ ఫిలిం సంఘం అధ్యక్షురాలుగా స్త్రీ సమానత్వ వ్యక్తిత్వాలు ప్రతిపాదించే సినిమాలే చూపాలని ప్రోత్సహించింది చిన్ననాడు తాను చదివిన స్కూలుకే మేనేజరుగా వుండి స్కూలును అభివృద్ధి పరచింది ఆంధ్ర మహిళా సభ, ఆంధ్ర యువతీ మండలి, మహిళావేదిక, గ్రామీణాభివృద్ధి సలహా సంఘం మున్నగు వాటిలోనే కాక జంట నగరాలలోని వివిధ సాంఘిక రాజకీయ సారస్వత సంఘాలతో సంబంధం కలిగి విస్తృత సేవ చేసింది అభ్యుదయ మహిళా సమాఖ్యను స్థాపించి అధిక ధరలపై, కల్తీలపై, కూరగాయల ఎగుమతిపై పోరాటాలు ప్రదర్శనాలు, ధర్నాలు, నిరాహార దీక్షలు నిర్వహించి విజయం సాధించింది అఖిలభారత జనతంత్ర సమాజ్, భారత రాడికల్ హ్యూమనిస్టు, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం మున్నగు రాష్ట్రీయ, జాతీయ సంఘాలలో బాధ్యత గల పదవులు నిర్వహించి జనప్రబోధం చేసింది రాజకీయాలలో పాల్గొని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని తొలగించినప్పుడు సేవ్ డెమోక్రసీ ఉద్యమం జరిపి కారాగారవాసం అనుభవించింది భావప్రచారానికి పత్రికలు జీవగర్రలనే ఉద్దేశంతో 1974లో వికాసమనే మాసపత్రిక స్థాపించి పది సంవత్సరాలు



నడిపి స్త్రీల సమస్యలను ప్రచారం చేసింది 1980 నుంచి వ్యాసాలు, పుస్తకాలు ప్రచురించడం ప్రారంభించి నవలలు, వ్యాస సంకలనలు, పరిశీలన గ్రంథాలు అనువాదాలు దాదాపు నలభై ప్రచురించింది వీటిలో కొన్ని, ఇస్లాం- స్త్రీలు, క్రైస్తవం స్త్రీలు, హైందవం- స్త్రీలు, భారతనారి ఆదర్శం (అనువాదం), వివాహం- నేడురేపు ఆధునిక స్త్రీ, మహిళాభ్యుదయం బంగారు సంకెళ్ళు మహిళా దశాబ్దం, స్త్రీ విమోచన, ఓ మహిళా ముందుకు సాగిపో, మారుతున్న సమాజం- మహిళలు, భావ వాహిని, విముక్త్యోద్యమాలు- మహనీయులు తల్లే పిల్లను చంపితే, స్త్రీల హక్కులు సాగా ఆప్ స్ట్రగుల్, మాతృత్వానికి మరోముడి, వుమెన్- ట్రెడిషన్ అండ్ కల్చర్, ప్రేమ+సెక్స్=నీతి వెలిగిన జ్యోతి, కాంతి కిరణాలు, చకటి వెలుగులు, ఈ దేశం నాదేనా?, ఆంధ్రప్రదేశ్ మహిళోద్యమం- మహిళా సంఘాలు, ఏది అశ్లీలం? వ్యభిచారం ఎవరి నేరం? మహిళా వికాసం, వివాహం సంతానం కోసమేనా? మున్నగునవి 1980లో మహిళాభ్యుదయ సంస్థ స్థాపించి మహిళల విజ్ఞాన వికాసానికి, 1981లో అభ్యుదయ వివాహవేదిక స్థాపించి వరకట్న నివారణకు కృషి చేస్తున్నది 'మల్లాది సుబ్బమ్మ ట్రస్ట్' అని ఒక ట్రస్ట్ స్థాపించి దాని రాబడితో స్త్రీ సమస్యా పరిష్కారానికి కృషి చేస్తున్నది స్త్రీల విముక్తి శిక్షణ శిబిరం స్థాపించి వివిధ సిద్ధాంతాలపై శిక్షణ ఇవ్వడానికి పథకం తలపెట్టింది ఇలా స్వయం కృషితో, మూఢాచారాలను తోసుకుని ముందుకు వచ్చి, అచంచల దీక్షతో మహిళాభ్యుదయానికి సేవ చేస్తున్న శ్రీమతి సుబ్బమ్మకు అభినందన సంస్థ మహిళా విభాగం నవంబరు 27 సాయంకాలం త్యాగరాజ గానసభ హాలులో తొలిసారిగా నెలకొల్పిన దుర్గాబాయి దేశ్‌ముఖ్ అవార్డును బహూకరించింది బాల్‌భవన్ డైరెక్టర్ ప్రముఖ నవలా రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి అధ్యక్షతన జరిగిన ఈ సభకు ఓపెన్ యూనివర్శిటీ ఉపాధ్యక్షులు డాక్టర్ సి నారాయణరెడ్డి ముఖ్య అతిథిగా శ్రీమతి సుబ్బమ్మను అభినందన పత్రాన సత్కరించి అవార్డు బహూకరించారు శ్రీమతి సుబ్బమ్మలో జరిగిన క్రమ వికాసాన్ని ఆయన

వేటగాడు చూచు చున్నాడని
గూటిలో గువ్వ దాగదు
గొడ్డలి వేటు పడుతుందని
కొమ్మ ఎదగడం మానదు
గుండెలో సుడిగుండాలున్నా
నిండుగా పారును ఏరు
పక్కనే బురద ఉన్నా
పచ్చగాపెరుగును పైరు

అని కవితలో చిత్రించారు కుమారి వాసిరెడ్డి సీతాదేవి శ్రీమతి సుబ్బమ్మ కృషికి ఓపెన్ యూనివర్శిటీ డాక్టరేట్ ఇవ్వాలని సూచించారు శ్రీమతి తురగా జానకీరాణి ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తూ శ్రీమతి సుబ్బమ్మతో తమకు గల సన్నిహితత్వం వివరించి



ఇటీవల ఢిల్లీలో శ్రీ రాజీవ్‌గాంధీని కలిసి "వినతిపత్రం" అందజేసిన సందర్భంలో మన రాష్ట్ర మెజీషియన్ శ్రీ బి. వి. పట్టాభిరామ్ అప్పటికప్పుడు ఒక మేజిక్‌ను చూపిస్తున్న దృశ్యం

# అవీ-ఇవీ-అన్నీ

## 'ఆపదలో అనూరాధ' ఆవిష్కరణ

నవంబరు 27న ప్రముఖ రచయిత శ్రీ ఎం. డి. సౌజన్య తమ జ్యేష్ఠ కుమార్తె, చి. సౌ. ఖాలిదానస్రీన్ వివాహం, షేక్ మహబుల్లాషాతో జరిగిన సందర్భముగా, 'ఆపదలో అనూరాధ' నవల శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మగారిచే ఆవిష్కరిప జేశారు. తెనాలి, ప్రేమీ మండలి మహావిద్యాలయములో జరిగిన నవలావిష్కరణోత్సవములో, ప్రముఖ రచయితలు శ్రీ హితశ్రీ, డా. కె. రవీన్ద్ర బాబు, తెనాలి సెంట్రల్ బ్యాంక్ మేనేజర్ శ్రీ వి. ఎస్. మూర్తి 'ఆపదలో అనూరాధ' నవలలోని సామాజిక, సాహిత్య విలువలను గురించి ప్రసంగించారు.




శ్రీ వెంకటేశ్వర కళాలయం (షదరాను) వారు తమ సంస్థ 15వ వార్షికోత్సవ సందర్భంగా నిర్వహించిన నాటిక, ఏకపాత్రాభి నయ పోటీలలో ఉత్తమ ద్వితీయ నాటిక (అతిథి దేవుళ్లొస్తున్నారు)కి శ్రీ పాటిబండ్ల విజయలక్ష్మి నుంచి బహు అందుకుంటున్న శ్రీ సత్యనారాయ

## సీరియల్స్

నటి పూర్ణిమ ముఖచిత్రంతో వెలువడిన నవంబర్ 21-27, 86 నాటి సంచిక చాలా చక్కగా ఉంది. 'పావని' సీరియల్ రసవత్తరంగా సాగుతున్నది. వచ్చే సంచిక కోసం ఎదురు చూస్తూ-

-యస్. వెంకటేశ్, జువారి నగర్ (గోవా)

★ ★ ★

'రసరాగ వాహిని" కొత్త సీరియల్ ప్రారంభం చాలా బాగుంది. వసంతలాంటి సంగీత ప్రోత్సాహకులు ప్రతి వూళ్లోను వుంటే, అబ్బా సంగీత

## ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

ప్రియులకు ఎంత హాయి!

-చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం.

★ ★ ★

పూర్ణిమ ముఖచిత్రంతో విడుదలైన సంచికలో కె. నాగేశ్వరి సరికొత్త సీరియల్ "రసరాగ వాహిని" ఆదిలోనే బాగుంది.

-ఎం. శివాజీ, కె. శైలజ, మోదుకూరు ☐

## హైదరాబాద్ నోట్ బుక్

దుర్గాబాయి దేశ్‌ముఖ్ అవార్డుకు తొలిసారిగా ఆమెను ఎన్నుకోడంలో గల ఔచిత్యాన్ని ప్రశంసించారు. శ్రీమతి సరళారాణి శ్రీమతి సుబ్బమ్మ కృషిని ప్రశంసించారు. ప్రారంభంలో అభినందన మహిళా విభాగం అధ్యక్షురాలు శ్రీమతి జయశ్రీ సారధి స్వాగతం చెప్పారు. ఉత్సవం శ్రీ జి. వి. ఎన్. రాజు మిమిక్రీతో ప్రారంభమైంది. నాయకులను, సినిమా నటులను, పిల్లలను, రేడియో వార్తా ప్రసారకులను చక్కగా అనుకరించారు. తర్వాత ప్రదర్శితమైన 'రచయిత్రులున్నారు జాగ్రత' అనే వ్యంగ్య నాటికలో కుమారి వాసిరెడ్డి సీతాదేవి అన్నట్లు నాటిక సందర్భానుగుణం కాకపోయినా- నటీమణులు గృహిణులు, తొలిసారిగా రంగుపూసుకున్నవారు అయినా చక్కగా నటించారు. పని మనిషి కనకం- శ్రీమతి భవాని, ఎడిటర్- శ్రీమతి నళిని, సుబ్బాయమ్మ- శ్రీమతి సుబ్బలక్ష్మి, అండాళమ్మ- శ్రీమతి రాజ్యలక్ష్మి సురేంద్రన్, జలజ- శ్రీమతి వసుంధర. రచన, దర్శకత్వం శ్రీ వై. రామకృష్ణరావు. అ... అవార్డు ఇచ్చిన అభినందన సంస్థ ఛెయి... శ్రీ వంశీ రామరాజును, మహిళా విభాగం అధ్యక్ష... శ్రీమతి జయశ్రీ సారథిని, ప్రధాన కార్యదర్శిని ...తి ఇ. భవానీ శరత్‌ను, సంయుక్త కార్యదర్శిని ...మారి సునీలను, సంస్థతో సహకరించిన సిండెట్ డిటర్జెంట్ వాషింగ్ పౌడర్ నిర్మాతలు అజయ్ కెమికల్ వర్క్సును అభినందిస్తున్నాను.

**ఉపశ్రుతి :-**

హైదరాబాద్ నుంచి రాయచూరుకు నాన్‌స్టాప్ బస్సులో పోతున్నాను. బస్సు రాయచూరు చేరినా బస్సు టెర్మినస్‌లో ఆగక ముందుకు పోతూంది. ఇదేమిటి గమ్యం వచ్చినా, గాడీ ఆగదా?- అనడిగాను. నాన్‌స్టాప్ కదసార్!- అన్నాడు సహృదయుడైన కండక్టర్.

-తిరుమల రామచంద్ర



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667


ఉద్యోగ ప్రకటనలలో అప్లికేషన్ని
రిజిష్టర్ పోస్టులో పంపమన్నారు!
తో ఆశవదులుకున్నా...!


పోస్టల్ రేట్లు పెరిగాయి.
— రఘు


అమ్మాయికి ఉత్తరం రాయటం
ఎందుకూ, చూసి వస్తే సరి...
త్రైటికెట్ స్థాయికి పోస్టల్
రేట్లు పెరిగాయి.


అయితే మనం పావురాలను
పెంచుకుందామండీ! ఎంచక్కా...


ఈసారి ఇంటికొస్తున్నట్లు టెలి
గ్రామ్ ఇవ్వకు.. ఆ డబ్బులు టికె
ట్లకి పనికివస్తాయి..!


సార్! పోస్టల్ రేట్లు పెంచినందుకు
కార్టూనిస్టులూ, రచయితలు మిమ్మల్ని
"ఘెరావ్" చేస్తారట!
రఘు

# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!

# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు:

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్.రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నిస్మా రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.



మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్.

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
ఆబిడ్ సెంటర్ హైదరాబాద్ - 500 001.

Kiron-MCF